గౌరవ సంపాదకులు:

శ్రీ తల్లావజ్ఝుల శివ శంకర శాస్త్రి

శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రి

గౌరవ సహాయ సంపాదకుడు:

శ్రీ జనమంచి కామేశ్వర రావు

సంపాదకుడు:

శ్రీ బాలాంత్రపు సత్యనారాయణ రావు

# ఏకాంకికలు

శ్రీ శివ శంకర శాస్త్రి

సంకలిత సంపాదితము

౧




ఆంధ్ర ప్రచారిణి లిమిటెడ

రాజమహేంద్రవరము



అంకితము

శ్రీ నోరి నరసింహ శాస్త్రికి



సామాన్యంగా వినోదార్థం పాఠశాలలలో ప్రదర్శనలు చేసేవారు, ప్రతాపరుద్రీయంలోనుంచో, బొబ్బిలియుద్ధంలోనుంచో, కన్యాశుల్కములో నుంచో కొన్నిరంగాలు ప్రదర్శించటం పరిపాటి. పెద్దనాటక సమాజాల వారుకూడా అప్పుడప్పుడు చాచా ప్రదర్శనములు చేసేవారు. అటువంటివి అతుకు లతుకులుగానే ఉంటవి. కళాదృష్టితో రచించిన ఏకాంకికలు ఆడితే కలిగే ఆనందం పైవాటివల్ల కలగదు.

ఇది ప్రథమసంపుటి. ఇందులో నాటిక లన్నీ ప్రదర్శనీయోగ్యములు. సందర్భాన్నిబట్టి రంగస్థలములో చిన్నమార్పులు చేస్తూ వస్తే, ప్రేక్షకులకు ప్రీతి కలగక పోదు.

కళాశాలలలో గాని, జల్సాలలో గాని, ఉత్సవసమయాలలో గాని, ఉత్సాహముతో నాటికలు ప్రదర్శించ దలచుకొన్న వారికి ఈసంపుటి ఉపకరిస్తుం దని మావిశ్వాసము.

స్త్రీల రచనలు ప్రత్యేకసంపుటిగా ప్రచురించ దలచినాము.

మాకోర్కిమీద తమగీతినాటికను ఈసంపుటిలో చేర్చి, పీఠికాదులతో మా కిచ్చిన శ్రీ శివ శంకర శాస్త్రి గారికి మా వందనము.

ఈసంపుటిలో ప్రకటించడానికి అవకాశము కలిగించి తమనాటికలు మాకు దయచేసిన ఇందలి నాటికాకర్తల కందరికీ ఆంధ్ర ప్రచారిణీ వారి కృతజ్ఞతా పూర్వక వందనములు.

పైడిమర్రి సత్యనారాయణ మూర్తి
మేనేజింగు డైరెక్టరు

ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్
నవంబరు ౧౯౪౩

## అనుక్రమణిక

# పరిచయము

నూతక్కి రామశేషయ్య: జననము ౧౮౯౪, చిలువూరు గ్రామము, గుంటూరు జిల్లా. ౧౯౨౩ లో బి. యల్. ౧౯౨౪ నుంచి అడ్వొకేటు. ౧౯౨౯-౩౦ లలో బెజవాడ తాలూకా బోర్డు ప్రెసిడెంటు. ౧౯౩౦ మధ్య నుంచి జయపుర సంస్థానంలో అసిస్టెంటు దివాన్. నాటికలు, ఖండ కావ్యములు రచించినాడు. చాలా వ్యుత్పన్నుడు.

కొడవటిగంటి సుబ్బయ్య: జననము ౧౮౯౪ గుంటూరు మండలములో. కొంతకాలం ఓవర్ సియర్. ౧౯౨౧-౨౨ లలో తెనాలి రామవిలాస సభకు దర్శకత్రయములో ఒకడు. నటుడు, చిత్రకారుడు. ఖండకావ్యములు, కథలు అనేకములు రచించినాడు. యోగసాధకుడు.

నోరి నరసింహ శాస్త్రి: జననము ౧౯౦౦, గుంటూరు నగరములో. ౧౯౨౪లో బి. ఎల్. రేపల్లెలో న్యాయవాదవృత్తి. మంత్ర తంత్రశాస్త్రములలో నిధి. సనాతన ధర్మపరాయణుడు. ఖండకావ్యములు, నాటికలు, కథలు, వ్యాసములు రచించినాడు. ఆంధ్రసారస్వతములో సుప్రసిద్ధ భావుకుడు.

శ్రీనివాస శిరోమణి: జననము గుంటూరు మండలములో. జ్యోతిశ్శాస్త్రములో నిధి. వచనరచనలలో అందె వేసినచెయ్యి. పత్రికా సంపాదకుడు. సినీమా వ్యాపారములో నిష్ణాతుడు. వ్యవసాయములో పరిశోధకుడు. కథలు, నాటికలు, వ్యాసములు అనేకము రచించినాడు.

చింతా దీక్షితులు: జననము ౧౮౯౧, తూర్పు గోదావరిమండలములో. ప్రభుత్వవిద్యాశాఖలో ఉన్నతోద్యోగి. సారస్వతములో సుప్రసిద్ధుడు. బహుగ్రంథనిర్మాత. "శబరి" మొదలైన నాటకములు, నాటికలు, వ్యాసములు కథలు — అనేకము రచించినాడు. భక్తుడు.

ముద్దు కృష్ణ: జననము ౧౮౯౯ రాజమహేంద్రవరములో. ౧౯౨౭ లో బి. ఎల్. "జ్వాల" పత్రికా సంపాదకుడు. అనార్కలీ, అశోకము, టీకప్పులో తుఫాను మొదలైన నాటికలు, "ఎక్కడికి—" అనే కథా సంపుటి ముద్రితములు. నాటకనిర్వహణములో ప్రవీణుడు. వ్యాసరచయిత.

శివశంకర శాస్త్రి: జననము ౧౮౯౨ రాజగ్రామము, గుంటూరు మండలమున. తెనాలి రామవిలాససభ దర్శకత్రయములో వాడు. అనేక గద్య పద్య గీతికా నాటికలు, కావ్యములు రచించినాడు.

తల్లావజ్ఝల కృత్తివాస తీర్థులు: జననము ౧౯౧౪ లో, గుంటూరు నగరమున. బి. ఏ., బి. ఇడి. అనేక గద్య గేయ నాటికలు, రేడియో నాటికలు, సారస్వతవ్యాసములు, నాటకములు రచించినాడు. ఆంగ్లభాష నుంచి కొన్ని నాటకములు, సంస్కృతమునుంచి కథాసరిత్సాగరము, హిందీ నుంచి కొన్నిపుస్తకములు తెలిగించినాడు. అలంకార వేదాంతశాస్త్రములలో అభినివిష్టుడు.

బాలాంత్రపు రజనీకాంత రావు: జననము ౧౯౨౦, నిడదవోలు పశ్చిమ గోదావరిజిల్లాలో. ౧౯౪౨ లో ఎమ్. ఏ. అనేక రేడియోనాటికలు, గేయములు రచించినాడు. గాయకుడు.

మొక్కపాటి నరసింహ శాస్త్రి: జననము ౧౮౯౨, తూర్పుగోదావరి మండలమున, గంగ్లేడు గ్రామమున. ఎడింబరోలో వ్యవసాయశాస్త్రాభ్యాసము

చేసినాడు. శక్తి, కళ పత్రికలకు సంపాదకుడు. బ్యారిష్టరు పార్వతీశము మొదలైన గ్రంథములు రచించినాడు. రేడియో ప్రసంగములు అనేకము చేసినాడు. మహానటసభ స్థాపించి, నాటికలు వ్రాసి అభినయించినాడు. సినిమారచనలో సిద్ధహస్తుడు.

పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి: ౧౯౨౦ లో చావలి గ్రామము, గుంటూరు మండలములో జననము. సంస్కృతము, ఇంగ్లీషు, తెలుగులలో ఎం. ఏ. M. Litt. Diploma in German. వేదవిషయవ్యాసములు సారస్వతవ్యాసములు, కథలు, ఖండకావ్యములు, గేయములు — అనేకము రచించినాడు. ఆధునికవిధానములో వేదార్థప్రవీణుడు.

వావిలాల సోమయాజులు: జననము ౧౯౧౮, విప్రులపల్లె, గుంటూరు మండలములో. ౧౯౩౭ లో బి. ఏ. ౧౯౩౯ నుంచి గుంటూరు శారదానికేతన కలాశాలాధ్యక్షుడు. దక్షిణదేశ ఆంధ్రవాఙ్మయము, నాయకురాలు (నాటకము) మొదలైన గ్రంథములు, అసంఖ్యాక ఖండకావ్య, గేయనాటికా, సారస్వతవ్యాసములు రచించినాడు. వక్త.



# పీఠిక

## ౧

అంకరూపక మనేశబ్దము అలంకారశాస్త్రములో కనబడుతుంది. ప్రాచీనరూపకాలలో అంకవిభజనే కాని రంగ విభజన లేదు. విష్కంభము, మిశ్రవిష్కంభము, చూళిక, అంతర్నాటిక- ఇత్యాది ఘట్టాలు విభాగరూపముగా ఉన్నవి. రూపము ఆరోపణ చేసుకోవడంవల్ల రూపక మనీ, నటించడము చేత నాటక మనీ నామములు ప్రసిద్ధి కెక్కినవి. అల్పార్థములో రూపిక అనీ, నాటిక అనీ ఆధునికవ్యవహారము. అంకరూపకము అనడానికి బదులుగా ఏకాంకిక అని ప్రతీతి కలిగింది.

నాటికకు పూర్వరూపము వాకోవాక్యము. దానికి పూర్వరూపము స్వగతము. స్వగతములో ఏకపాత్రోపన్యాసము ఉంటుంది. వచనముకన్న పాట, పద్యము ముందు పుట్టడంచేత స్వగతము మొదట తాళబద్ధము, తరువాత ఛందోబద్ధము అవుతుంది. విశ్వసాహిత్యములో విశేషప్రాచీన మైనఋగ్వేద సంహితా భాగములో ఇంచుమించుగా ఇరవై స్వగతాలు గాని, వాకోవాక్యాలు గాని ఉన్నవి. వాకోవాక్యము అంటే ఉక్తిప్రత్యుక్తులు గాని, ప్రశ్న సమాధానాలు కాని, సంవాద

ములు కాని కావచ్చు. ఇంద్రమరుత్తుల వివాదము, ఇంద్రవరుణుల సంవాదము, భార్యాపుత్రులతో అగస్త్యుని సంభాషణ, కుమారునితో వసిష్ఠుని సంభాషణ, నేమా భార్గవునికి ఇంద్రుని సమాధానము, వృషాకపినిగురించి ఇంద్ర ఇంద్రాణుల సంవాదము, ఊర్వశీ పురూరవుల సంభాషణ, సరమా పణిసంవాదము, మత్తెక్కి ఇంద్రుడు చేసినస్వగతము, అపాల, గోతముడు మొదలగువారి వాక్యములు గోచరిస్తవి. అథర్వవేదములో సుపర్ణాధ్యాయములో అథర్వాణుడు చేసిన దైవప్రార్థన కనిపిస్తుంది. ఇక వచనములో ఐతరేయ బ్రాహ్మణములో కవషుని కథ వంటివి రూపకప్రాయములు. బ్రాహ్మణాలలో వచనరూపముగా అనేకసంవాదములు నాటికాలక్షణాలతో స్ఫుటముగా గోచరిస్తవి.

యజ్ఞయాగాది సమయములలో బ్రాహ్మణులు వేషధారణము చేసి, ఇంద్ర, అగ్ని, వరుణ, బ్రహ్మణస్పతులు మొదలైన దేవతలవలె నటించేవారని నాటక చరిత్రలో పాశ్చాత్యులు వ్రాసినారు. పవిత్రసమయాలలో పాత్రధారణ చేసి పదిమందియెదుట ప్రవర్తిస్తారా అని సంశయము కలగవచ్చు. సామాన్యుల వేషము ధరించడముకన్న పురుషశ్రేష్ఠులవలె కాని, పురుషోత్తమునివలె కాని, రూపారోపణము చేసుకొనడమువల్ల లోపము లేదు. లోకానికి అతిలోకవిషయముమీద ఆసక్తి ఉండడము సహజము, సమ్మతము. ప్రజలు ఉన్నదాని

కన్న అధికముగా కనపడవలె నని కాంక్షిస్తారు. అందుచేతనే రూపకానికి ఆవశ్యకత కలిగింది. ఇప్పటికీ మనదేశములో సామాన్యవిషయాలకన్న ఉదాత్తవిషయాలమీదనే ఉత్సుకత ఎక్కువ. అందుచేతనే రామాయణ మహాభారతఘట్టాలు, పురాణాలలో ఉపాఖ్యానాలు, రంగస్థలముమీద ప్రదర్శిస్తే ప్రజలు ఆసక్తితో చూస్తారు.

లౌకికసంస్కృత భాషలోకూడా ప్రాచీనకాలములోనే నాటికలు, నాటకములు కొంచెకొంచెముగా గోచరిస్తవి. అష్టాధ్యాయి రచించిన పాణిని మహర్షి, భాష్యకారు డయిన పతంజలి మహర్షి నాటకాలు రచించినట్లు ప్రతీతి. క్రీ. పూ. ౩౫౦ ప్రాంతాలలో ఉన్నపతంజలి దృశ్యకావ్యాలనూ, నటులనూ, నాటకరంగాలనూ పేర్కొన్నాడు. నాట్యశాస్త్రప్రణేత అయిన భరతమునికి దృశ్యకావ్యభేదాలు బాగా తెలుసును. క్రీ. పూ. ప్రథమశతాబ్దిలో ఉన్న భాసుడు ఏకాంకికలు రచించినాడు భాసనాటకచక్రములో దూతఘటోత్కచ కర్ణభార మధ్యమ వ్యాయోగ ఊరుభంగాదులు నాటికాప్రాయములు. క్రీ. పూ. ౭౫ మొదలు క్రీ. త. ౧౫౦ వరకూ బౌద్ధులు సంస్కృతనాటకాలు రచించారు. క్రమక్రమముగా రూపక ఉపరూపకాలు బయలు దేరినవి. సంస్కృతభాషలో వేలకొద్ది దృశ్యకావ్యాలు ఉండే వనీ, కాలక్రమేణ అనేకము లోపించి నశించిన వనీ విజ్ఞులు లిఖించారు.

౨

పాశ్చాత్యదేశాలలో చిన్ననాటిక చిరకాలమునుంచీ వ్యాప్తిలో ఉన్నది. దాని ఆకారప్రకారాలు వివిధవిధాలుగా ఉండేవి,. ప్రాచీనగ్రీసు దేశములోనూ, ఇటలీదేశములోనూ నాటిక విశేషముగా ప్రహసనప్రాయముగా ఉండేది. ఇంగ్లాండులో మధ్యయుగములో ఉండే Mystery Plays, Miracle Plays, Interludes- నాటికాప్రాయములే. ౧౬౪౨ సంవత్సరములో శాసనప్రకారము నాటకశాలలు మూసివేసిన తర్వాత Travelling actors Drolls అనేవి ఆడుతూ ఉండేవారు. ౧౮, ౧౯ శతాబ్దులలో curtain-raisers, after pieces, sketches for Amateurs, అప్పుడప్పుడు ప్రదర్శించేవారు. ఇవి అన్నీ ఇంచుమించుగా ప్రహసనాలే. వీటికి గౌరవము ఉండేది కాదు.

ఆధునిక నాటిక ౨౦ శతాబ్దిలోనే ఉద్భవించిందని చాలామంది విమర్శకుల మతము. గతశతాబ్దిలోనే కొందరు ప్రారంభించినా, ప్రస్ఫుటరూపము ఈశతాబ్దినుంచే ఏర్పడ్డదని అభియుక్తుల అభిప్రాయము. ముఖ్యముగా ఇంగ్లాండు అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ప్రబలి, ప్రదర్శనయోగ్యమై రంగస్థలముమీదికి ఎక్కి రంజన చేస్తున్నదట.

3

ప్రాచీనాంధ్ర సారస్వతములో నాటికలు లేవు. సంస్కృత నాటకములవంటివి కూడా లేవు. ప్రబోధచంద్రోదయ నాటకము సంస్కృతమునుంచి ఆంధ్రీకరించినవారు శ్రవ్యకావ్యము చేశారు! వసంతవిలాసము అనేగీతినాటిక ఉన్నట్టు వాడుక. గేయ మొకటి ఎందులోనో ఉదాహృతమై ఇప్పటికీ లభిస్తున్నది. దానిని బట్టి గ్రంథస్వరూపము నిర్ణయించడానికి వీలులేదు. క్రీడాభిరామము దృశ్యకావ్యధోరణిలో నడచినా, నాటిక అనడానికి వీలు లేదు. ఇద్దరు ప్రధానపాత్రలు. Cinema విధానములో చిత్తరువులవలె కొన్నికొన్నిదృశ్యాలు ఊహించవచ్చును. అందులో ఇద్దరు పాత్రలే కాని వస్తువు ప్రధానం కాలేదు. ఓరుగల్లునగరములో అప్పటి ఆచారవ్యవహారాలు, వినోదాలు, విచిత్రిసన్ని వేశాలు కొద్దిగా గోచరిస్తవి. శ్రీనాథవిరచిత మని ప్రతీతి కల వీథినాటకము చిన్నదైనా నాటిక కాదు. అందులో నాయకునికి అందముగా కనిపించిన ఆడువారలవర్ణనమాత్రమే అతి ప్రధానము. కృష్ణదేవరాయలకాలములో నాటకములు ఆడినట్టు బాగా తెలుస్తుంది. అవి ఎటువంటివో, ఏవిధంగా ప్రదర్శించేవారో డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యవంటి వారు విశదీకరించాలి. రాయలు విద్వత్ప్రభువు కావడంచేత, అన్నిటికీ పండితామోదమే ప్రధానంకావడంవల్ల సంస్కృత నాటకలక్షణాలను కొంతవరకైనా అనుసరించిన దృశ్యకావ్యాలే ప్రదర్శించేవారని భావించవచ్చును. తంజావూరులోను, తదితర

ఆస్థానాలలోను కాలక్రమేణా నాటకములు రచించడము, ప్రదర్శించడము జరిగినట్లు స్పష్టము.

ప్రభువులకు, పండితులకు, ప్రజాసామాన్యానికే ప్రమోదము కలగడానికీ, ప్రదర్శనయోగ్యము కావడానికీ వీధిభాగవతము, యక్షగానాలు బయలుదేరినవి. ప్రతికథలోనూ వస్తుగౌరవము ఉండేది. సంగీతప్రియుల ఆమోదానికి అక్కడక్కడ గీతికలు, పాటలూ, ప్రౌఢులకోసము మధ్య మధ్య పద్యములూ, విద్వాంసుల వినోదానికి సంస్కృతగుంఫనలు శ్లోకములూ, అందరి ఉల్లాసానికీ హాస్యము నిబద్ధము చేసేవారు. ప్రత్యేకించి యక్షకుటుంబాలు కృషిచేసి పాడుతూ ప్రదర్శించే యక్షగానాలలక్షణము బాగా విశదమే. సుగ్రీవవిజయము మొదలైన యక్షగానములు సహస్రాధికముగా లభ్యమాతవి. వాగ్గేయకారుడైన త్యాగరాజు అంతటివాడు కూడా యక్షగానధోరణిగా నౌకావిహారము, ప్రహ్లాదచరిత్ర రచించినాడు. ప్రజానీకము మోజుకోసము తోలుబొమ్మలాటలు కొంతనాటకసరణిలో వ్యాపించినవి. జగద్విఖ్యాతమైన రామాయణ మహాభారతాది గ్రంథఘట్టాలు తీసుకొని నాటకసరళిలో నడిపేవారు. అందులో సంభాషణ, గానము, వర్ణన మొదలైనవి ప్రస్ఫుటములు. మానవుడు పాత్రధారణ చేసి రంగస్థలముమీద ఆడడముకన్న ... ము లేనితోలుబొమ్మలను తెరమీద ఆడించడమే నాటకకళకు పరమావధి అని ఒకానొక జర్మన్ రసికతత్త్వవేత్త నిర్వచించినాడు.

చిన్ననాటకములు ఆరోజులలో ఉండడానికి వీలే లేదు. రాత్రి భోజనాలు చేసి ప్రథమయామము కాగానే ప్రేక్షకులు సిద్ధమయ్యేవారు. ఇంచుమించుగా సూర్యోదయమయ్యేవరకూ చూస్తే గాని వారికి తృప్తి ఉండేది కాదు. ఈరోజులలో వలె ప్రతిరాత్రి ప్రదర్శనానికి ఆకాలములో అవకాశము లేదు. పంటకారు అయిన తర్వాత పనిపాటులు తగ్గి ఆకాశము నిర్మేఘమై ప్రజలకు విశ్రాంతి దొరికినప్పుడు కుశీలవులు బయలుదేరి పెద్దగ్రామములలో నాటక ప్రదర్శనము చేసేవారు. తరుచుగా లేక ఎప్పుడో లభ్యమయ్యే ప్రదర్శనము ఇట్టే అయిపోతే తృప్తి ఉండదు. అందుచేత మూడుజాములు ఆట ఆడించేవారు. అటువంటిసందర్భములో చిన్ననాటికకు తావు ఏలాగున ఉంటుంది?

ఇప్పటికీ ఇటువంటిప్రదర్శనములు అక్కడక్కడ సుదీర్ఘముగానే జరుగుతున్నవి. జనసామాన్యానికి వీటిమీద విశేషప్రీతి ఉన్నట్టు స్పష్టము.

౪

నాటికారచన గతశతాబ్దిలోనే ఒకవిధముగా ప్రారంభమయినది. అన్నివిషయాలలో ముందడుగు వెయ్యడానికి ప్రయత్నించిన వీరేశలింగము పంతులు ప్రహసనములు ప్రారంభించినాడు. సంస్కృతఉపరూపకాలలో అన్యతమమైనప్రహసనము ఆయనను ఆకర్షించినది. సాహిత్యదృష్టికన్న సంఘసంస్కరణదృష్టి ప్రధానముగా ఉన్నపంతులు లోకముసుద

మిత్రునకై ప్రహసననిర్మాణము చేసినాడు. ఆయన దురాచారములు, అప్రమార్గములు అనుకొన్నవి యథాతథముగా ప్రదర్శించడానికి ప్రయత్నించడముచేత ఆరచనలు ఉత్తమసాహిత్యశ్రేణిలోకి ఎక్క లేకపోయినవి. వివిధగ్రంథకారకులైన రాజా భుజంగరావు ప్రహసనములు తాత్కాలికచమత్కారము కలిగించి చల్లబడినవి. హాస్యరసచక్రవర్తి పానుగంటి లక్ష్మీనరసింహా రావు పంతులు హాస్యవల్లరి అనేశీర్షికతో ఇంచుమించుగా ఇరువది ప్రహసనములు రచించినాడు. సామాన్యసాంసారిక వినోదాలు వాటిలో ప్రధానవిషయాలు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహా కవి ప్రహసనాలలో చమత్కారరేఖ గోచరిస్తుంది. ఈరచయిత లందరికీ ప్రహసనరచనే ప్రమోదావహము కావడము చిత్రమే. సామాన్యవిషయాలను సాహిత్యశ్రేణిలోకి ఎత్తి సంస్కారదృష్టి ప్రధానముగా ఉంచుకొని పరిహాసమే లక్ష్యముగా ఎంచి నిర్మించడముచేత కళాసంపద కనబడడము లేదు. ఎంత ప్రతిభావంతులైనప్పటికీ మరమ్మాతు మత మయినప్పుడు రచన పరాకాష్ఠకు పోవడము కష్టము.

ఇంకా కొందరు రచయితలు చిన్ననాటకాలు చేసినారు.

౫

సాహితీ సమితివారు రంగస్థలములో ప్రవేశించినతరువాతనే ఏకాంకికకు కళారేఖ ఏర్పడ్డది. సమితివారు సంస్కారము కాని, ప్రచారము కాని ప్రధానముగా పెట్టుకోక కళ లక్ష్యములో ఉంచుకోవడముచేత సరససాహిత్యసృష్టి చేయగలిగి

నారు. శ్రీ నూతక్కి రామశేషయ్య, చింతా దీక్షితులు మొదటిరోజులలో నాటికలు విరివిగా రచించినారు. ఆరచనలో వస్తువైవిధ్యము బాగా ఉన్నది. ఇద్దరూ స్వతంత్రకల్పనలు చేసినారు. తిరువాత నోరి నరసింహశాస్త్రి ఏకాంకికలు ఎక్కువగా వ్రాసినాడు. ఈయన ఉపజ్ఞావిశేషముచేత ఉన్నతపథములో విహరించినాడు. అతీంద్రియవిషయాలకు కూడా రూపకల్పన చేసినాడు. వచన నాటికలే కాక పద్యగీతినాటికలుకూడాప్రజ్ఞతో రచించినాడు. తక్కిన వారు కొద్దిగా కొన్ని ఏకాంకికలు రచించారు. సాహితీ పత్రికతో ప్రారంభమై, సఖిలో, పరివృద్ధమై ప్రతిభలో, పరాకాష్ఠకు వెళ్ళింది ఏకాంకిక.

వెనకటిరోజులలో శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు, విశ్వనాథ కవిరాజు, రాజమన్నారు నాటికలు రచించారు. విశ్వనాథ కవిరాజు శతాధిక నాటికాకర్త. ఆయనరచనలో హాస్యరసము ఉట్టిపడుతుంది. సంభాషణలలో చాలా చమత్కారము ఉంటుంది. తరువాతవారిలో మల్లాది కృష్ణశర్మ, ముద్దుకృష్ణ, అవధాని, సోమయాజుల రామమూర్తి, బుచ్చిబాబు, గణపతిశాస్త్రి, వావిలాల సోమయాజులు ప్రభృతులు విరివిగా ఏకాంకికలు వ్రాసినారు. ప్రకృతము దేశములో ఏకాంకికా రచయితలు చాలామంది ఉన్నారు.

౬

ఏకాంకిక పెద్దదిగా ఉండకూడదు. అందులో ప్రధాన విషయము ఒక్కటే ఉండవలెను. పాత్రలు ఎంత తక్కువ

ఉంటే అంత సౌలభ్యము. పాశ్చాత్యుల ఏకాంకిక ప్రదర్శనలో సామాన్యముగా ౨౦ నిమిషాలకు తగ్గకుండా, ౪౫ నిమిషములు దాటకుండా ఉంటుంది. పావుగంట మొదలు గంటవరకు ఉన్నా రక్తి కట్టుతుంది.

వస్తువు ఏదైనా కావచ్చు. సర్వసాధారణముగా ప్రేమ-సంయోగ వియోగములు, కరుణరసప్రధాన మైనఘట్టములు, ఆశ్చర్యజనక మైనసన్ని వేశాలు, నర్మగర్భముగా కాని, నగ్నముగా కాని నవ్వు తెప్పించే విచిత్రవిషయాలు— వస్తువు. కొందరు రచయితలు అతిసామాన్య విషయాన్ని కూడా కల్పనా విశేషముచేత అద్భుతావహము చేస్తారు. ఎలాగైనా తుల్యబల విరోధ ముండి, సంఘర్షణ పుట్టి, సమాప్త మైతే కాని వస్తువు రసవంతము కాకపోతుంది.

కొన్ని ఏకాంకికలు సంభాషణ సామర్థ్యమువల్లనే సజీవముగా ఉంటవి. కొన్నింటిలో పాత్రోన్మీలనమే ప్రధానము. మరికొన్నిటిలో విపర్యాసమువల్ల వైచిత్రి సంభవిస్తుంది. కొన్నిటిలో భాషాచమత్కారమువల్లనే ప్రమోదము కలుగుతుంది. రసపర్యవసన్నము అయిన ఏకాంకికే రమణీయము కావడము నిర్వివాదము.

పాశ్చాత్యుల ఇతివృత్తకల్పనము బాగుంటుంది. ఈ శతాబ్దిప్రారంభంలో వారిఏకాంకికలు ఆరంభ మయినా త్వరలోనే ఉచ్చస్థితికి వెళ్ళినవి. ఏకాంకిక సామాన్యముగా ఏకరంగమే. కాని కొందరు ప్రసిద్ధనాటికాకర్తలు పూర్వార్ధ ఉత్తరార్ధములుగా గాని, రెండు మూడు రంగములుగా గాని, విభజన

చేశారు. ఒకానొక అమెరికారచయిత ప్రవేశకాదులవలె మధ్య మధ్య ఘట్టములు ప్రవేశపెట్టినాడు. కొందరు అంతర్నాటికను కూడా చొప్పించినారు. ౧౯౨౬ సంవత్సరప్రాంతములో ఇంగ్లాండులో ప్రథమపర్యాయము నాటికాసముచ్చయము ప్రకటించినారు. అప్పటినుంచీ అసంఖ్యాకముగా నాటికలు బయలు దేరినవి.

ఆ దేశాలలో వార్షికనాటికోత్సవములు చేస్తూ కొన్ని సంఘములవారు రకరకాల ఏకాంకికలు ప్రదర్శించి, విజ్ఞులను విమర్శకులుగా ఏర్పాటు చేసుకొని, వారినిర్ణయములప్రకారము నటులకు, నాటకసంఘములకు, నాటికాకర్తలకు బహుమానము లిస్తూ ఉంటారు.

రచనకు, ప్రదర్శనకు ఉపకరించే ఉత్తమనాటికలు కొన్ని సంపుటీకరించి ప్రచురించడము లాభదాయకము. ఆంధ్రరచయితల చేతులలో ఏకాంకిక పరాకాష్ఠకు వెళ్ళి విశ్వజనీనత పొందిందని డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి లిఖించినాడు. చల్లనిమాట! ఆంధ్రులప్రతిభ ఏకత్ర వైవిధ్యములో చూపడమే యీసంపుటముల ఆశయము.

ఇందులో గేయనాటికలు, రేడియోనాటికలు కూడా చేర్చినాము. ప్రాయికముగా నాటిక దృశ్యకావ్యమే కాని, శ్రవ్యము కాదని విమర్శకుల మతము. ప్రదర్శనయోగ్యము కాకపోయినప్పటికీ శ్రవ్యనాటికలు కూడా అవసరమే. శ్రోతలు విన్నవిషయాలను వెంటనే నిజమనోరంగములో నిపుణముగా

ప్రదర్శించుకొని ఆనందము అనుభవించగలరు. రేడియోనాటికలే కాక సామాన్యనాటికలు కూడా చదివి ఆనందించవచ్చును. ప్రదర్శనతో ఏమాత్రముపని లేకుండా పఠనముకోసమే కొన్ని నాటికలు ఉండడము ఉచిత మని ప్రాచ్యపాశ్చాత్యవిమర్శకులు కొంద రంగీకరించారు.

ఇందులో గ్రీష్మఋతువు, శిల్పనిద్ర, మధురప్రియ— ఇతఃపూర్వము అముద్రితములు. తక్కినవి సాహితి, సఖి, ప్రతిభ, కళ, భారతి, జ్వాల, తెలుగుతల్లి పత్రికలలో ముద్రితములు.

ఏకాంకికా రచయితల వార్షికసమావేశాలూ, ఏకాంకికా వార్షికప్రదర్శనోత్సవాలూ జరపడము సముచితము

శివ శంకర శాస్త్రి

సాహితీ సమితి
రాజమహేంద్రవరము



# సముద్రతీరము

శ్రీ నూతక్కి రామశేషయ్య

౧

కొడుకు: నాకొక కల వచ్చింది.

తండ్రి: ఇంత ప్రొద్దెక్కి లేచినా వేమి?

కొడుకు: కలలో నేను సముద్రపు ఒడ్డుకు వెళ్ళినాను. అప్పుడు మనపెద్దగడియారము ౧౨ కొట్టింది.

తండ్రి: అంత ఎండలో సముద్రానికి వెళ్ళకూడదు.

కొడుకు: కలలోకూడా వెళ్ళకూడదా? అయినా అక్కడ అంత ఎండ లేదు నాన్నా! సూర్యుడు సముద్రము దగ్గర చల్లగా ఉంటాడు. నీవూ అంతే. ఎంత కోపముగా ఉన్నా నన్ను చూచేసరికి నవ్వుతూ ముచ్చటగా ఉంటావు. నన్ను చూస్తే నీ కంత సంతోష మెందుకు నాన్నా?

తండ్రి: నీవు మంచిబిడ్డవు—అందుకని.

కొడుకు: నేను మంచివాడనా? అయితే సముద్రముకూడా మంచి దన్నమాటేనా? అందుకనే నన్ను చూచి నవ్వింది. అక్కయ్య నవ్వినట్లుగానే సముద్రము నవ్వినప్పుడుకూడా వెన్నెల కాచినట్లుంటుంది. సముద్రములో ఏ ముంటవి నాన్నా?

తండ్రి: సముద్రములో రత్నాలూ, ముత్యాలూ ఉంటవి.

కొడుకు: ముత్యాలా? అందుకే నాన్నా, సముద్రము నవ్వితే అంత వెల్తురు వస్తుంది! ఇంచాక సముద్రము నన్ను చూచి నవ్వింది. రత్నాలు కూడా ఉంటవి, కాదూ? నీవు చెప్పేకథలలో రాజకుమార్తె లెప్పుడూ రత్నాలతో అచ్చనగాయ లాడుకొంటారు. నేను సముద్రానికి వెళ్ళి

రత్నాలు తీసుకొని వస్తాను. రత్నంతో అక్కయ్య అచ్చనగాయ లాడుకొంటుంది.

తండ్రి: రాముడూ! నీవు సముద్రానికి వెళ్ళగూడదు.

కొడుకు: అక్కడ ఎంతో హాయిగా ఉన్నది. నాన్నా! చల్లగాలి. నా ఒంటిని తాకుతూ పోతూ వుంటే (అమ్మ ఒళ్ళు నిమిరి ముద్దు పెట్టుకొన్నట్టుగా ఉన్నది. అమ్మ సముద్రముమీద గాలిలో ఉంటుందా?

తండ్రి: ఉండదు.

కొడుకు: అయితే, ఇం కెవరిచేతులు అంత చల్లగా మెత్తగా ఉంటవి? ఇం కెవరి ముద్దు అంతసుఖముగా ఉంటుంది? నీకు తెలియదు నాన్నా, అమ్మ సముద్రపు ఒడ్డునే ఉంటుంది. నేను కూడా వెళ్తా.

తండ్రి: నీవు సముద్రానికి వెళ్ళగూడదు.

కొడుకు: అయ్యో, అక్కడ హాయిగా ఉంటుంది నాన్నా! నే నక్కడ నిలుచున్నప్పుడు కనబడని నీటితుంపరలు నెమ్మదిగా కురిసినవి. అప్పుడు నేను బిగ్గరగా నవ్వినాను మరి నాన్నా! ఎవ్వరూ లేకుండా నవ్వితే,పిచ్చివా డంటారా?

తండ్రి: అనరు. పిచ్చివాళ్ళట్లాగే నవ్వుతారు.

కొడుకు: అయితే పిచ్చివాళ్ళకు దేవు డెంత సుఖము పెట్టాడో! నేను నవ్వినప్పుడు నాకు ఎంతో హాయిగా ఉన్నది. అప్పుడు ఎవ్వరూ లేరు. అమ్మ మాత్రము కనబడకుండా అక్కడనే ఉన్నది. నన్ను ముద్దు పెట్టుకున్నది. ఆముద్దు నాన్నముద్దుకంటె సుఖముగా ఉన్నది. అది ఇప్పటికీ నాకను రెప్పలమీద తేలియాడుతూ ఉన్నది. [కళ్ళులు సగము మూసి నవ్వుకొంటాడు.]

తండ్రి: రాముడూ, ఏమి టది?

కొడుకు: అమ్మ అమ్మ దగ్గరకు వెళ్ళి రావద్దూ నాన్నా? అక్కడ ఎంతో హాయిగా ఉంటుంది. నే నక్కడ నిలుచుంటే సముద్రము నాకై

పుడు చేతులు చాచి నన్ను పిలిచింది. నాకు రత్నాలు ఇస్తుంది. నేను తెచ్చుకో వద్దు నాన్నా?

తండ్రి: నీవు వెళ్ళకూడదు. అక్కడ పెద్దచేపలు ఉంటవి.

కొడుకు: పెద్దచేపలా? అవి ఎట్లా ఉంటవి నాన్నా! నేను వాటిని చూడ వద్దూ!

తండ్రి: అవి మనమే డంత ఉంటవి. నీవు వెళ్ళ వద్దు. వెళ్ళితే నాకు కోపము వస్తుంది...[బయటికి వెళ్ళతాడు]

కొడుకు: నాన్నకు నామీద కోపము రాదు. కోపములోకూడా నేను నవ్వితే నవ్వుతాడు. సముద్రములో ఇల్లంత చేపలు ఉంటవి. ముత్యాలు, రత్నాలు కూడా ఉంటవి. అమ్మ అక్కడే గాలిలో తిరుగుతూ ఉంటుంది. నేను వెళ్ళగానే నిమిరి ముద్దు పెట్టుకుంటుంది. అప్పుడు సముద్రము బలమైన తనచేతులు చాచి నన్ను కౌగిలించుకుంటుంది. చేపలను చూపిస్తుంది. ముత్యాలు, రత్నాలు ఇస్తుంది. అవి అక్కయ్య కిస్తాను. [నవ్వుకుంటాడు] నాకు ఒంటరిగా ఉంటేకూడా నవ్వు వస్తుంది. నాన్న చూస్తే పిచ్చివాడంటాడు. [వెళ్ళిపోతాడు].

౨

[రాముడు మంచముమీద పరున్నాడు. జ్వరము తీవ్రముగా వున్నది. ప్రక్క కుర్చీలపైన డాక్టరు, తండ్రీ కూర్చున్నారు.]

తండ్రి: అబ్బాయి ఎక్కువగా మాట్లాడుతున్నాడు. కొంచెము నిద్ర మందిస్తే?

డాక్టరు: జ్వరతీవ్రతచేత మాట్లాడుతున్నాడు. జ్వరము కొంచెము దిగినతర్వాత ఇస్తాను. ఎక్కువ ప్రమాదమైన దెబ్బ తగులలేదు. ముందుకు పడగొట్టి అలలు లోపలి కీడ్వడంచేత ఇసుక గీసుకుపోయింది.

రాముడు: ఇసుక కాదు బాబూ? సముద్రములోపలి రత్నాలమీదుగా పొర్లాడుతూ, పోతూ అలలఒరువుచేత బోర్లపడ్డాను. రత్నాలు గీసుకు పోయినవి.

తండ్రి: నాన్నా, సముద్రానికి వద్దంటే ఎందుకు వెళ్ళావు?

రాముడు: రత్నాలకోసము. అవిగో రత్నాలు! [లేవ బోతాడు.]

తండ్రి: అయ్యో, లేవబోకు, నీవు కదలకుండా పండుకో.

రాముడు: రత్నాలు! సముద్రము రత్నాలు తెస్తూ ఉన్నది. అదుగో, నల్లని రెయెడారి! అనలువుమీద తేలుతూ, ఆడుతూ ఉన్నది. అది నల్లమబ్బు మీద మెరుపు ... తెలిసింది! ఆ! సముద్రము నవ్వుతూ ఉన్నది. సముద్రానికి పిచ్చి యెక్కింది. నాన్నా! ఒంటరిగా ఎగిరిపడుతూ గంతులు వేస్తే పిచ్చి ఎక్కినట్టు కాదూ?

తండ్రి: బాబూ! మాట్లాడబోకు, డాక్టరుగారికి కోపము వస్తుంది.

రాముడు: డాక్టరుగారూ! మీకు కోపమా? మా నాన్నకు కోపము లేదు. నన్ను చూస్తే నవ్వుతాడు. సముద్రానికి కోపము లేదు. అదుగో, సముద్రము నల్లగా అపారంగా ఉన్నది. దానికి ఒకటే ఒడ్డు. అవతల ఒడ్డు లేదు. ఒడ్డున చాలామంది ఉన్నారు. అందరూ స్నానానికి వచ్చినవారేనా? ఆ దూరంగా చూడండి డాక్టరుగారూ! ఆకాశము వంగి సముద్రాన్ని ఎంతసేపు ముద్దు పెట్టుకుంటూ ఉన్నదో! అవి ఏమిటో రహస్యముగా చెప్పుకొంటూ ఉన్నవి. మీకు వినబడడము లేదు. అయ్యో నాకు స్పష్టముగా వినబడుతూ ఉన్నవే!

తండ్రి: అబ్బాయిస్థితి చూచినకొద్దీ నాకు భయము వేస్తున్నదండీ!

డాక్టరు: అబ్బాయి కేమీ ఫరవా లేదు. కొంచెము మంచుగడ్డ తలకు కట్టండి. జ్వరము తగ్గుతుంది.

రాముడు: అదుగో వెల్తురు! సముద్రములో వెన్నెల కాస్తూ ఉన్నది. సముద్రములో అన్ని వస్తువులూ కనబడుతూ ఉన్నవి. కాని అవతలి ఒడ్డు కనుపించదు. భూమికంటె సముద్రమే పెద్దది. సముద్రములో ఎన్ని భూములున్నవో చూడు. అన్నీ లంకలు. అవిగో రత్నాలు, ముత్యాలు, చేపలు! పెద్ద పెద్దచేపలు, వాటిని ఏలంక కన్నదో! ఆలంకలో [illegible] మున్నారు. అదుగో... [లేవ బోతాడు]

తండ్రి: నాయనా! లేవబోకు. [చేతులు పట్టుకొంటాడు]

రాముడు: [అట్టె కన్ను లురిమి చూస్తూ] నీ వెవరు?

తండ్రి: [కన్నీరు కారుస్తాడు]

రాముడు: ఇంకా ఏడుస్తున్నాడు! [పండుకొంటాడు.] అదిగో అమ్మ! ఎన్నాళ్ళకు కనబడినా వమ్మా! ఇందాకా కనబడకుండా నన్ను ముద్దు పెట్టుకున్నావు. ఇప్పుడు రమ్మని చేతులు చాస్తున్నావు. నేను వస్తున్నా! ... అయ్యో, ఎవరో నా చేతులు బంధించారు. మామిడిచిగురు వంటి మెత్తని చేతులు ఎలా కందినవో చూడు! ... అమ్మా వెళ్ళుతున్నావా? నేనుకూడా వస్తున్నా నమ్మా! వస్తున్నా నమ్మా! అమ్మా, అమ్మా! ... [నిశ్శబ్దము.]

౧౯౩౧

# మాయ పెళ్ళి

శ్రీ కొడవటిగంటి వెంకట సుబ్బయ్య

| | |
|---|---|
| హనుమాన్ దాసు | షాహుకారు |
| గోపీ చందు | అతని గుమాస్తా |
| చబిల్ దాసు | గోపీచందు స్నేహితుడు |
| రామానందు | ఒకానొక గృహస్థు |
| తారా బాయి | రామానందు కొమార్తె |
| లక్ష్మి | అతని పెంపుడు బిడ్డ |

## ౧

[హనుమాన్ దాసు ఆఫీసుగది. గోపీచందు చేతులలో మొగము పెట్టుకుని కూర్చుని ఉండగా చబిల్ దాస్ ప్రవేశము]

చబిల్ దాసు: క్యా హై, గోపీచంద్! మొగం వాలేశావు?

గోపీ చందు: ఎవరు, చబిల్ దాసా? రా భాయి, కూర్చో.

చబిల్ దాసు: ఏమంత దిగాలపడి ఉన్నావేం?

గోపీ చందు: [అటు ఇటు చూచి] ఏమీ లేదు. మా మేనేజరు పెళ్ళి, నా చావు ఒక్క సారే అయ్యేటట్టున్నాయి.

చబిల్ దాసు: అవును, నేనూ విన్నాను. రామానందుకూతుర్నిస్తారట కాదూ? చక్కనిపిల్లటరా! ఇంత ముసలిముండా కొడుక్కు ఎలాగిస్తారు? కాని, నీకు చావెందుకు?

గోపీ చందు: ముసలివాడేమిటి- కోతి! ఆక్కడి కైదు అయినాయి. ఇది ఆరోది. పోనీ, చేసుకుంటే చేసుకున్నాడు. సాకర్మం కాలితే, ఆడే [illegible]!

చబిల్ దాసు: నీకు దిగు లెందుకు? ఏదో శాస్త్రం చెప్పినట్టుంది!

గోపీచందు: చబిల్! నా కేమైనా సలహా చెప్పవదూ! ఇక్కడి కేడాది నుంచీ మాకిద్దరికీ స్నేహము. నే నాపిల్లను చేసుకోవా లంటున్నాను. తారా బాయి నాకు దక్కకపోతే నేను బతకడం ఉత్తదే!

చబిల్ దాసు: ఓస్సి! ఈకబుర్ల కేం లే! తారాబాయి కాకపోతే దాని తాతమ్మ చంద్రాబాయి వస్తుంది. దిగులు పడకు!

గోపీచందు: అలా కాదు. నామనసు నీకు తెలియడం లేదు.

చబిల్ దాసు: నిజంగానా రేమిటి రా!

గోపీ చందు: రెండురోజులనుంచీ చురకత్తి చేర మాడుతున్నాను.

చబిల్ దాసు: [కొంచె మాలోచించి] పెళ్ళి నిశ్చయ మైందా ఏమిటి?

గోపీ చందు: ఇంకా కాలేదు. ఇవాళో రేపో! వీడి మనస్సు విరచా అని యత్నప్రయత్నం చేస్తున్నాను. ఏమీ సాగలేదు. పట్టి తాబేలు ముండాకొడుకు! దానితండ్రి కేం పోయె!— అడుగో వస్తున్నాడు. నువ్వు పో!

చబిల్ దాసు: నే నాలోచించి చెపుతాలే. ఫర్వా లేదు. చురకత్తి కోసేవు సుమా! [నిష్క్రమణ]

హనుమాన్ దాసు: [ప్రవేశించి] ఏమిరా గోపీ! రామానందజీ ఎప్పుడు వస్తా నన్నాడు?

గోపీ చందు: ఏమో, నాకు తెలియదు.

హనుమాన్ దాసు: మొన్న నీ వుండగానేగా చెప్పిపోయింది?

గోపీ చందు: నేను విన్నానా రేమిటి! నా కిదేపని!

హనుమాన్ దాసు: ఏమిరా నేను పెళ్ళిచేసికోవడం నీ కేం ఇష్టం లే దల్లే వుందే!

గోపీ చందు: నే నొకమాట చెప్పనా మీకు కోపం వస్తుందేమో కాని? ఇంతయిూడు వచ్చి ఈముసలితనంలో మీరు పెళ్ళి చేసుకోటం విని— నా మాట కేమి— నాస్నేహితు లందరూ ఎగతాళి చేస్తున్నారు.

హనుమాన్ దాసు: వాళ్ళతాడు తెగిరి! వాళ్ళకేం తెలుసు? ఇప్పుడు పుట్టే బొట్టికాయలకు ముసలితనం గాని, పూర్వకాలపువాణ్ణి నాకు ముసలితనం ఏమిటి?

గోపీ చందు: పైగా, ఆపిల్ల ఏమీ మంచిది కాదట.

హనుమాన్ దాసు: ఏమిటి?

గోపీ చందు: పిల్ల వట్టి అనాకారి దట.

హనుమాన్ దాసు: ఎవడ్రా చెప్పింది! [డ్రాయరులోనుంచి ఫోటో తీసి] ఇటు చూడు! ఈకళ ఎవతె మొహాని కైనా ఉందీ?

గోపీచందు: ఏం కళ? వట్టి వంకర ముక్కు!

హనుమాన్ దాసు: ఊఁ, అవును ఆయినా ఎంత వంకరలే!

గోపీ చందు: కంట్లో పెల్లకూడా ఉంది.

హనుమాన్ దాసు: ఎబ్బే! లేదు రా.

గోపీ చందు: అ దేం, స్పష్టంగా కనబడుతూంటే! మీకు చత్వారం. అయినా, నా కెందుకు లెండి!

హనుమాన్ దాసు: అయితే అది మెల్లే నంటావూ? పోనీలే, మెల్ల మేలు తెస్తుంది.

గోపీ చందు: పెదవులు చూశారా? ఎంత ముద్దగా ఉన్నాయో. నోరు మూసుకున్నది గాని ఒకపన్ను గొగ్గిట.

హనుమాన్ దాసు: ఛా! ముద్దపెదవు అంటే ఇంకా ఒప్పుకోవచ్చు గాని గొగ్గిపన్నా? ఇంత చిన్నతనంలో పళ్ళకు గొగ్గి ఉంటుందా? ఒక వేళ ఉంటేమాత్రం ఏమిరా! నాకు నాలుగు పళ్ళు గొగ్గి. మాయిద్దరికీ కలిసి అయి దవుతాయి పోనీలే!

గోపీ చందు: మీయిష్టం లెండి. నే నైతేమాత్రం చస్తె ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకోను. అస లీఫోటో ఆ అమ్మాయిదేనా అని అనుమానం.

హనుమాన్ దాసు: నీ కేం రా అబ్బాయి! నీ కెవరైనా పిల్లనిస్తారు. నా కెవ రిస్తారు?

గోపీ చందు: లక్షాధికారులు, మీ కేమి టండీ! ఒక్క నెల ఆగండి. ఘట్టుక్లాను సంబంధం కుదురుస్తాను.

హనుమాన్ దాసు: ఎక్కడైనా ఉందా ఏమిటి? చవకగా వస్తె పోనీ చూతాం.

గోపీ చందు: సంబంధాల కేం, కావలసి నన్ని దొరుకుతాయి, కొంచెం ఓపిక పట్టండి.

హనుమాన్ దాసు: మరేళ! ఇక్కడికి అయిదేళ్ళనుంచి ప్రయత్నం. అ వచ్చే దెవరు? రామానందు కాదూ?

గోపీ చందు: [మెల్లిగా] ఆ! ఆదొర్భాగ్యుడే. ఇంతకూ వాకు కని యేడింట ఉన్నాడు!

రామానందు: [ప్రవేశించి] ఏ మండీ, ఏమి నిశ్చయించారు?

హనుమాన్ దాసు: ఏమో నయ్యా! నా కేం నచ్చ లేదు.

గోపీ చందు: ధర చాలా యెక్కువ చెప్పాడు రామానంద జీ!

హనుమాన్ దాసు: అవును. ఆపిల్లకి పన్నెండు వే లేమిటి? ఎవరైనా నవ్వుతారు.

రామానందు: మాపిల్ల కే. మండోయ్! లక్ష్మీవిగ్రహం! పెద్దదానికి ౧౪. వేలు ఇచ్చారు. మీ రెరుగరు కాబోలు!

హనుమాన్ దాసు: ఏమి లక్ష్మీవిగ్రహం! వట్టి వంకరముక్కు!

రామానందు: [ఆశ్చర్యముతో] వంకరముక్కా!

హనుమాన్ దాసు: మెల్లకన్ను కూడా.

రామానందు: మెల్లకన్నా?

హనుమాన్ దాసు: ముద్ద పెదవులు.

గోపీ చందు: గొగ్గి పన్ను.

రామానందు: [నిర్ఘాంతపోయి, ఒకర్ని తరవాత ఒకరిని చూస్తూ] మీకే మైనా కాయలు కాచాయా ఏమిటి! ఫోటోగ్రాఫు ఇస్తినే!

హనుమాన్ దాసు: అది దొంగ ఫోటోగ్రాఫు. ఎవరిదో తెచ్చి ఇచ్చావు. ఈటక్కు లెవరికి తెలియవు!

రామానందు: అయ్యా, ఈ వేషాలు మాదగ్గిర లేవు. కావలిస్తే నాలుగు డబ్బులు ఎక్కువ పుచ్చుకుంటాము. కాని ఇలాటి పనులు మాచేత గావు. మాపిల్ల సంగతి ఎవరినైనా అడగవచ్చు. ఏమయినా అవలక్షణా లున్న వంటే మీరు చేసుకోవద్దు.

హనుమాన్ దాసు: ఇదంతా యెందుకు? నేను మీ యింటికి వస్తాను పిల్లదాన్ని చూపిస్తావా?

రామానందు: [కొంచెం ఆలోచించి] రండి.

హనుమాన్ దాసు: ఏమి రా, గోపీ, వెళ్ళుదామా?

రామానందు: అతనుకూడా ఎందుకు?

హనుమాన్ దాసు: నాకు చత్వారం. వాడు బాగున్న దంటే నేను ఉంటాను.

రామానందు: ఇదేమి సబబ్ సేట్‌జీ! ఈడు వచ్చిన పిల్లను పరాయి వాళ్ళకు చూపుతామా! మీ రంటే—

హనుమాన్ దాసు: చూశావురా గోపీ! ఆ!

గోపీ చందు: నేను చెప్ప లేదూ?

రామానందు: [లేచి] అయ్యా, నేను వెళుతున్నాను. ఆఖరు మాట ఏమంటారు?

హనుమాన్ దాసు: ఏ అనాకారిదో అనాకారిది. ఎనిమిదివే లిస్తాను. ఇష్టమయితే ఫయిసల్ చెయ్యండి.

రామానందు: మాపిల్ల మీకు కుదరదు లెండి! [నిష్క్రమణ]

హనుమాన్ దాసు: ఏమిరా గోపీ, ఇలా అయింది?

గోపీ చందు: పోనిత్తురూ! మీకు నేను వేరే సంబంధం చూస్తాను. ఉండండి.

హనుమాన్ దాసు: నీ కేం చేత నవుతుంది? పైగా ఎక్కడ చూసినా ఈరోజుల్లో పిల్లలు తగని ప్రియం. మాట కన్నానే గాని పన్నెండు వేలు ఎంత చవక! ఇది దాటి పోయిందా, ఇక ఉత్తదే.

గోపీ చందు: ఆమాట నేను నమ్మను. పోనీ, పిల్ల అయినా చక్కని దైతే అనుకోవచ్చు.

హనుమాన్ దాసు: పిల్ల కేం ఫర్వా లేదురా! చిన్నతనంలో ఎప్పుడో చూచిన జ్ఞాపకం. బాగానే ఉండేది. [ఫొటో తీసి] ఇదే మొహం అను కుంటాను ఒరే అవును రా, ఇదే రా చూడు, నీవు వెళ్ళి రామానందుని ఒకసారి పిలుచుకు రా.

గోపీ చందు: నామాట విని ఈసంబంధం మానెయ్యండి. మొదట నుంచీ ఇదంటే నాకేమో అనుమానం పట్టుకుంది. మీ సుఖానికి రాలేదు.

హనుమాన్ దాసు: కాదు లే. నీవు పిలుచుకు రా. లేకపోతే ఒకపని చెయ్యి. నన్ను చూస్తే వాడి కాక ఎక్కువవుతుంది. నీవే మాటాడు. తొమ్మిదివేలు చెప్పు. కాదు కూడ దంటే — పది.

గోపీ చందు: నామాట వినరుగా?

హనుమాన్ దాసు: పోనీ నీవూ వద్దులే. మా బావమరిదిని పంపుతా. నీవు నీపని చూదుకో.

గోపీ చందు: ఎందుకూ, నేను వెళ్ళి వస్తాలెండి. నా కేం కష్టం? మీ మేలు కోరేవాణ్ణి గనక నాకు తోచింది చెప్పాను. ఏమంటారు?

హనుమాన్ దాసు: పోయిరా.

గోపీ చందు: పోవలసిందేనా?

హనుమాన్ దాసు: ఫరవా లేదు, పోయిరా. ఆఖరుమాట పదివేలు. మరిచిపోయేవు! పైన చిల్లిగవ్వ అయినా పెట్టవద్దు. దాని ముండ మోసిన సంబంధం! [నిష్క్రమణ]

గోపీ చందు: ఆదైవం చలవవల్ల ముందుగానే ముండ మోస్తే బాగుం డును! [నిష్క్రమణ]

౨

[రామానందు గృహము. గోపీచందు ప్రవేశించి తలుపు తట్టుతాడు.]

గోపీ చందు: లక్ష్మి, లక్ష్మీ!

లక్ష్మి: [లోపలినుంచి] ఎవరూ?

గోపీ చందు: నేను.

లక్ష్మి: నే నంటే?

గోపీ చందు: నేను గోపీచందును.

లక్ష్మి: ఎందుకూ?

గోపీ చందు: ఎందు కని అడుగుతున్నావా? నేను గోపీచందును.

లక్ష్మి: ఏ మయితే? [బిగ్గరగా] ఎందుకు వచ్చావూ?

గోపీ చందు: [ఏమీ తోచక] రామానందజీ ఇంట్లో ఉన్నారా?

లక్ష్మి: లేరు, పో.

గోపీ చందు: లక్ష్మీ!

లక్ష్మి: ఆఁ! ఏమిటి సొద?

గోపీ చందు: ఒకసారి ఇలా రా: మాట.

లక్ష్మి: [వచ్చి] ఏమిటి మాట?

గోపీ చందు: ఇంత కటికదాన వయినా వేం? తార యెక్కడ?

లక్ష్మి: పట్టపగటి వేళ, ఇపు డేం తార? నీ కేమయినా మతి పోయిందా! పో, ఫో.

గోపీ చందు: అబ్బ, చెపుదూ! తారాబాయి యేది?

లక్ష్మి: ఏవూరు నీది? ఎవర్వు నీవు? తారాబాయితో నీ కేం పని?

గోపీ చందు: ఇ దేమి లక్ష్మీ! ఇవాళ ఇలా మాటాడుతున్నావు! నన్ను ఎరగనే ఎరగవా?

లక్ష్మి: ఆ, బాగా ఎరుగుదును! నీవు చచ్చిపోయి వారంరోజు లయిందన్నారు. ఎలా బతికి వచ్చావని ఆశ్చర్య పడుతున్నా.

తారా బాయి: [ప్రవేశించి] హరి హరి! ఎంతమాట అన్నావే పాపాత్మురాలా! నీకు నోరెలా వచ్చిందే!

లక్ష్మి: నీవుకూడా ఆయన పక్షమే పలుకుతున్నావా! ఛీ ఛీ! మీ మొంగాలు చూడ కూడదు! [నిష్క్రమణ]

గోపీ చందు: [క్షణము నిశ్శబ్దంగా ఉండి] తారా, నీతో ఒక పెద్ద సంగతి చెప్పడానికి వచ్చాను.

తారా బాయి: అవును. అక్కర లేదు లెండి!

గోపీ చందు: ఏమి! నీకూ పనికి రాకపోయినానా! ఆహా! నా బతుకు ఎంత వ్యర్థ మయింది!

తారా బాయి: [అతని ముఖం వంక చూడకుండా అతనికోసం చెయ్యి చాపుతుంది.]

గోపీ చందు: ఎందు కావిముఖత?

తారా బాయి: వారం రోజులనుంచీ కనబడడం లేదని లక్ష్మికి కోపం వచ్చింది.

గోపీ చందు: నీకుగూడా వని తోస్తుంది.

తారా బాయి: లేదు- అదే- వచ్చింది- కాని, మిమ్మల్ని చూడగానే పోయింది.

గోపీ చందు: పుట్టినప్పటినుంచీ ప్రేమ ఎలాటిదో, సుఖము ఎలాటిదో ఎరగను! నీకుకూడా నామీద మనసు తప్పిపోతే—

తారా బాయి: మీ రామాటలు మాటాడ వద్దు. నాకు కష్టంగా ఉంటుంది!

గోపీ చందు: లేదు. అయితే, ఎనిమిది రోజులనుంచీ నిన్ను చూడకపోవడానికి ఎంతకారణ మున్నదో నీ వేమి తెలుసు కున్నావు? మిన్ను విరిగి మీద పడేటంతపని అయింది! పడుతుంది కూడాను — మనం తప్పుకోకపోతే.

తారా బాయి: అంత ప్రమాద మేమి వచ్చింది?

గోపీ చందు: మీ నాయన — నీకు — సంబంధం — కుదిర్చాడు.

తారా బాయి: [కొంచెం ఉండి] ఎవరికి?

గోపీ చందు: తారా, ఇన్నాళ్ళనుంచీ మన మిద్దరం స్నేహంగా ఉన్నాము. నీకు పెళ్ళి అయి మహోద్దశలో ఉంటే, పేదవాడు గోపీచందు ఎప్పుడైనా జ్ఞాపకం వస్తాడా?

తారా బాయి: సంబంధం కుదిర్చిం దెవరికి?

గోపీ చందు: మా సేటుకు — హనుమాన్ దాసుకు. తారా! నీ వేమైనా అనుకో గాని మీ నాయనవంటి దుర్మార్గుడు లేడు! నిన్ను పన్నెండు వేలకు అమ్ముకొంటున్నాడు.

తారా బాయి: ఇది చెప్పడానికేనా నీ విక్కడికి వచ్చింది? అయితే, గోపీచంద్, నీ విక వెళ్ళిపోవచ్చును.

గోపీ చందు: కాదు, కాదు. అసలుసంగతి అట్టే ఉన్నది. ఇలా రా. [తారను దగ్గిరికి తీసుకుని చెవిలో ఏమో చెపుతాడు.], ఏ మంటావు?

తారా బాయి: బాగానే ఉన్నది. కాని నెరవేరే దాకా చాలా జాగ్రత్తగా ఉండాలి. ఈపన్నాగ మెలా తోచింది మీకు?

గోపీ చందు: చబిల్‌దాసు సలహా చెప్పాడు తారా! నా ప్రాణాలు తిరిగి నిలబెట్టావు! నీవు ఒప్పుకోకపోతే—

లక్ష్మి: [ప్రవేశించి] అమ్మా. తారాబాయి! నీ కింత సిగ్గు లే దేమమ్మా! ఈ ఉదయం నీవు చేసినప్రతిజ్ఞ ఏమిటి? ఇప్పుడీపాషండుడితో నీవు జరిపే చర్య యేమిటి!

తారా బాయి: [కోపముతో] లక్ష్మి!

గోపీ చందు: ఇదుగో తారాబాయి, ఇటు చూడు, నీవు నాభార్యను కోప్పడితే నే నూరుకునేది లేదు. ఆమె ఏ మన్నా పడేవాణ్ణి నే నుండగా నీ కెందుకు?

తారా బాయి: [నవ్వుతూ] అప్పుడే నాభార్య అంటున్నారు. లక్ష్మి మిమ్మల్ని పెళ్ళాడుతుందో ఆడదో!

గోపీ చందు: ఏదో కాళ్ళా వేళ్ళా బడి వేడుకుంటాను.

తారా బాయి: వట్టి గయ్యాళిది సుమా — ముందుగా చెప్పుతున్నాను ఆలోచించి మరీ నిశ్చయించుకోండి.

లక్ష్మి: [వెుుగము చిట్లించి] ఇదేమిటి, ఈ కొత్తవికారం?

గోపీ చందు: లక్ష్మీ, నేను అరవైయేళ్ళ ముసలివాణ్ణి. కాని వేలకువేలు ఆస్తి ఉన్నది. నన్ను పెళ్ళిచేసుకుంటావా?

లక్ష్మి: నీవు ముసలివాడవైతే ఇందాక జుట్టు పట్టికొని వీధిలోకి లాగియ్యక పోయినానూ! పడుచువాడవి కాబట్టే బతికిపోయినావు!

గోపీ చందు: నవ్వులాట కాదు లక్ష్మీ, నిజంగా అడుగుతున్నాను.

లక్ష్మి: అయితే నవ్వకుండా చెప్పుతా. నే నసలు పెళ్ళి చేసికో దలచుకో లేదు. నాజీవన మంతా మా తారాబాయితో గడపదలసిందే!

తారాబాయి: అది కాదు లక్ష్మీ! నీవు పెళ్ళి చేసుకుంటే నేను సంతోషిస్తాను.

లక్ష్మి: నీకు తప్పక సంతోషం కలుగుతుందా?

తారా బాయి: చాలా సంతోషము.

లక్ష్మి: అలా గయితే నేను కోతిని పెళ్ళాడ మన్నా పెళ్ళాడుతా! ఒకవిధంగా నీసంబంధం బా గున్నది. గోపీచందూ, పడుచువాళ్ళతో వేగ లేము. ముసలివా డయితే మాటలకు లొంగక పోయినా, చీపురుకట్ట చేత పట్టేటప్పటికి దయ్యం పారిపోతుంది.

తారా బాయి: [లక్ష్మిని కౌగిలించుకొని] లక్ష్మీ, నీ వీ పెళ్ళి కొప్పుకుంటే నాప్రాణం తప్ప ఏదైనా ఇస్తానే!

లక్ష్మి: అదికూడా ఎందు కియ్యరాదు?

తారా బాయి: [గోపీచందువంక చూస్తూ] అది యీవరకే ఇంకొకరి అధీన మైపోయింది!

లక్ష్మి: పోనీ లే. అయితే మీ పన్నాగ మేమిటి?

తారా బాయి: నీకు తీరికగా చెప్తాతా ... అమ్మయ్యో! నాన్నేవు! రా, రా, రా [లక్ష్మిని లాగుతుంది, నిష్క్రమణము]

లక్ష్మి: ఆ, పోదూ. ఏ మయితే? అయితే గోపీచందూ, ఎప్పుడు మళ్ళీ దర్శనం?

గోపీ చందు: ఈసాయంకాలమే తోటలో. పో పో!

లక్ష్మి: రాకపో, చెపుతా. [నిష్క్రమిస్తుంది]

[గోపీచందు కుర్చీలో కూర్చుని తదేకధ్యానముతో వార్తాపత్రిక తిరగ వేస్తూ ఉంటాడు. రామానందు ప్రవేశము]

గోపీ చందు: [లేచి] రాం రాం!

రామానందు: ఓహో గోపీచందా! రాం రాం! ఏం పనిమీద వచ్చావు?

గోపీ చందు: కొంచెం పనిమీదనే వచ్చాను. సావకాశంగా వింటే—

రామానందు: వస్తా, లక్ష్మి, లక్ష్మి!

లక్ష్మి: ఓయి!

రామానందు: ఏం జేస్తున్నావు?

లక్ష్మి: చెల్లెలికి తలంటుతున్నా. ఎందుకూ?

రామానందు: సరే, ఏమీ లేదులే. [కూర్చుని] అయితే గోపీచంద్, ఏమిటోయి నీపని?

గోపీ చందు: మీవద్ద దిక్కులేనిపిల్ల ఒకతె పెరుగుతూందని విన్నాను. ఆ అమ్మాయి విషయమై మాటాడటానికి వచ్చాను.

రామానందు: ఎవరు—లక్ష్మిబాయి సంగతా!

గోపీ చందు: పేరు నాకు తెలియదు. ఆమే కాబోలు!

రామానందు: ఏమిటి దానివిషయము? ముసలాడి దృష్టి దానిమీదికి తిరి.

గిందా యేం? మనం చూడం! చస్తే అలా సంబంధం మార్చి చేస్తానా!

గోపీ చందు: కాదు కాదు, రామానందజీ! మా సేటు విషయ మేమీ లేదు ఇందులో.

రామానందు: మ రేమిటి?

గోపీ చందు: నాకోసమే అడగడానికి వచ్చాను.

రామానందు: నీకోసమా! వారే వా! నీవు పెళ్ళిచేసుకుంటావా దాన్ని?

గోపీ చందు; అవును సేట్ జీ!

రామానందు: ఊహూ, బాగానే వుంది. కాని నాకు మీతో వ్యవహారాలు కుదరవు. మీ సేటు పెళ్ళి అయింది — ఇక నీ దవుతుంది! నాకు నమ్మకం లేదు.

గోపీ చందు: అన్నీ కుదురుతయి మీరు కొంచెం సరసంగా ఆలోచిస్తే. అయినా మా సేటు పెళ్ళిలాటిది కాదుగా నావ్యవహారం?

రామానందు: ఏమి?

గోపీ చందు: ఆహా! మీకు తెలియని దే మున్నది? నే నడిగేది మీస్వంత కుమార్తె కాదుగా!

రామానందు: కాకపోతే మాత్రం? ఇంట్లో పెరిగిన పిల్లను పదిచేటవ్వాడు చేతులు ఖాళీ చేసుకు వదలుతామా, గోపీచందూ? మర్యాద లేద్దూ?

గోపీ చందు: అవును లెండి. నేను మాత్రం అలా కోరుతానా, ఏదో లాభం చూపించకుండా? ఆహా, దానమ్మకడుపు కాల! అంతేనా?

రామానందు: సరె సరె. అయితే ఏమి చెప్పుతావో కానీ.

గోపీ చందు: మీరే ఏదో కాస్త తేలిగ్గా సెల వివ్వండి.

రామానందు: సరే, అమ్మాయికి పన్నెండుగదా — లక్ష్మికి నాలుగు ఇప్పించు. ఏం, నవ్వుతా వేమి?

గోపీ చందు: ఏం జెయ్యను? మా సేటుదగ్గిర చెప్పినట్టే చెప్పితే ఎలా నాదగ్గిరకూడా! మనలో మనకు —

రామానందు: ఏమి టోయి, అలా అంటావు? పెద్దమ్మాయికి ౧౪ వేలు పుచ్చుకున్నాను.

గోపీ చందు: అవును లెండి. ఆరహస్యం మనకు తెలియదూ, తొమ్మిది వేలకేగా బేరం ఖయిన లయింది?

రామానందు: ఎవరు చెప్పారు?

గోపీ చందు: ఆహాఁ, మనలో మాట.

రామానందు: ఊఁ, అయితే ఏ మంటావు?

గోపీ చందు: ఏమీ లేదు. ఎనిమిదంటున్నాడా, తొమ్మిది చేయిస్తాను. రెండు పెళ్ళిళ్ళూ ఏర్పాటు చెయ్యండి.

రామానందు: చాలు చాల్లే, పద పద! ఇలాటి బేర మైతే ఎక్కడ కుదురుతుంది?

గోపీ చందు: ఒకమాట వినండి సేట్ జీ! ఇంతకన్న మన కెక్కడ వస్తుందా?

రామానందు: దాని కేమిలే. పదిసంబంధాలు తిరిగిపోతున్నాయి.

గోపీ చందు: నాకు గంతలు కడతారా? గణపతిదాసు ఒక్కడు. వా డైనా ఆరువేలేగా.

రామానందు: ఎక్కడివాడ వోయి నీవు!

గోపీ చందు: ఆహాఁ, మనలో మాట.

రామానందు: సరే, సరే, ఏ మంటావు? ఏదో తేల్చు.

గోపీ చందు: పోనీ లెండి. ఏదో విధంగా మామగారు కాబోతున్నారు. మంచి అంకె పది అందామూ? అలా చెయ్యండి. మాసేట్ ఇస్తాడు. మీకు తెలియని దే ముంది? ఆరహస్యం అలా ఉంచండి. మరి ఎప్పుడు ముహూర్తాలు?

రామానందు: ఆప నంతా నీదే!

గోపీ చందు: సరే రేపు ఉదయం వస్తాను.

రామానందు: ఏమిటో చాలా దవగ్గా కొట్టేశావోయ్!

[గోపీ చందు నిష్క్రమిస్తాడు]

3

[రామానందు గృహము. రామానందు, చబిలీదాసు ప్రవేశము.]

చబిల్ దాసు: మొత్తానికి బాగా జరిగించారు పెళ్ళిళ్లు.

రామానందు: ఏదో మీ అందరి దయ ఉండబట్టి. కాని మాఅల్లుడి గాను పొకటి లేకుండా ఉంటే చాలా సంతోషించేవాణ్ణి.

చబిల్ దాసు: ఏ అల్లుడు?

రామానందు: ఎవ రున్నారు— పెద్దాయనే.

చబిల్ దాసు: అప్పాకే ఏ మయింది లెండి!

రామానందు: ఏ మన్నారు?

చబిల్ దాసు: ఎప్పుడూ ఉండేదే గదా అంటాను. ముసలివాళ్ళకు తృప్తి లేదు రామానందజీ!

రామానందు: ఈయనగారికి అసలు లేదు. ఏదో కక్కుర్తి పడ్డాను గాని బంగారం వంటిపిల్లను ఇలాటి వాడికా ఇయ్యవలసింది!

చబిల్ దాసు: గోపీచందు కయితే ఈడు జోడుగా ఉండేదేమో!

రామానందు: ఉండేదే కాని [నోరు చప్పరించి] డబ్బు లేదయ్యా!

చబిల్ దాసు: డబ్బుచూచుకొని పిల్లదానిసుఖం చెడగొట్టుతారా శేట్ జీ?

రామానందు: ఆ! సుఖాని కేం లెద్దురూ! ఎక్కడ భాగ్యం ఉంటే అక్కడే సుఖం. పేదవాణ్ణి కట్టుకుని ఏం సుఖపడుతుంది ఆడది?

చబిల్ దాసు: అ దేమి మాట! పరస్పరప్రేమవల్ల సుఖం కలగవలె గాని ధనం ఎప్పుడూ సుఖం ఇయ్య లేదు.

రామానందు: చిన్నవాళ్ళకు తెలియవు లెండి ఈగొడవలు.

చబిల్ దాసు: ఇంతకూ మీకు— అదుగో దంపతులు వస్తున్నారు.

[లక్ష్మి హనుమాన్ దాసులు ముందు, వారివెంబడి తారా గోపీచందులు ప్రవేశించి రామానందుకు నమస్కరిస్తారు. లక్ష్మి తారాబాయివలెను, తారాబాయి లక్ష్మివలెను వేషాలు ధరించి మేలిముసుగులతో ఉంటారు.]

రామానందు: [లక్ష్మి, హనుమాన్ దాసులను] సర్వైశ్వరాభివృద్ధి రస్తు! [తారా గోపీచందులను] శీఘ్ర మేవ సుపుత్రావాప్తి రస్తు:

హనుమాన్ దాసు: ఏడిసినట్టే ఉంది దీవన!

గోపీచందు: [మెల్లిగా] చాలా బాగా దీవించాడు.

రామానందు: హనుమాన్ దాసుగారూ! మీరు నాకన్న పెద్దవారయినా-

హనుమాన్ దాసు: అదుగో మాటాడితే నన్ను ముసలివాడంటావు. నావయసు సంగతి నీ కెందుకు?

రామానందు: పోనీ, నాకంటె మీరు చిన్నవారు కాబట్టి—

హనుమాన్ దాసు: అదుగో, మళ్ళీ వయసుమాట!

రామానందు: లేదు లెండి బాబూ! మాఅమ్మాయి తల్లి లేనిపిల్ల- వట్టి అమాయకురాలని చెప్పవచ్చాను.

హనుమాన్ దాసు: [గొణుగుకొంటూ] ఏమి అమాయకురాలో- ఇందాక బిందెలో ఉంగరం తీయబోతే చెయ్యంతా తెగ గిచ్చింది.

రామానందు: ఏమిటో అన్నారు- వినిపించ లేదు.

హనుమాన్ దాసు: నీమాట కాదులే.

రామానందు: ఇదో ఇన్నాళ్ళు పెంచి మీ చేతుల్లో పెట్టాను. ఎన్నడూ కష్టం అన్నమాట ఎరుగదు. ఎలా ఏలుకుంటారో.

హనుమాన్ దాసు: హు నాకు చెప్పాలె? [మెల్లిగా] ఇది ఆరోది.

రామానందు: అమ్మాయీ, తారా! ఇలా రా అమ్మా. ఊరుకో- ఇది శుభసమయము. కంట నీరు పెట్టరాదు. నీభర్త చాలా పెద్ద- అదే మర్యాదస్థుడు. జాగ్రతగా మసలి పరువు ప్రతిష్ఠలు సంపాదించుకో.

[లక్ష్మి రామానందుని విడిచి భర్తకు నమస్కరిస్తుంది.]

హనుమాన్ దాసు: [మందంగా] అహా, చాలా బుద్ధిమంతురాలల్లే ఉన్నదయ్యో యిది- ఏమో అనుకున్నా.

రామానందు: గోపీచందూ, మా లక్ష్మి వట్టి అజ్ఞానురాలు సుమా! నీవు చిన్నవాడవు—

హనుమాన్ దాసు: అదుగో! మళ్ళీ నన్నవమానిస్తున్నావు.

రామానందు: లేదు లెండి, లేదు లెండి [మెల్లిగా] పీడ తాడు తెగ! నీ డెక్కడ దొరికావురా మాకు! [బిగ్గరగా] 'గోపీచందూ, నీవూ అజ్ఞానుడవే. తిన్నగా సంసారం నిలబెట్టుకోండి. నీవు బుద్ధిమంతుడవే అయినా హనుమాన్ దాసుగారిని చూసి లక్ష్మిని నీకిచ్చాను.

[తార తండ్రిని కౌగిలించుకొని దుఃఖిస్తుంది.]

రామానందు: ఊరుకో తల్లీ, ఊరుకో!

గోపీ చందు: [హనుమాన్ దాసును సమీపించి] సేట్ జీ! మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను. మీకు తెలిసుకుండా నాకు మహోపకారం చేశారు. ఈ పెళ్ళి ఎలా అవుతుందా అని ఎప్పాట్నుంచో ఆదుర్దా పడ్డాను. మీ దయవల్ల మీ వివాహాను మధ్య రావడము వల్ల నా కోరిక నెరవేరింది. నేను ఆశించినపిల్ల నాకు లభించినది. నా సౌఖ్యానికి అంతకూ మీరే కారకులు. జన్మాంతము వరకూ భార్యాభర్తల మిద్దరమూ మిమ్మల్ని తలుచుకుంటూ ఉంటాము.

హనుమాన్ దాసు: మంచివాడవురా, నాయనా! సుఖంగా ఉండు.

రామానందు: అబ్బాయి, ఇక మనం వెళ్ళుదాము [నిష్క్రమిస్తాడు. తార తండ్రితో నిష్క్రమిస్తుంది]

[చబిల్, గోపీచందులు ఇవతలికి వచ్చి జనాంతికము]

చబిల్ దాసు: ఏమిరా గోపీ, నీ కోరిక నెరవేరింది కదా?

గోపీ చందు: నీ మేలు మరచిపోలేను చబిల్!

చబిల్ దాసు: మనము పెళ్ళికూతుళ్ళను మార్చిన సంగతి ఇంకా మీ సేటుకు తెలియదల్లే ఉంది.

గోపీచందు: ఇదుగో ఇకను—

చబిల్ దాసు: తెలియగానే నిప్పులు తొక్కిన కోతివలె ఎగిరిపడతాడు.

గోపీ చందు: కాస్త మన మాతమాపా చూడాలి.

హనుమాన్ దాసు: [మెల్లిగా] ఏమి టావెధవ గుసగుస! ఎంతసేపటికీ పోరేం?

చబిల్ దాసు: మీసీటుదగ్గిర ఫోటో ఏం చేశావు?

గోపీ చందు: మార్చేశాను.

చబిల్ దాసు: సరే. నే వెళ్ళుతా.

గోపీ చందు: నేనూ వస్తా. [సేటును సమీపించి] సేట్ జీ! నేను సెలవు తీసుకుంటాను. మళ్ళీ కనబడతాను.

హనుమాన్ దాసు: పోయి రా.

[గోపీచంద్ నమస్కరించి చబిల్‌తో వెళ్ళుతాడు.]

హనుమాన్ దాసు: [భార్యను సమీపించబోయి ఆగి, గొణుగుతూ] దీని దుంపతెగ! ఎన్నిసార్లు అనుభవమయినా కొత్తపెళ్ళికూతురనేటప్పటికి వణుకు పట్టుకుంటుంది. [మెల్లిగా దగ్గరికి పోయి] ఓసే, ఇదుగో, ఎవరూ లేరులే. నేనేగా. ఇదుగో ఇటు చూడు, ఏదీ మొహమేదీ! కొత్త ఆనుసుకు తీతూ! ఏది ఒక్కముద్దు! అంత సిగ్గెందుకు? నేనేగా, ఎవరూ లేరులే. ఏది!

లక్ష్మి: ఏమని మొగం చూపించేది! ఒక సొమ్ము పెట్టారనా, ఒకచీర ఇచ్చారనా?

హనుమాన్ దాసు: నేను భయపడుతునే ఉన్నా. వీళ్ళకు మాటాడితే సొమ్ము. ఎప్పుడూ ఉండేదే ఇది! [బిగ్గరగా] సొమ్ముకేం భాగ్యం! నాసొమ్మంతా నీదే, నీసొమ్మంతా నాదే. పెళ్ళికి ఇరవైవేలు ఖర్చామరి! అప్పుడే ఎక్కడనుంచి వస్తుంది? నాలుగేళ్ళాగితే—

లక్ష్మి: వాళ్ళందరికీ పెళ్ళప్పుడే చేయించి పెట్టారటగా!

హనుమాన్ దాసు: వాళ్ళకా పెళ్ళినాడు కాదు గదా, నూరేళ్ళు బతికినా చిల్లిగవ్వయినా మెళ్ళో వేసేవాణ్ణేనా?

లక్ష్మి: ఆహా! అయితే నాకూ అలాగే!

హనుమాన్ దాసు: అహాహాహా! నీ కలా కాదు. నీసంగతి వేరు. చూస్తుండు.

లక్ష్మి: అవును, నాలుగేళ్ళు ముక్కుల్లో వేళ్ళు పెట్టుకు చూర్చోవాలి!

హనుమాన్ దాసు: పోనీ, ముందటేటి కేమైనా చూస్తాలే.

లక్ష్మి: ఏడాది దాకానా? నా కక్కర లేదు.

హనుమాన్ దాసు: వచ్చేనెలలో ఒక ఉంగరమో, ఏదో చేయించనా?

లక్ష్మి: ఇంటకి వచ్చేముట్టం, పోయేముట్టం. పెళ్ళి చేసుకుని పెద్దమ్మ వారి లాగు అందరి యెదట తిరుగుతానా? నా కే మక్కర లేదు.

హనుమాన్ దాసు: పోనీ, ఒక వారంరోజు లాగు.

లక్ష్మి: వారంరోజులే! అప్పటికి పెళ్ళికూతురుతన మంతా పోతుంది.

హనుమాన్ దాసు: వారంరోజు లాగవూ?

లక్ష్మి: రే పుదయం కంసాలిని పిలిచి, నాగరం, కాసులపేరు, కంటె, మెడలో పట్టెడ, నడుముకు వడ్డాణం— ఇవన్నీ చేయిస్తానంటే సరే! లేకపోతే ఇక్కడ ఒక్కక్షణ ముండను. ఈతాళిబొట్టుకూడా మీరే తీసుకోండి. నేను పోతా.

హనుమాన్ దాసు: [మెల్లిగా] కొంప దివాలాకే వచ్చింది. [ప్రకాశముగా] ఓహో! బాగున్నదే! చిన్నపిల్లవుకదా అని ఏదో నాకుతోచింది చేయింతా మనుకొన్నా. ఇలాటి మారాములు నాదగ్గిర సాగవు. బాగానే ఉంది మొత్తానికి!

లక్ష్మి: [దుఃఖముతో] అయ్యో! నన్నెందుకు పెళ్ళి చేసుకున్నారు? నన్ను పెళ్ళి చేసుకోకపోతే మీడబ్బంతా మీదగ్గరే ఉండేదిగా! అయ్యో! ఈతిట్లు తినడానికే కాబోలు మానాన్న నాకు పెళ్ళిచేశాడు.

హనుమాన్ దాసు: లేదులే. ఎరక్కపోయి అన్నా! ఊరుకో, ఊరుకో. ఎవరైనా వింటారు, ఊరుకో.

లక్ష్మి: మీరు తిట్టడం బాగానే ఉంది, నాకు దుఃఖము వస్తే తప్పా?

హనుమాన్ దాసు: లేదులే. నిన్ను తిట్టానా?

లక్ష్మి: ఇష్టం వచ్చినట్టు తిట్టి, పైగా తిట్టలే దనడం కూడానా!

హనుమాన్ దాసు: లేదులే ఊరుకో. నీవు దుఃఖిస్తే నేను చూడగలనా? ఆముఖ మంతా ఎంత వాడిపోతుంది! ఆకమలముల వంటి కన్నులూ, ఆదొండపండు వంటి అధరోష్ఠమూ, ఎంత మలిన మైపోతవి! ఏదీ, ఒక్క సారి నీముఖము చూడనీ! నీఫోటో చూచుకొని ఎంత మురుస్తూ ఉండే వాణ్ణి! ఏదీ?

[హనుమాన్ దాసు మెల్లిగా లక్ష్మి మేలిముసుగు తొలగిస్తాడు. లక్ష్మి నవ్వుమొగముతో కనబడుతుంది. హనుమాన్ దాసు చూచి, కన్నులు నులుముకొని మళ్ళీ చూచి నిర్ఘాంతపోయి నాలుగు దిక్కులా చూస్తాడు.]

లక్ష్మి: ఎందుకలా చూస్తారు?

హనుమాన్ దాసు: నీ వెవరు?

లక్ష్మి: నే నెవరా? అప్పుడే అందాకా వచ్చిందా!

హనుమాన్ దాసు: రామానందుడు కూతురు నీవేనా?

లక్ష్మి: అయ్యో! నేను మానాన్నకూతుర్నే కదా! అయ్యో, నాబ్రతుకు చెడ! ఇంత మాట అనిపించుకోవడానికా భగవంతుడు నన్ను సృష్టించాడు? అయ్యో! నాన్నా! నీకూ నాకూ సంబంధం తెగిపోయింది. నేను నీకూతుర్నే కాదట! అయ్యో—

హనుమాన్ దాసు: [పెట్టెలోనుంచి ఫోటో తీసి చూచి] అంతా ఇదే పోలికగా ఉన్నదే! నా కేమైనా మతిభ్రమ కలుగుతున్నదా యేమిటి!

లక్ష్మి: [సమీపించి ఫోటో చూచి] అది నా ఫోటోయే. నాపోలిక గాక ఇంకా ఎలా ఉంటుంది? మీకు నిజంగా మతిపోయింది!

హనుమాన్ దాసు: [దడబిడలాడుతూ] నా కేదో మైండు చేశారు. నాకొంప తీశారు. ఈఫోటో ఇదివర కిలా లేదు. నాకళ్ళకు గంతలు కట్టారు. అయ్యో! గోపీచందూ, నీమాట వినకపోతినిరా! నన్ను రామా నందు నట్టేట్లో ముంచాడురా! [గోల పెట్టుతాడు]

గోపీచందు: [తత్తరముతో ప్రవేశించి] ఏమిటి సేటుజీ ఏమిటి, ఏమిటి?

లక్ష్మి: [చటుక్కున మేలిముసుగు వేసుకుంటుంది]

హనుమాన్ దాసు: చూడు, చూడు. ఈఫోటో చూడు నాకొంప ముంచారురా, చూడు!

గోపీచందు: ఏమి సేటుజీ! ఈఫోటో కేమి? మన మిదివరకు చూచిందేగా!

హనుమాన్ దాసు: ఇదివరకు చూచినదేనా! నీవెవరు గోపీచందువేనా?

గోపీ చందు: అ దేమి సేట్ జీ, అలా అడుగుతారు?

హనుమాన్ దాసు: ప్రపంచ మంతా ఎప్పటిమోస్తరుగా కనబడు తుంటే ఈఫోటో ఒక్కటే మారిపోయిం దేమిటిరా! తిన్నగా చూడు.

గోపీ చందు: లేదు సేట్ జీ, ఫోటో ఎప్పటిలాగానే ఉన్నది.

హనుమాన్ దాసు: గోపీ, మన ఇద్దరిలో ఎవరికిరా గుడ్డి; నీకా నాకా?

గోపీ చందు: మీకు కొంచెం చత్వార మన్నమాట వాస్తవమే కాని, అమాత్రానికే గుడ్డితన మంటామా?

హనుమాన్ దాసు: నీచత్వారం చట్టుబండలు గాను! ఇలా స్పష్టంగా కనబడుతుంటే చత్వార మేమిటిరా?

గోపీ చందు: అదే తమాషా! చత్వారంలో ఉండే కిటుకే అది, అన్నీ కనబడుతున్నట్టే ఉంటయి.

హనుమాన్ దాసు: అయితే ఇదే ఆఫోటో అంటావు?

గోపీచందు: అచ్చంగా అదే మీకు జ్ఞాపకం లేదూ? నాకు చూపిస్తూ ముక్కు కొంచెం వంకరగా ఉంది, కంట్లో కాస్త పెల్లకూడా ఉన్న దన్నారు.

హనుమాన్ దాసు: నేనా అన్నది! నువ్వు కాదుట్రా?

గోపీ చందు: కాదు. మీరే ముద్దపెదవు అని కూడా అన్నారు. ఇంకా జ్ఞాపకం తెచ్చుకోండి. నేను కాదంటే ఓర్థించారు కూడా.

హనుమాన్ దాసు: లోకమంతా తారుమారై పోతున్నది! అయితే ఇప్పుడిది వంకరముక్కంకాదంటావు?

గోపీ చందు: ఎబ్బే! వంక రెక్కడ? పెన్సలు పుల్లలాగా సాపుగా ఉంటే.

హనుమాన్ దాసు: అలా కాదు. ఉండు. అసలుముక్కు చూచి చెప్పేదువు గాని వంకర ఉందో లేదో, ఆముసుగు తియ్యవే! ఎందుకు వచ్చిన ముసుగూ!

గోపీ చందు: అమ్మా! మీకు బిడ్డలాంటివాణ్ణి. ఫరవా లేదు, తీయండి. బాబుగారేవో ఆందోళనలో వడ్డారు. వారి అనుమానం తీరితేనే తప్ప మీకూ మాకూ సుఖం లేదు.

లక్ష్మి: [తలవంచి ముసుగు తీస్తుంది]

గోపీ చందు: చూడండి, సేటుజీ! ఎక్కడైనా వంకర ఉన్నదేమో. అచ్చంగా ఫోటోలో ఉన్నట్లున్నది.

హనుమాన్ దాసు: ఆమాటమాత్రం నిజమే.

గోపీ చందు: అహా! ఆకళ్ళే మిటి, ఆపెదవు లేమిటి!—నా భార్య మొహంవ ఇందులో సగంకళ ఉంటేనా—

హనుమాన్ దాసు: సరె, సరె, చాల్లేవే! ముసుగు వెయ్యి, ముసుగు వెయ్యి అబ్బాయి, గోపీ. ఇక నీవు వెళ్లు. ఏదో పైత్యవికారంగా ఉండి అలా మాటాడానులే.

గోపీ చందు: నేను మొదటే చెప్పితినిగా—పైత్యంతప్ప మరేమీ లేదు. మీభార్య కేమి సేటుజీ—

హనుమాన్ దాసు: సరె, సరె, పోయిరా.

గోపీ చందు: సెలవు! [వెళ్ళిపోతాడు]

హనుమాన్ దాసు: [కూలబడి] ఊ, ఎవరిని చూడబోయినా ఇలా ఉంది లోకం! ఎవరితోనన్నా చెప్పుకుందామంటే సిగ్గుచేటు. వాడు మొదటే చెప్పాడు- నానుఖానికి రాలేదని ఓసీ, ఇదేమి చేవు!

లక్ష్మి: [వెనుకగా వచ్చి, హనుమాన్ దాసు జుట్టు కొంచెం లాగి విడిచి] అయితే, ఏమిటయ్యా, మెళ్ళో పుస్తె కట్టానుగదా అని పదిమందిలో పరీక్ష చేసి, నాకు పరాభవం చేస్తారా? నాది వంకరముక్కా? మెల్లకన్నా? మీరు బాగున్నారుకదా—నాచక్కదనంతో మీ కేంపని? ఇంత అవమానం జరిగి, మీకు అంత పనికిరాక పోయినాక నాబతు కెందుకు? ఇదిగో, మీతాళిబొట్టు తీసుకోండి. నే నేదైనా గొయ్యి చూచుకుంటాను. [పోబోతుంది].

హనుమాన్ దాసు: [అడ్డుపడి కాళ్ళు పట్టుకుని] వద్దు వద్దు. కోపం వద్దు. నాబంగారుగా! నాచిలకగా, నాపండుగా! నీవు పోతే ఇం కేముంది? ఎరక్కపోయి అన్నా!

లక్ష్మి: [కన్నీరు పెట్టుకొంటూ] మీరన్నమాటల కింకొకతె అయితే నా-

హనుమాన్ దాసు: లేదు లేదు. నీవు బుద్ధిమంతురాలవు ఆసంగతి మరచిపో.

లక్ష్మి: ఎలా మరచిపోతా నేమిటి? మీకు నామీద ఇంతైనా ప్రేమ లేకపోయిన తర్వాత! మీ సంబంధం కుదిర్చా నని నాన్న వచ్చి చెప్పితే సంతోషం పట్టలేక ఎగిరి గంతులు వేశాను. తీరా పెళ్ళి అయినాక ఇలా అయింది నాగతి!

హనుమాన్ దాసు: ఎంతమాట! ఎంతమాట! నీమీద నాకు ప్రేమ లేదూ? చూడు ఏదీ ముద్దు! [ముద్దు పెట్టుకుని మెల్లిగా] హు, ఈ కాకి పది వేల రూపాయిలా? ఏనాటి ఋణమో చెవులు మెలేసి లాగాడు రామానందు! [బిగ్గరగా] లోపలికి వెళ్ళుదామా?

లక్ష్మి: నా నగలమాటేం చెప్పారు?

హనుమాన్ దాసు: [మెల్లిగా] ఇంకా అసల్ ఫాయిదా అంతా చెల్లలేదు. [బిగ్గరగా] ఇదుగో చెప్పానుగా రం. [ఇద్దరు వెళ్ళుతారు. గోపీచందు గంతులువేస్తూ ప్రవేశించి] లక్ష్మి, లక్ష్మి.

తారాబాయి: [మేలిముసుగుతో ప్రవేశించి] ఆ పేరున పిలిస్తే నేను పలకను!

గోపీ చందు: ఓసీ అప్పుడే మరచిపోయినావా? ఆపేరు అడ్డం రాకపోతే మనమీపాటికి ఎలా ఉండేవాళ్ళమో! సరే, ఇక నీముఖం చూతాము [హనుమాన్ దాసును అనుకరిస్తూ] ఏది, ఏది, ఎవరూ లేరుగా నేనేగా ఏది ఏది [ఇద్దరూ నవ్వుకుంటారు.]

గోపీ చందు: [తారాబాయి మేలిముసుగు తొలగించి, భుజాలపైన చేతు లుంచి చూచి] తారా, నాకన్న అదృష్టవంతు లున్నారా?

తారాబాయి: ఆ.

గోపీ చందు: ఎవరు?

తారా బాయి: నేను! [ఆలింగనము.]

౧౯౨౧

# గజ్జల మొలతాడు

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

*

అంకితము

పద్మావతికి

*

పాత్రలు

భార్య : భర్త

భర్త-అత్తగారు

భర్త-మామగారు

స్థలము: భర్త ఇల్లు. ఈనాటిక ఒకనాటి సాయంకాలం ప్రారంభమై మర్నాడు సాయంకాలానికి సమాప్తి అవుతుంది. సుమారు ౨౪ గంటలు మొత్తంమీద జరిగి ఉంటుంది.

## మొదటి రంగము

భర్త కోమల స్వరూపుడు: బక్కపలచగా పొడుగుగా ఉంటాడు. కోలముఖము, పచ్చనిదేహము భార్య కొంచెము లావుగానూ పొట్టిగానూ ఉంటుంది. ఆమెది గుండ్రని ముఖము. కళ్ళల్లో వెర్రిచూపు అప్పుడప్పుడు కనిపిస్తూ ఉంటుంది. ముక్కు కొంచెము విశాలమైనది. చామనిచాయ మనిషి. సామాన్యంగా తెలుగుదేశంలోని. స్త్రీలవలె సుకుమారముగా ఉండవలెననే ప్రయత్నముకూడా చేయదు.

భర్త చదువుకునే గదిలో కుర్చీలో కూర్చున్నాడు. ఆ గదిలోనుంచి పక్కనున్న హాలులోకి పోయే ద్వారమువద్ద. భార్య మొదట నిలుచుని ఉంటుంది. సంభాషణ కొంత సాగిన తర్వాత ఆమె అక్కడనే నేలమీద

కూర్చుంటుంది. హాలులో ఉయ్యాలమంచములో పిల్లవాడు నిద్రపోతు న్నాడు. ఏమాత్ర మైనా శబ్ద మున్నప్పుడల్లా భార్య ఉయ్యాల తొట్టివంక అదుర్దాతో చూస్తూ ఉంటుంది.

భార్య: మీ కామాట అంటే పిచ్చిలూ వెర్రులూ పుడతవేం?

భర్త: దుర్మార్గురాలా, స్త్రీలు కోమలస్వభావం కలవాళ్ళని వెర్రివాళ్ళు అంటారే కాని మన పూర్వు లన్నదే నిజం. రామాయణంలో అగస్త్యుడు స్త్రీల సంగతి ఏమన్నాడో తెలుసునా? వాళ్ళు—

భార్య: ఏమో, మీకవిత్వా లన్నీ నాకు తెలియవు. ఆరు నూరు అయ్యేది, నూరు ఆరయ్యేది, పిల్లవాడికి ఆ మొలతాడు పెట్ట నియ్యను.

భర్త: [విచారముతో] పిచ్చిదానా, అంత భయ మెందుకూ?

భార్య: ఏమో నండి, అది చూస్తేనే నాకు పామును చూసినట్లుంటుంది.

భర్త: సొమ్ములో ఏ మున్నదే?

భార్య: ఏమో! ఉన్నా ఉండకపోయినా అది నేను వద్దంటున్నా గదా! మన కది చెరిపిస్తే దరిద్రము రాదు. ఐనా సొమ్ములో ఏమీ లేక పోతే మీకు మాత్రమూ పట్టుదల ఎందుకు?

భర్త: [చిరాకుతో] నీపెత్తన మేమిటి? నేను ఆగజ్జల మొలతాడు పిల్లవాడికి పెట్టి తీరుతాను. ఏం జేస్తా వేం?

భార్య: చెప్తుంటే మీకు మరీ ఆగడంగా ఉన్నదే! మనసుకైనా పిల్ల వాణ్ణి ఒక్కసారి దగ్గిరికి తీసుకోటానికి ముట్టరు గాని ఇందుకు మాత్రము వాడిమీద ఎక్కడలేని ప్రేమా వచ్చింది కాబోలు!

భర్త: అవును మరి! దాసరివాణ్ణి పెంచుతున్నట్లుగా ఒంటినిండా తెల్ల పూసల పేరులు వేసి మెడలో బిళ్ళలు కట్టి వాణ్ణి పెంచుతూ ఉంటే ఎట్లా దగ్గిరికి తియ్యబుద్ధి పుడుతుంది!

భార్య: [మూతి పొడుగు చేసి] అబ్బో!

భర్త: ఇంత చక్కని పిల్లవాణ్ని కంటివి మరి!

భార్య: ఏమిటి, అట్లా మాటిమాటికీ అనాకారివాణ్ని కన్నానని చెప్తా వారు! చక్కనివాడో అనాకారివాడో; కాకిపిల్ల కాకికి ముద్దు. అట్లాగే దిగంబరుడి వల్లే బతకనిద్దురూ!

భర్త: సొమ్ములు పెడితేనే పిల్లలు చచ్చిపోతారా ఏం?

భార్య: ఏ మయిందీ మన 'వాణి'కి? ఈగజ్జెల మొలతాడేగా నాకొంప తీసింది! ఆమాదిరిది వద్దో మొర్రో అంటూంటే నాకు వ్యతిరేకంగా చేయించారు. అది బొమ్మలో, ఇట్లాంటిది, అని చూపినప్పుడే నాకు పాములాగా కనబడ్డది! అది వంటిన పెట్టిన రోజేగా, వాణికి జబ్బు చేసింది!

భర్త: ఇంత కటువుగా ఎట్లా మాట్లాడుతావే! వాణికి పేరుగా దాన్ని పిల్లవాడికి పెడదా మంటే రాక్షసివలె అడ్డుపడతా వేం?

భార్య: వంశము నిలిపే పిల్లవాడు పుడితే వాణ్ణి ఎన్నడైనా ఎత్తుకున్న పాపానన్నా పోలేదు, కాని ఎన్నాళ్ళనాడో పోయిన అపముండ సొమ్మంటే దానిమీద మీ కంత వ్యామోహ మెందుకు?

భర్త: కటికిదానా, 'వీణ్ణి అంతా నీ ఇష్టం వచ్చినట్లే కన్నావుగా! ఇదన్నా నా ఇష్టప్రకారము జరగనీయవా?

భార్య: అయ్యో, ఏమిటండీ మీ కీ పిచ్చి!

భర్త: అవును మరి! సిగ్గన్నా లేకుండా బాగులు చేయించుకొని ఆంజనేయ ప్రదక్షిణాలు చేసి మన్మథుణ్ణి కన్నావుగా!

భార్య: ఏ మంత ఎత్తి పొడుస్తారు! మన్మథుడో, ఎలికలవాడో! వాడు ఏ పిచ్చి వాడి వల్లైనో నాలుగు కాలాల పాటు బతికి ఉంటే నాకదే చాలు. చక్కనివా డైతే మనకు ఒరిగించే దేమన్నా ఉన్నదా ఏం?

భర్త: ఎలికలవాళ్ళే నయం నీకొడుకుకంటె! వాళ్ళు మనుష్యులవలె నైనా ఉంటారు. నీవో, ఒక్కకొక్కే లేదు కాని, కోతిని కన్నావు!

భార్య: [తనచేయి నోటిమీద పెట్టుకొని] అయ్యో! ఏమి టండీ ఆ మాటలు! అట్లా అన్నరా దండీ!

భర్త: అనవచ్చు నేమిటి, అనగూడ దేమిటి! కోతులకు మొక్కితే కోతులు పుట్టక ఏం జేస్తారు? తనకే లేం అందము దేవుడు భక్తులకు మాత్రము ఎల్లా ఇస్తాడు? ఆయన ధర్మాన అతోకమాత్రం ఇంకా ఇయ్యడం లేదు!

భార్య: ఏం పాప్ష మండీ ఇది! అట్లా దేవుణ్ణి తిడతా రేం? [కళ్ళు మూసుకొని చెంపలు వేసుకుంటుంది.]

భర్త: అంత మనసుగా ఉంటే నేనుకూడా చెంపలు వాయిస్తా పట్టు! దేవుడు కాడు, మన దేశంలో ఉన్న కాస్త సౌందర్యాన్ని చంపుతున్న దయ్యం మీ హనుమంతుడు!

భార్య: అయ్యో! వద్దన్నకొద్దీ అట్లా మాట్లాడు తారే! ఇదేం పాప కర్మ మండీ!

భర్త: పోనీ. హనుమంతుణ్ణి కొలవకపోతే ఇంకా కాస్త చక్కని దేవుణ్ణి కొలవరాదూ? ఇక వినాయకుణ్ణికూడా ఇంట్లో కులదైవంగా పెట్టినావా అంటే, మనవంశంలో అందం పూర్తి అవుతుంది!

భార్య: ఊరికే దేవుళ్ళ నట్లా తిడతారు గాని, పుట్టిన పిల్ల లంతా అట్లా పోతుంటే మరేం జెస్తాను, చెప్పండి? పోనీ, ఏదో కర్మం లేకపోతే, పుట్టిన నలుగురిలో ఒక్కరైనా బదకరాదూ? అయ్యో! చెప్పితేకూడా వినరేమండీ! వినవలె ననిబుద్ధి పుట్టదా ఏమిటి?

భర్త: ఏమో, నాక దంతా తెలియదు. ఇప్పటిదాకా నీ ఇష్టము వచ్చినట్లు చేయ నిచ్చాను. ఈ మొలతాడు మాత్రము పిల్లవాడికి నన్ను పెట్టనీ. వాడికి పెడితే నాకు 'వాణి' మళ్ళీ బతికి వచ్చినట్లే ఉంటుంది!

భార్య: ఎప్పుడో చచ్చిపోయిన దానిమీద మీకు ఇంత వ్యామోహ మెందు కండీ? మును పెప్పుడూ లేని ఈ మొండితనము మీ కిప్పు డెవరు నేర్పినారండీ?

భర్త: 'వాణి' లేని దుఃఖమే నా కీపట్టుదల నేర్పింది. ఆ మొలతాడు చూస్తే 'వాణి' మళ్ళీ చూచినట్లే ఉంటుంది. అది కదిలిన శబ్దమవుతుంటే 'వాణి' ఇంట్లో తిరుగుతున్నట్లే ఉంటుంది. దాని గజ్జెలు ఘల్లు మంటే 'వాణి' మళ్ళీ నవ్వినట్లే ఉంటుంది. నాఒళ్ళు ఝల్లు మంటుంది!

భార్య: [కన్నీళ్ళతో] ఐతే మాత్రము అది బతికి వస్తుంది టండీ? అనుమానం మనస్సులో ఉంటే గిలిగా ఉండి బాధిస్తుంది. ఆ మొలతాడు ఇంట్లో ఉంటే మీకు అట్లాగే కష్టంగా ఉంటుంది కాని, చెరిపించి నాకు నానుతాడు చేయించండి! దాన్ని చూస్తేనే నాకు భయమండీ!

భర్త: [వికృత స్వరములో] దుఃఖమున్నదానికి చెల్లదు గాని కన్నీళ్లు వస్తవి! 'వాణి' సొమ్ము పెట్టుకొని కులకవలె ననిఉన్నదేం నీకు?

భార్య: అయ్యో, నా కిప్పుడు సొమ్ములకే కొదవగా ఉన్నది. నా అందానికి తక్కువైన దని! ఏదో, పోయిన వాళ్ళ వస్తువు ఇంట్లో కనబడుతూ ఉంటే మనస్సుకు కష్టంగా ఉంటుం దని నే నంటే, దాని కింత రాద్ధాంత మెందుకు?

భర్త: [యథావిధిగా శాంతముతో ఆదరముతో] సరే. అదంతా ఇప్పుడెందుకు గాని, పిల్లవాడికి ఆ మొలతాడు కడదాం. కృష్ణుడి వల్లే ముద్దు వస్తూ ఉంటాడు. అది పెట్టనిస్తే వాణ్ణి దగ్గరికి తీస్తా!

భార్య: వాణ్ణి మీరు దగ్గిరికి తీస్తే తీశారు, లేకపోతే లేదు. కాని మొలతాడు మాత్రము వాడికి కట్ట వద్దు. మొలతాడు చేయించుకొని వస్తిరి, పెట్టే పెట్టడంతోటే పిల్ల ఉలిక్కి పడెను, ఆ రాత్రికే జ్వరం వచ్చి, ఆ జ్వరంతోనే పోయిందాయెను!— చేయించిన వస్తువు అచ్చిరాక పోతే అనుమానంగా ఉండదండీ మరి!

భర్త: అనుమానం ఏమిటి? ఈ సొమ్ము దానిని చంపిందా ఏం? నేను ఎంతో మనుసుపడి ముద్దుకొద్దీ బోలెడు కూలి పెట్టి పట్నంలో ఇంగ్లీషు కంపెనీలో చేయించి తెప్పిస్తే అది పెట్టిన తరువాత దాని ఆయుస్సు చెల్లి

దానిదోవను అదిపోయింది. ఆ అనుమానం పెట్టుకుని అది పిల్లవాడికి చక్కగా పేడదా మంటే పెట్టనియ్యవు: ఇ దెక్కడి ప్రేమే!

భార్య: ఏమో; నాకు దానిమీద అనుమానం!

భర్త: నీకు అను మానం లేనిది దేనిమీద? చీకటిలో ఏ దస్నా వస్తువు కనబడితే అది నీకు దయ్య మాయెను! ఇంట్లోకి ఖర్మం చాలక పేడపురుగు వస్తే దాన్ని చంపేదాకా వణుకుతా వాయెను! నీకు అనుమానం లేని దేమున్నది?

భార్య: ఏమో, నాకు భయ మండీ!

భర్త: నామాట విని ముచ్చటగా పిల్లవాడికి ఈసొమ్ము పెట్టనీ. అది పెట్టనిస్తే 'వాణి' బతికివచ్చినట్లు ఉంటుంది నాకు.

భార్య: మీ కీ పిచ్చి ఎందుకు? అనుమాన మండీ!

భర్త: ఇంకా అనుమాన మేమిటి! మీవాళ్ళ ఇంటికి వెళ్ళి బాగులు చేయించుకుంటివి. నీ ఇష్టదైవానికి ప్రదక్షిణాలు చేస్తివి, నీ ఇలవేల్పే పోలినంత చక్కని పిల్లవాణ్ణి కంటివికూడా నాయెను! ఇంకా అనుమాన మెందుకు?

భార్య: ఏమో పిచ్చిదా న్నండీ; నన్ను ఆటలు పట్టిస్తారు! చక్కనివాడో అనాకారివాడో, ఎవ రైతే మన కేం? పిల్లవాడు కాడా? మా నాయన, హనుమంతమూర్తి కటాక్షించవలె గాని! [వడి వడిగా మధ్య మధ్య బిగ్గరగా వినపడేట్లు తనలో తాను చదువుకొంటుంది] "శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం, ప్రభాదివ్య కాయం, ప్రకీర్తి ప్రదాయం, ప్రశస్తాత్మకాయం, ... భజే వాలిగాత్రం ... నీరూపు వర్ణించి ... నీసుందరం బెంచి ... దాసాను దాసుండనై ... ఎవ్వాడుగా దవ్వుకన్ నిన్ను నే గొల్చెదన్ ... నీవే సమస్తంబు ... శాకినీ ఢాకినీ గాలిదయ్యంబులన్ నీదు వాలంబునం జుట్టి నేలం బడం గొట్టి నీ ముష్టిఘాతంబులం ద్రుంచి ... నమస్తే నమస్తే నమః!

[భార్య దండకం చదువు తున్నంతసేపూ భర్త శాంతముగా చిరునవ్వు

నవ్వుతూ ఆమెవైపు చూస్తూ ఉంటాడు.] మీరు చక్కదనమో అని ఎప్పుడూ అంటారు కాని చక్కని పిల్లలు పుడితే మనకేమైనా ఒరుగుతుందా? అది గాక, మగవాళ్ళు ఎట్లా ఉంటే నేం, పెళ్ళి కాకపోతుం దని దిగులుండదు గదా!

భర్త: అవును లే- హనుమంతుణ్ణి కొలిచేవాళ్ళకు ఇంతకంటె మంచి అభిప్రాయాలు ఎలా ఉంటవి? కాని మా ప్రభాదివ్యకాయుడు నీకు ప్రత్యక్షంగా! ఇక మొలతాడు పిల్లవానికి పెడితే మాత్రం ఏమి భయం? ఇది ఒక్కటీ నా కోరిక ప్రకారం జరగనియ్య రాదా?

భార్య: ఏమిటో నండీ, నన్ను పిచ్చిదాన్ని చేసి ఆడిస్తారు. నా కేమీ తెలియదు! మీకు అంత పట్టుదల అయితే పెట్టుకోండి! నాకు మాత్రం అది ఇష్టం లేదు. మా నాయన హనుమన్నదయ ఉంటేచాలును! [మళ్ళీ భక్తితో]
“ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం...”

భర్త: [భార్యను సగంలో నే ఆపి, సంతోషంతో స్వభావసిద్ధమైన మార్దవంతో నవ్వుతూ] దానితో ఇదికూడా కలిపి పాడుకో!

“ఓ బొజ్జ గణపయ్యా,
నీ బంటు నే నయ్యా,
ఉండ్రాళ్ళ మీదికి
దండు పంపు!,”

భార్య: ఆ మొలతాడు పెట్టవచ్చు నంటే మీకు అంత బ్రహ్మానంద మేం ఎంత వెర్రి వారండీ మీరు! [భర్త నవ్వుతూ కుర్చీలోనుంచి లేస్తాడు.]

## రెండో రంగము

[భర్త అత్తగారూ మామగారూ అప్పుడే వచ్చినారు. మామగా
కాళ్ళు కడుక్కోడానికి వాకిట్లోకి వెళ్ళినారు. అత్తగారు కాళ్లు కడుక్కో

కుండాళే ఆదుర్దాతో కూతురి దగ్గరకు వచ్చింది. స్థలము పాలు, ఉయ్యాల తొట్టెలో పిల్లవాడు లేడు. మొదటిరంగములో గదివంటిదే ఇంకోగది పాలుకు రెండోవైపున ఉన్నది.]

అత్తగారు: మళ్ళీ ఈకర్మ మేమిటే?

భార్య: నారాత అట్లా ఉన్నది! [ఇద్దరూ కన్నీళ్లు పెట్టుకుంటారు.]

అత్తగారు: ఎప్పటినుంచి జబ్బు మొదలు?

భార్య: నేనీ ఇంట్లో నోరెత్తేటందుకు కూడా వీలు లేకుండా ఉన్నదే!

అత్తగారు: ఏమిటే అది! అవస్థ వచ్చినప్పుడు కొంత ఓర్చుకోవలె నమ్మా!

భార్య: వాటంతట అవి వచ్చిన అవస్థలైతే ఎట్లాగైనా ఓర్చుకో వచ్చు! చేతులారా నెత్తిన తెచ్చిపెట్టుకొన్న వాటికో!

అత్తగారు: అయ్యో, పిల్లవాడు పండల్లే ఉన్నాడు గాదటే! ఏమైనా ఆ అంజన్న దయవల్ల బాగున్నా డనుకుంటే ఇట్లా వచ్చిం దేమే?

భార్య: నీకూ నాకూ పండల్లేనే ఉన్నాడు. అందరికీ అట్లా ఉండ వద్దూ? వాడు అనాకారివా డట. కోతిని కన్నా వని నన్ను తిట్టిపొయ్యని రోజు లేదు. దాసరివాణ్ణి పెంచినట్లుగా పెంచుతున్నా నట! ఎలికలవాళ్ళన్నా నయ మట! కోతివల్లే—

అత్తగారు: మీ ఆయన దేనా ఈసరాగ మంతా! అట్లా పిల్లలను అన గూడదు కూడాను! దాసరివాడి వల్లనో ఎలికలవాడి వల్లనో దీర్ఘాయుర్దాయంతో ఉంటే అదే చాలు! పుట్టక పుట్టక మగబిడ్డ పుడితే ఈఅల్లు కూడానా? లేని వాళ్ళు మంతా మగ నలుసు కనబడితేనే చాలు నని, కన వడ్డ పుట్టకూ చెట్టుకూ మొక్కుతూ ఉంటే దైవము ఇచ్చిన బిడ్డకు మీ కింత గోలా?

భార్య: నే నేం చేస్తానే? ఆయననోరు కట్టిపెట్టే దెట్లా? కోతికి ప్రదక్షిణాలు చేసినా నంటారు!

అత్తగారు: బాగానే ఉన్నది! ఇదెక్కడా చూడలేదే! దేవుణ్ణి అట్లా అంటే కళ్ళుకూడా పోతవి.

భార్య: మరి ఎట్లా ఆయనతో బతికేది? వద్దన్నకొద్దీ మరింత అంటారని రెండునక్కిళ్ళూ గట్టిగా ఒత్తుకొని ఊరుకోవలె! అనేది ఒక్కమాటా? నానామాటలూ అంటారే!

అత్తగారు: ఉన్నన్నాళ్ళూ అంత గారాబంగా ఉండేవారుగా! ఇదెప్పటినుంచీ! ఈ మొగవాళ్ళ మనస్సులు క్షణానికి ఒకవిధంగా మారుతూ ఉంటవి కాబోలు!

భార్య: ఏమోనే అమ్మా, తలుచుకుంటే ఏడుపుకూడా వస్తుంది! ఈనలుసు పుట్టినప్పటి నుంచీ ఆయనకు ఒకటే విసుగు. ఎప్పుడో వచ్చి రెండు రోజు లుండి చూసి పొయ్యే వాళ్ళకు మీకేం తెలుస్తుంది? కొన్నాళ్ళకు కాకపోతే కొన్నాళ్ళకైనా మనస్సు మారక పోతుందా అని అంతా లోపల లోపలనే మింగుతున్నా. కాని ఇక దుర్భరమై పోయింది. పిల్లవాడు పుట్టినతర్వాత ఒక్కసారైనా ఎత్తుకున్న పాపాన పోయినారా! మళ్ళీ ఆమాయధారి 'వాణి'నిమాత్రము తలుచుకోని విచారపడని రోజు లేదు.

అత్తగారు: బతికి ఉన్న, నిక్షేపమంటి మగపిల్లవాడిమీద ఏమీ లేదు కాని ఎప్పుడో పోయిన పోకతల దానిమీదనా, ఆయన మోహంకారమంతానూ? సరే!

భార్య: అవునే, ఆయనకేరి ఆయనది! జ్ఞాపకం లా, దానికి చేయించిన మొలతాడు?

అత్తగారు: లేకేం? అది మరచి పోగలనూ? అదేగా 'వాణి' ప్రాణం తీసింది! అది పెట్టినప్పుడేగా ఉలిక్కి పడ్డది! నేనూ దగ్గరే ఉండి కళ్లారా చూస్తినిగా! బొమ్మల్లే ఉండేదిగా వాణి!—. అది ఇంకా చెరిపించలా?

భార్య:, అయ్యో, ఆభాగ్యం పడితే ఇంకా ఏం! నేనెన్నివిధాల ప్రయత్నం చేసినా పడనిస్తేగా! మొదట బొమ్మలో చూస్తేనే నాకేదో

భయం వేసింది. తయారై వచ్చినప్పుడు చూడగానే నాకు పామువల్లే ఉన్న దన్నాను, జ్ఞాపకం లేదుటే!

అత్తగారు: అవునే, ఒక్కొ—క్క— సొమ్ము చేయించిన వేళా విశేషమది! పాపం, చాలా ఖర్చుపడి చేయించినట్లున్నారు. ఐతేమాత్రమేం? ఘటాలు బా గుంటే డబ్బు శాశ్వతమా?

భార్య: అది ఇంట్లో ఉంటేనే అంత అనుమానంగా ఉంటుందా! అది వాడికి పెట్టనిచ్చేదాకా నన్ను బతకనియ్య లేదే. ఆ గజ్జెలు ఘల్లు మంటే ‘వాణి’ నవ్వినట్లుంటుం దట.

అత్తగారు: ఇంకా అది పిల్లవాడి ఒంటనే ఉందా? ఎప్పుడో పోయిన ఆడముండకోసము ఇంత వెర్రి ఎక్కడా వినలేదే!

భార్య: అంతా వినవేం మరి? ఆ గజ్జల మొలతాడు కడితేతప్ప పిల్ల వాణ్ణి తాక నన్నారు. నాకు చెప్పడానికికూడా ఆ కవిత్వాలు రావు. ఎప్పుడూ వద్దంటే వద్దని రాత్రీపగలె అడ్డు పడేదాన్ని! ఆ వేళటికి ఏమి దుర్బుద్ధి పుట్టిందో నేనూ మెత్తబడ్డాను. పాడు వేళకి అట్లా దైవము బుద్ధి పుట్టిస్తూ ఉంటాడు కాబోలు! ఆంజనేయుస్వామి మీదనే భార మంతా వేసి, సరే, మొల్లో కట్టమన్నాను. నే నామాట అనేదే వ్యవధానంగా చివాలున కుర్చీలోనుంచి లేచి సంతోషంతో చంకలు కొట్టుకుంటూ వారే పోయి వాడి మొలన అది కట్టినారే!— ఇంకా ఏ ముంది! పిల్లవాడు కెవ్వున కేక వేసినాడు. ఆయనకూడా మొదట తెల్లబోయినారు. నాకో, ఒళ్ళు గలదరించింది. ఇప్పు డన్నా తీసి పారేయండి అన్నాను. కాని నామాట వింటేగా! మళ్ళీ ఆ ‘వాణి’కి వచ్చినట్లే వీడికీ తెరలు! నిన్న మధ్యాహ్నా మీపాటికి చిలకల్లే పిల్లవాడు ఆడుకుంటున్నాడే! పిల్లవాడి మొలను ఆ మొలతాడు చూస్తే నాగుబాము పెనవేసుకొని ఉన్నట్టే నా కళ్ళకు కనబడుతుందే! ఏమీ చేయడానికి తోచదు. నువ్వు వస్తే చెప్పుకొని బావురు మని ఏడుద్దా మనుకున్నాను మళ్ళీవారు వైద్యంలో ఏమైనా

లోపం చేస్తున్నారా! ఎన్ని మందులైనా యిప్పిస్తున్నారు. వారికీ రాత్రంతా నిద్ర లేదు. కాని అది రోగమైతేగా! [కన్నీళ్ళు ఏకధారగా విడుస్తుంది.]

అత్తగారు: [ఉద్రేకములో] ఐతే ఇంకా అది పిల్లవాడి మొలనే ఉన్నదా ఏమిటి?

భార్య: తియ్యనిస్తే నేనా? మీ రన్నా చెపితే కాస్త వింటా రేమో నని, నాకు సహాయం కావలెనని దేవంక పెట్టి ఇవ్వాళ పొద్దున్నే మీకు ఉత్తరం వ్రాయించినాను.

అత్తగారు: [మరింత ఉద్రేకంతో] ముందు పిల్లవాడు ఎక్కడ ఉన్నాడో చెప్పు! అది తీసి పారేద్దాం! అగదిలో నేగా! [పక్కనున్న గది వైపుకు వెళ్ళబోతుంది.]

భార్య: [తల్లిని ఆపి] అయ్యో, కాస్త ఆగు! అది తీసివేస్తే నీకూ నాకూ గూడా ఈ ఇంట్లో నిలవ అధరువు ఉండదు!

అత్తగారు: తిడతా రనీ చీవాట్లు పెడతా రనీ పిల్లవాడికి అంత రోగము వస్తేగూడా చూస్తూ ఊరుకుంటారటే! అట్లా చూస్తావేం? పద, అది తీసి పారేద్దాం. అంతగా మీ ఆయన చీవాట్లు పెడితే అన్నీ నే భరిస్తాలే!

భార్య: అబ్బా, నీ కేం, చెపుతావు! తర్వాత అనుభవించేదాన్ని నేను! నాన్నచేత చెప్పించి చూద్దాం! పిలుస్తా నుండు! నాన్నా!

మామగారు: [భర్త చదువుకునే గదిలోంచి వచ్చి] మీసంభాషణ వింటూనే ఉన్నాము. ఏమయ్యా అని అడిగితే "మీఇష్టం" అని విసుక్కుంటూ బైటికి వెళ్ళిపోయినాడు.

భార్య: మా నాయనగా! [అంటూ ఒక్కగంతులో కన్నుళ్ళలో పిల్లవాడున్న పక్కగదిలోకి వెళ్ళుతుంది. అత్తగారు కూడా మూతి విరుస్తూ గదిలోకి కూతురువెంట వెళ్ళబోతూ ఉంటుంది.]

[గదిలోనుంచి, భార్య స్వరము]

అయ్యో, అట్లా రైలులో వచ్చిన పాడుగుడ్డలతో రానాకే! కాళ్ళునా

కదుర్కొని గదిలోకి రా! [అత్తగారు కాళ్ళు కడుక్కొని గదిలోకి వెళ్ళుతుంది, మామగారుకూడా నెమ్మదిగా వెళ్ళుతాడు. గదిలోనుంచి గజ్జల మొలతాడు విప్పి అవతల పారవేసిన ధ్వనివినవస్తుంది. తర్వాత ఉల్లాసవంత మైన స్వరంతో.]

"శ్రీ ఆంజనేయుం ప్రసన్నాంజనేయుం ప్రభాదివ్య కాయం...భజే వాయుపుత్రం...భజే హం పవిత్రం..."

[అని వినవస్తుంది. అది ఇద్దరు ముగ్గురి గొంతులు కలిసిన స్వరము.]

## మూడవ రంగము

[మొదటి రంగములోని గది. భర్త అప్పుడే ఇంటికి వచ్చి ఉత్తరీయము తీసి వంకెన వేయబోతున్నాడు. ముఖము కాంత భీషణముగా ఉన్నది. భార్య సంతోషముతో వాణలోనుంచి గదిలోకి వచ్చింది.]

భార్య: చూశారూ, నే నేది చెప్పినా పెడచెవిని బెట్టి వేళాకోళమూ చేస్తారు, కాని ఏమయిందో చూశారా? నే నేది చెప్పినా ఎప్పుడూ వృథా కాదు.

భర్త: [నిశ్చలంగా] ఏమి టాజరిగిన బ్రహ్మకార్యం?

భార్య: [ఉత్సాహం కొంత తగ్గి] పిల్లవాడి కంత జబ్బుగా ఉండగా ఎప్పు డనగానో బయటికి వెళ్ళి మళ్ళీ ఇప్పుడు వచ్చారు! వాడికి ఎట్లా ఉన్నదో ఐనా విచారించక పోవడాని మీకు మనస్సు ఒప్పిం దండీ! పైగా నేను సంతోషంగా మాట్లాడ వస్తే మీ కంత విసుగా?

భర్త: నాకు ఊరికే కొత్తప్రేమలు నేర్పి విసిగించక ఏమి జరిగిందో చెప్పి అవతలికి వెళ్ళు!

భార్య: ఆముదరష్టపు మొలతాడు తీసే వేయగానే పిల్లవాడికి రోగ

మంతా చేతితో తీసివేసి నట్లుగా నయమయింది. తెరలు ఆగిపోయినవి. మాతండ్రి ముఖాన ఎప్పటిమల్లే చిరునవ్వు తాండవ మాడుతున్నది.

భర్త: సంతోషమే!

భార్య: ఇప్పుడు పిల్లవాడు మబ్బు విరిసిన చంద్రుడువల్లే ఉన్నాడు. అప్పుడే విచ్చిన మల్లెపువ్వు వలె ముద్దు వస్తున్నాడు.

భర్త: నా కెప్పుడూ కవిత్వాలు అనేదానివి నీవే కవిత్వం మాట్లాడు తున్నావే!

భార్య: ఏమో, కాబోలు. ముందు వచ్చి పిల్లవాడెట్లా ఆడు కొంటు న్నాడో చూసి పోండి!

భర్త: వస్తా లేంపద!

భార్య: మీ కింత శాంత మండీ? రాత్రీ పొద్దునా మీకు పడ్డ అదుర్దా అంతా ఇప్పుడే మైపోయిందీ? నన్ను కటికి దానివి అంటారే! పిల్లవానికి రోగం నయం కావడం మీ కిష్టం లేదా ఏమిటి?

భర్త: ఏమిటే నీ గొడవ! నామీద దేవత లంతా కట్టు కట్టినారు! వాళ్ళను నేను వదిలినా వాళ్ళు నన్ను వదిలేట్లు లేరు!

భార్య: [కొంచెము భయముతో] అట్లా అసందర్భంగా మాట్లాడుతా రేం? మతి ఏమన్నా చెడి పోయిందా ఏమిటి? అట్లా చూస్తా రేమండీ!— ఏమిటండీ అది; నాకు భయం వేస్తున్నది! మాట్లాడ రేం?

భర్త: అబ్బా, ఊరికే గోల పెట్టక అవతలికి వెళ్ళు! దేవత లంతా దయ్యాలలో కూడా కలిసి నామీద కత్తి కట్టినట్లున్నారు!

భార్య. [భయము పోయినప్పటికీ ఇంకా పోని ఆశ్చర్యముతో] ఏమిటీ ఆమాటలు! మన పిల్లవాడికి జబ్బు నయం చేయడమా, దేవతలు చేసిన అపకారము! అల్లాంటి అనరాని మాట లనడానికి మీకు బుద్ధి ఎట్లా పుడు తుందండీ?

6

భర్త: నీ వొక పెద్ద రాక్షసివి! నాపాలిటి బ్రహ్మరాక్షసివి! నా బాధ నీ కేం తెలుస్తుంది?

భార్య: న న్నెన్ని తిట్టినా పడతాను గాని! — లేకపోతే ఏమిటో చెప్పండి! దేవతలకు మనమీద కసి టండీ? వాళ్ళను నమ్మిన వాళ్ళను ఎన్నటికీ చెరపరు. ఈమాట మీరు బ్రహ్మ వాక్యంగా నమ్మండి! వాళ్లు మన పిల్లవాడి జబ్బు నయం చేస్తే కక్ష కట్టి నా రంటా రేమండీ?

భర్త: నీవు నామాటలు అర్థం చేసుకో గలదాన వైతే ఇట్లా మాట్లాడి నామనస్సును మరింత ఎందుకు నొప్పిస్తావు!

భార్య: పిచ్చిదాన్ని ఏదో నోరూరుకోక వాగుతుంటాను కానండీ! నా మాటలు మనస్సుకు పట్టించుకోకండి. ఐనా ఒకటిమాత్ర మడుగుతాను గాని మీకు కోపం రాకుండా ఉంటుందీ? ఈ ఒక్క సారీ కొంత శాంతిచిం జవాబు చెప్పండి. మీ రంతా తెలిసినవారు కదా! అంతా చదువుకున్న వారే కానీ, నేను పట్టి తెలివి తక్కువ మొద్దు నే కాని, నాకు తోచినంత వరకు ఆలోచిస్తే మనుష్య మాత్రుల మైన మనకు దేవుళ్ళమీద కోపము వనికి రా దనీ, వాళ్ళను తిట్టడమూ హేళన చేయడమూ మనకు శ్రేయస్కరము కా దనీ, అనిపిస్తుం దండీ!

భర్త: అయిందా నీ ప్రశ్న?

భార్య: అది కాదు, మీరు కోపపడనంటే అడుగుతాను.

భర్త: తెలివి తక్కువగా మ్లుండుగా వాగ్దత్తం చేసేందుకు నేను హరిశ్చంద్రుణ్ణి గాను.

భార్య: అడుగో! ఆమాట లెందు కండీ మీకు? ఈ చిన్న ప్రశ్నకు మీకు కోపం రాదు గదా?

భర్త: అయితే రాదులే, అడుగు!

భార్య: 'వాణి'ని చూస్తే అంత ప్రాణంగా ఉండేవాళ్లే, విశ్వాసమల్లే

మగపిల్లవాడు పుడితే ఇంత నిర్లక్ష్యం చేస్తారేం? దీనికి కాస్త శాంతించి జవాబు చెప్పండి.

భర్త: దీనికి జవాబు చెప్ప నుంటవా? ముందు నే నడిగే కొన్ని ప్రశ్న లకు కూడా శాంతంగా జవాబు చెప్పు!

భార్య: నే నెప్పుడూ శాంతంగానే ఉంటాను. మీ రెన్ని ప్రశ్న లైనా అడగండి, జవాబు చెప్పుతాను.

భర్త: ఐతే 'వాణి' ఎవరి పిల్ల? [భార్య నివ్వెర పోతుంది.] ఆరంభం లోనే అట్లా జంకితే ఎట్లా?

భార్య: ఏమి టామెయిండి ప్రశ్న! దానికి పునరూఋణం లేదు. పోయిన దని అనుకొని ఏం లాభము!

భర్త: అయ్యో! నే నడిగిన ప్రశ్నకు జవాబు చెప్పవేం?

భార్య: [మళ్ళీ నివ్వెరపోయి] మన పిల్ల!

భర్త: అందువల్లనే నాకు దానిమీద అంత ప్రేమ! ఇప్పుడు తెలిసిందా? అందు వల్లనే అది మనను విడిచిపోయినా దాన్ని నేను మరవ లేకుండా ఉన్నాను.

భార్య: [ఎర్రబడ్డ ముఖంతో] అయితే మన పిల్లవాడు?

భర్త: ఆ ప్రశ్నే నిన్నిప్పుడు అడగబోతున్నాను. దానికి నువ్వే జవాబు చెప్పవలెను.

భార్య: వీడూ అంతే!

భర్త: అదే కాదు! అందు వల్లనే వీ డంటే నాకు ప్రేమ లేదు. వీడి పే రేమిటి?

భార్య: ఏమి టండీ, వేషంగా ఉన్నదే! మనవాడి పేరు 'ఆంజనేయులు' అనే సంగతే మీకు తెలియదా ఏమి? మరీ సోద్యంగా ఉన్నదే!

భర్త: ఊరికే ఉపన్యాసా లియ్యక, నీ ప్రశ్నకు జవాబు కావలె నంటే, నే నడిగే ప్రశ్నలకు జవాబు చెప్పు! పిల్లవాడికి ఆ పేరు ఎవరు పెట్టినారు?

భార్య: ఎవరు పెట్టే దేమున్నది? వెనకటి సారి అట్లా అయింది కదా అని అనుమానం చేత మనస్సు ఒప్పక భారసాల చేసుకోక పోతే మాత్రము, వాడికి పేరు లేదా ఏమిటి? వాడు కడుపున పడ్డప్పుడే నా ప్రసన్నాంజనేయ స్వామి తన పేరు పెట్టుకున్నాడు.

భర్త: అదీ! పిల్లవాడికి పేరు పెట్టేది తండ్రి! నీ ప్రసన్నాంజనేయ స్వామికుమారుడిమీద నా కెట్లా ప్రేమ ఉంటుంది? పెంపుడు కొడుకును చూసినట్లుగా చూస్తున్నాను. అదీ, బలవంతాన చేసుకున్న పెంపుడు!

భార్య: పెంపుడు కొడు కేమి టండీ? మీ మాటలు నా కేమీ అర్థం కావడం లేదు!

భర్త: అర్థం చేసుకోలే వని మొదటనే చెప్పినాను కాదూ!

భార్య: నే నెంత తెలివి తక్కువ మొద్దు నైతే మాత్రము, నాకు కన్న కొడు కంటే ఎవరో, పెంపుడు కొడు కంటే ఎవరో తెలియదు టండీ? మీ వేదాంతాలన్నీ కట్టి పెట్టి, పిల్లవాడు కులాసాగా ఆడు కుంటున్నాడు కాని, వచ్చి చూసి ముద్దు పెట్టుకు పోండి!

భర్త: వస్తా గాని, పద! ముందు ఆ మొలతాడు మాత్రము నా కిచ్చి పో!

భార్య: ఏమిటీ, మీకు మొలతాడుపిచ్చి ఎత్తిన ట్లున్న దే!

భర్త: అధిక ప్రసంగము చేయక ముందర ఆ మొలతాడు ఇలా ఇచ్చి పో!

భార్య: ఇంకా ఏం మొలతాడు?

భర్త: [కొంచెము ఆదుర్దాతో] ఏమయింది? ముందది తీసుకు రా!

భార్య: ఇంకా మొలతా డెక్కడ ఉన్నదీ! అది ఉన్నన్నాళ్ళూ మీ కీ వ్యామోహం వదల దని మా నాన్న చేత దాన్ని చెరిపించడానికి పంపినాను. ఈపాటికి ఆయన తిరిగి వస్తూ ఉండాలి.

భర్త: [సంభ్రమముతో] ఏమీ! నా 'వాణి' మొలతాడు కరిగించడానికి మీనాన్నను పంపినావా?

['అమ్మాయీ!' అని వీధిలోనుంచి మామగారి గొంతు వినబడు తుంది]

భార్య: అదుగో, మానాన్న కేక వేస్తున్నాడు, వెళతా!

భర్త: [నిర్జీవుడై] అయ్యో! — మీ ప్రేమ ఏమి ప్రేమే! కత్తులు పెట్టి కోసే ప్రేమ! ఆపసిపిల్ల నిన్నేం చేసిందే? అరటి కొడవల్లే ఉండే 'వాణి' మీకేం అపకారం చేసిందే? — అయ్యో! ఇంతమందీ కలిసి నే నింట్లో లేని వేళ దాన్ని చంపివేసినారు కాదటే! రాక్షసుల కన్నా కొంత దయ ఉంటుందే; కన్న తల్లికి నీకన్నా అంతమాత్రము జాలి లేకపోయిందా? నీవసలు వ్యాఘ్రివి! —

[అంటూ చేతుల్లో ముఖము పెట్టుకొని కన్నీళ్ళు కారుస్తూ నిస్సారముగా పడక కుర్చీలో పండుకుంటాడు. భార్య నివ్వెరపోయి ఆపాదమస్తకము కంపిస్తూ ఉండగా, వీధిలోనుంచి "అమ్మాయీ, అమ్మాయీ, తలుపు తీయి!" అనే పిలుపులు నిరంతరంగా వస్తున్నా, నెమ్మదిగా అడుగులు పెట్టుకుంటూ తండ్రికి తలుపు తియ్యడానికి వెళ్ళుతుంది.]

౧౯౨౪



# పరివర్తనము

## శ్రీ శ్రీనివాస శిరోమణి

*

అంకితము

శ్రీ వఝ్ఝ బాబు రావుకు

*

## ఒకటో రంగము

[సూర్యాస్తమయము కాబోతున్నది. అంతఃపురములో అలంకార మంది రములో నిలువుటద్దాల యెదట అశోక చక్రవర్తి నిలుచుని ఉన్నాడు. నల్లటివాడు. ఉంగరాలు తిరిగిన బిరుసు వెంట్రుకలు, మిడిగుడ్లు. అక్షిళ్ళలో ఎర్రనిచారలుకూడా ఉన్నవి. గుబురుమీసాలు. పొట్టివాడు.

అర్ధనగ్నలు అయిన ముగ్గురు పరిచారికలు. ఒకతె చైనాదేశపుది - ఆమె వింజామర వీస్తున్నది. ఇంకొక పరిచారిక చందనచర్చ చేస్తున్నది. మరొకతె తిలకము ముఖాన దిద్ది పుష్పమాల మెడలో వేసి అందముగా ఉండేటట్టు సవిరిస్తున్నది.

అలంకార మంతా అయిపోతున్న సమయములో ఒకపరిచారిక సవిన యముగా ప్రవేశించి మొక్కి నిలుచున్నది. ఆమెవంక చక్రవర్తి సాలో చనముగా చూచినాడు.]

పరిచారిక: రాధాగుప్తులవారు వచ్చి ఉన్నారు.

అశోకుడు: వెంటనే లోపలికి పంపించు.

[వింజామర వీస్తున్న పరిచారిక తప్ప అందరూ వెళ్ళిపోయినారు. అశోకుడు సుఖాసనాసీను డయినాడు. రాధాగుప్తుడు ప్రవేశించినాడు.

వృద్ధముఖములో గాంభీర్యము ఉట్టిపడు తున్నది. ప్రశాంత మయిన నేత్రములు. దీర్ఘకాయుడు.]

అశోకుడు: [లేచి నమస్కారము చేసి రాధాగుప్తుడు కూర్చున్న తరువాత కూర్చుని] ఏదో విశేష మున్న దనుకొంటాను. లేకపోతే మీరిప్పుడెందుకు వస్తారు?

రాధాగుప్తుడు: అవును. ఇది సమయము కాదని తెలుసును. అయినా, రాక తప్పింది కాదు.

అశోకుడు: [వ్యగ్రభావముతో] చిత్తము. అప్పుడే చీకటి పడిపోయింది. మిమ్ములను విశేషము సేపు కూర్చుండ బెట్టను.

రాధాగుప్తుడు: మీ రేదో పనిమీద ఎక్కడికో వెళ్ళబోతున్నా రనుకొంటాను.

అశోకుడు: అవును. మాళవ రాజకన్యను చూసి ఇప్పటికి సంవత్సరమయి పోయినది. ఆమె నావిరహమును భరించ లేక కృశించిపోయి ఉన్నదట. విరక్తివల్ల ఒక్క ఆభరణ మయినా ధరించడము లేదట.

రాధాగుప్తుడు: [సాలోచనముగానూ, సాభిప్రాయముగానూ,] అది మీవిరహదుఃఖమో - కాక పితృసోదర వియోగదుఃఖమో - యోజించినారా రాజా!

అశోకుడు: తలిదండ్రులను గురించిన దుఃఖమయితే ఒకనెల, కాకపోతే రెండు నెలలు. కాని ఇంత కాలము దుఃఖించదు. అది కేవలము విరహమే. ఇప్పుడు ఉన్మాదినిగా ఉందని తెలుస్తున్నది. ఆమె విరహములో అంత్యావస్థకు తయారవుతున్నది. ఎందువల్ల నంటే, నేను రాజధానిలోకి వచ్చికూడా ఆమెను చూడలేదు.

రాధాగుప్తుడు: అయితే మీకిప్పుడు శకునము ఏమీ బాగా లేదు. శుభము అంటూ బయలుదేరబోతూ ఉంటే ఒంటిబ్రాహ్మణుడను ఎదురుగుండా వచ్చాను.

అశోకుడు: ఇంకా బయలుదేర లేదుగా నేను!

రాధాగుప్తుడు: మీరు బయలుదేరి నట్టే లెక్క.

అశోకుడు: అయితే మీరు వచ్చినపని ఏదో సెలవిస్తారా?

రాధాగుప్తుడు: చిత్తము. బ్రహ్మానందము కలిగించే వర్తమానము చెప్పడానికే వచ్చాను. ఉపగుప్తాచార్యులను ఎరుగుదురు కదా!

అశోకుడు: ఉపగుప్తుడా! బౌద్ధభిక్షువు కాదూ?

రాధాగుప్తుడు: అవును. మీ అన్నగారు సుషీముడి పక్షమువాడు. వాణ్ణి ఈమధ్యాహ్నమే పాతాళగృహములో ప్రవేశపెట్టినాము.

అశోకుడు: [విషాదముతో కూడుకొన్న ఆశ్చర్యముతో] చంపివేసినారా?

రాధాగుప్తుడు: ఈపాటికి యమధామానికి చేరి ఉండే వాడే. అయితే మీతో కొంచెము సేపు మాట్లాడిన తరువాత తన్ను చంపమని ప్రార్థించినందున—

అశోకుడు: నాతో ఏమి మాట్లాడుతాడో?

రాధాగుప్తుడు: మిమ్ములను తూలనాడుతాడు.

అశోకుడు: [కోపముతోనూ ఆశ్చర్యముతోనూ] ఆ! తూలనాడుతాడా! అయితే నేనే వాణ్ణి యమరాజ్య పట్టాభిషిక్తుణ్ణి చేస్తాను!

రాధాగుప్తుడు: అయితే వాణ్ణి ప్రవేశపెడతాను.

అశోకుడు: వాణ్ణి తీసుకొని రావడానికి ఎంతసేపు పడుతుంది?

రాధాగుప్తుడు: వెంట తీసుకొని వచ్చినాను. వాణ్ణి ప్రవేశపెట్టి వెళ్ళిపోతాను.

అశోకుడు: [ఏదో ఆలోచిస్తూ] చిత్తము.

[రాధాగుప్తుడు వెళ్ళిపోతాడు. ఉపగుప్తాచార్యులు ప్రవేశిస్తాడు. దీర్ఘకాయుడు, ప్రశాంత నేత్రములు, గంభీర మయిన వదనము. కాషాయాంబరధారి. నిశ్చలముగా తల వాల్చి నిలుచుంటాడు. అతన్ని చూస్తూనే

అశోకుడి ఒళ్లు కంపించిపోతుంది. మహాకోపం వస్తుంది. భస్మీభూత మయి పోయ్యేటంత కోపముతో ఆతని వంక అశోకుడు చూస్తాడు. అతనినిశ్చలతకు ఆశ్చర్యముకూడా కలుగుతుంది.]

అశోకుడు: ద్రోహీ, ఎంత నిశ్చలముగా ఉన్నావు! నీది ఏదేశము?

ఉపగుప్తాచార్యులు: నేను ద్రోహిని కాను. ఈభూమి అంతా నా దేశం.

అశోకుడు: ఆఁ ఆఁ!

ఉపగుప్తాచార్యులు: నీదేశానికి పరిమితి ఉంది; హద్దు లున్నవి; నాదేశానికి పరిమితి లేదు; నాల్గుదిక్కులూ నాదేశానికి హద్దులు-

అశోకుడు: నీకు మతి పోయిన ట్లుంది!

ఉపగుప్తాచార్యులు: [నవ్వుతూ] కాస్త కొన్ని మంటిముద్దల కోసము పోట్లాడుకొనే నీబోటిరాజులకు మతిపోయింది. నా కేమీ మతి పోలేదు. ఈ విషయము హెచ్చరించి పోవడానికే నీదర్శనము కోసరము ప్రార్థించాను.

అశోకుడు: ఏమిటది?

ఉపగుప్తాచార్యులు: దేశదేశాలను జయించడ మెందుకు రాజా?

అశోకుడు: ఏ మంటున్నావూ?

ఉపగుప్తాచార్యులు: ఏ మంటున్నానా? దేశదేశాలమీదికి దండెత్తి పోయి రాజ్యాలనూ, జనాన్నీ నాశము చేస్తున్నావే! ఎక్కడయినా కాస్త జనముఉంటే వారిహృదయాలలో చిచ్చు పెడుతున్నావే! ఇదంతా ఎందుకోయి? సరే, పోనీ, రాజులూ జనుల సంగతి అలా ఉండు. నీజోలికి జోక్యానికి రాని వన్యమృగాలను వేటాడి చంపడ మెందుకు! అవి ఘాతుక మృగము లంటావు! అయితే నీకు పాలిస్తూ పొడవడ మయినా తెలియని గోవులు- శరత్కాల స్వాదునదీ జలము తాగనీకుండా రక్తాన్ని ప్రవహింపజేస్తున్నావే! అంతా నిశ్శేష మయిపోయిన తరువాత ఎక్కడ ఎవరిని పరిపాలించ దలచుకొన్నావు రాజా? చెప్పు చూతాము. కళింగదేశ

ములో పురుషుడనేవాడు లేకుండా చేశావే! ఇక నీవు పాలించేది ఆ దేశములో ఉన్న వితంతువులనా?

అశోకుడు: అనవసర ప్రసంగం చేయకు.

ఉపగుప్తాచార్యులు: సుఖదుఃఖాలూ, ఆదరానాదరాలూ, ప్రేమాప్రేమలు, ఆలోచనానాలోచనలు లేని నేను విశేషము మాట్లాడేట్లయితే నీలాగానే మారిపోతాను. విశేషము నీతో నేను మాట్లాడ దలచుకొన లేదు.

అశోకుడు: అయితే ఎందుకు వచ్చావు ఇక్కడికి?

ఉపగుప్తాచార్యులు: నీ ప్రతిబింబాన్ని నీకు చూపించి పోవడానికి వచ్చాను.

అశోకుడు: [విసుగుతో] ఏమిటా ప్రతిబింబము?

ఉపగుప్తాచార్యులు: మనుష్యాకారములో ఉన్న జంతువేమో అనిపిస్తున్నావు నీవు! లోకసంహారము చేస్తున్నావు. నీపనులు లోకకంటకములుగా ఉన్నవి. నీకు సుఖము ఇందులో ఉన్నదా అని ప్రశ్న. లేదేమో నని తోస్తున్నది. ఎందువల్లనంటే, దేశదేశాంగనలను తీసుకొని వస్తున్నావు. విశ్రాంతి కొంచెము చిక్కినప్పుడల్లా సారాసారములు విచారించకుండా కేవలము మాంసగ్రంథు లయిన స్తనాల కోసము- శ్లేష్మాగార మయిన వదనము కోసరము మూత్రము స్రవించే జఘనపీఠము కోసరము [కళ్లు మూసుకొని] అహా, నింద్యం నింద్యమ్ [కొంచెము సేపు ఊరుకొని] సబ్బం దుఃఖం సబ్బం దుఃఖమ్. [కళ్ళు తెరిచి] నేను చెప్పదలచుకొన్న దంతా చెప్పివాను. ఇంక నన్ను చంపివేయడానికి అనుజ్ఞ ఇయ్యి.

అశోకుడు: నిన్ను చంపకుండా వదిలివేస్తే సంతోషిస్తావా?

ఉపగుప్తాచార్యులు: నాకు సంతోషమూ లేదు, దుఃఖమూ లేదు.

అశోకుడు: అయితే మాకెందుకు నీవంత అపకారము చేయడము?

ఉపగుప్తాచార్యులు: నే నొకరికి అపకారము చేయను. నీకు చేయనూ లేదు.

అశోకుడు: చేయలేదా?

ఉపగుప్తాచార్యులు: లేదు.

అశోకుడు: నీవు నాశత్రువులతో ఎందుకు చేరినావు?

ఉపగుప్తాచార్యులు: నీశత్రువులతో గానీ నీ మిత్రులతో గానీ నాకు ప్రసక్తి లేదు.

అశోకుడు: నీవు మాఅన్న సుషీముడితో చేరి నన్ను చంపదలచిన వారిలో ఒకడవు కావా?

ఉపగుప్తాచార్యులు: నీకు రాజ్యాధికారము లేదన్నాను. అది ధర్మము. కాని నిన్ను చంపదలచినవారిని వద్దని వారించినది నేనే.

అశోకుడు: [వినయముతో] మీ మాటలు నేను విశ్వసిస్తున్నాను.

ఉపగుప్తాచార్యులు: నీవిశ్వాసా విశ్వాసములతో నాకు నిమిత్తములేదు.

[పరిచారిక ప్రవేశించి నమస్కారముచేసి నిలుచుంటుంది].

అశోకుడు: [రూక్షముగా] ఏమిటి?

పరిచారిక: మాళవరాకుమారి దేవర దర్శనార్థము క్షణ మొకయుగముగా గడుపుతున్నట్లు వర్తమానము వచ్చింది.

అశోకుడు: [మహానందముతో] ఆఁ ఆఁ సంతోషము! ఓసీ, ఈహారము నీకు బహుమానము. [అమూల్యాభరణము తీసి యిస్తాడు.] పో. భిక్షుకుడా, మా కత్యంత మోదావహ మయిన సమయములో వచ్చావు. చాలా అదృష్ట వంతుడవు. నిన్ను చంపము. పో మా మ్రోవలకు!

## రెండో రంగము

[పాటలీపుత్రనగరము వెలుపలి మైదానము. రాత్రి పదిన్నర గంటలు కావచ్చింది. గాఢాంధకారము. అశోక చక్రవర్తి పుష్పమాలాలంకృతుడయి ఉత్తరీయము జారి పోతూ వేగముగా నడుస్తూ ప్రవేశిస్తాడు. ఎదుట

గుండా ఒక వృద్ధుడు ముసుగు పెట్టుకొని వస్తూ ఉంటాడు. అశోకుడా వ్యక్తిని చూసి ఆగిపోతాడు.]

అశోకుడు: ఎవరా మనిషి?

రాధాగుప్తుడు: నేను [అంటూ ముసుగు తీసి నిలుచుంటాడు.]

అశోకుడు: మంత్రివరేణ్యులా! అభివాదము. ఒంటరిగా ఎక్కడికి వెళు తున్నారో తెలుసుకో వచ్చునా?

రాధాగుప్తుడు: దేవరవా రెక్కడికి ఒంటరిగా వెళుతున్నారో నేను తెలుసుకోవచ్చునా?

అశోకుడు: నేను బాహ్యోద్యానాంతఃపురానికి వెళుతున్నాను. సంవత్స రమునుంచీ ఏకాంతా స్వయంగ్రహము కోసరము సంతపిస్తున్నానో ఆకాంత సందేశ మంపింది.

రాధాగుప్తుడు: ఏ మని?

అశోకుడు: అస్మద్గాఢ పరిష్వంగము కోసరము క్షణ మొక యుగముగా గడుపుతున్నట్టు.

రాధాగుప్తుడు: ఇవ్వాళ అమావాస్య.

అశోకుడు: అయితే కావచ్చును.

రాధాగుప్తుడు: [గట్టిగా] ఇవ్వాళ అమావాస్య.

అశోకుడు: [చిరునవ్వుతో] మన్మథుడికి వారాలు వర్జాలూ లేవు. పో నియ్యండి.

రాధాగుప్తుడు: కాదు. రాజా, ఒక్కసారి నిలవండి.

అశోకుడు: ఏందుకు?

రాధాగుప్తుడు: మీ నియమాలను మీరే తిరస్కరిస్తే ఇక మీ నియమా లను ఇతరులు ఎలా అనుసరిస్తారు?

అశోకుడు: అసలు విషయ మేమిటో చప్పున చెప్పండి. హృదయము దహించుకొని పోతున్నది. ఇంక నేను నిలవ లేను.

రాధాగుప్తుడు: తాము మారువేషముతో రాత్రిసమయములో నగరపర్యటనం చేసేది ఈ రోజునే.

అశోకుడు: అబ్బ, శుభమా అని వెళ్ళబోతుంటే అన్నీ అంతరాయాలే!

రాధాగుప్తుడు: సంకల్పాలకు వికల్పాలు లేకపోతే స్వారస్యముండదు.

అశోకుడు: పోనీ, ఈరాత్రికి మానివేసి రేపురాత్రి నగరసంచారము చేస్తాను లెండి.

రాధాగుప్తుడు: జ్ఞాపకము తెచ్చుకోండి. రేపురాత్రి తమరు మరొక విషయములో నిమగ్నులయి ఉంటారు.

అశోకుడు: అబ్బ, అబ్బ!— నేను మీతో ఈ విషయమే చెప్పకపోతే!

రాధాగుప్తుడు: మీ రెక్కడికి వెళ్ళుతున్నదీ నాకు తెలియక పోతేగా! అందుకోసరమనే వెతుక్కుంటూ వచ్చాను

అశోకుడు: మరి ఆ యువతీ దర్శనము చేయకుండా నేను జీవించజాలను. పోనీయండి, నా సంగతి అలా ఉంచండి. ఆయువతి మాత్రము ఇక జీవించడము దుర్ఘటము!

రాధాగుప్తుడు: రాజా, పోనీయండి బతకకపోతే మరొకతే —

అశోకుడు: పెద్దలు- మీ నోటిలోనుంచి అశ్లీలములు రానీయకండి. అమ్మయ్యా! అంతమాట ఎలా అనగలిగినారు? ఆమెను ఒక సంవత్సరము నుంచీ పరివాసములో ఉంచినాను.

రాధాగుప్తుడు: సంవత్సరమునుంచీ బతికి ఉన్నమనిషి ఇప్పుడు ఈ మాత్రానికే చచ్చిపోతే ఏం చేస్తాము!

అశోకుడు: ఎందుకిదంతా — అలాగే నగరపర్యటనను చేస్తానులెండి.

రాధాగుప్తుడు: మీరు అనృతము లాడరనుకొంటాను.

అశోకుడు: ఈ రాత్రికి క్షమించలేరా!

రాధాగుప్తుడు: మీ రా యువతి దగ్గరకు వెళ్ళకపోతే, ఏం?

అశోకుడు: అమ్మమ్మ! కాదు! ఆసౌందర్య—

రాధాగుప్తుడు: తిష్య రక్షాదేవి కన్ననా?

అశోకుడు: [చిరునవ్వుతో] చెప్పలేం మరి! తిష్యరక్ష మీ అంత వారిని ఇలాంటి పనులమీద పంపిస్తున్నదా?

రాధాగుప్తుడు: ఎంతమాత్రము కాదు. మీరా యువతిని విసర్జించమని ప్రార్థన.

అశోకుడు: ఎందువల్ల?

రాధాగుప్తుడు: ఇందువల్ల అని మాత్రము చెప్పజాలను. తరువాత మీరు జన్మాంతమువరకూ దుఃఖిస్తారని నా నమ్మకము.

అశోకుడు: ఏమి, ఆ యువతిని చూచిన మాత్రము చేతనే?

రాధాగుప్తుడు: ఏమో, నాకదంతా తెలియదు. మీరు మాత్రము వెళ్ళవద్దని నా సలహా.

అశోకుడు: ఆ రాకుమారి తండ్రినీ సోదరుణ్ణీ చంపించాననీ, అందువల్ల నన్ను వరించదేమోననీ మీరు ఊహ చేసి సలహా ఇస్తున్నారు. కాని ఆ దుఃఖము ఆమెకు ఎంతమాత్రము లేదు. నాకు తెలిసింది. నాకోసరము ఈ మధ్య కేవలము ఆమె ఉన్మాదిని అయిపోయింది. కాముకులకు తెలిసే విషయాలు మంత్రులకు తెలియడము కష్ట మనుకొంటాను.

రాధాగుప్తుడు: సరే, నాకీ విషయాలతో పని లేదు. మీరీరాత్రి నగర పర్యటనము చేయడమే నాకు కావలసిన విషయము.

అశోకుడు: మళ్ళీ మొదటికి వచ్చారా?

రాధాగుప్తుడు: ఎంతదూరము చెప్పినా మీరు గ్రహించలేకుండా ఉన్నారు. మీరు అక్కడికి వెళ్ళినట్టయితే, మీదట దుఃఖిస్తారు.

అశోకుడు: దుఃఖించను, సుఖిస్తాను.

రాధాగుప్తుడు: [గద్గద స్వరముతో] మీరు దుఃఖిస్తారు!

అశోకుడు: మీకు తెలియదు లెండి.

రాధాగుప్తుడు: కాదు. నేను అనుభవజ్ఞుణ్ణి. చెప్పుతున్నాను. వినండి. మీరు నగరపర్యటనమునకు పోకండి.

[అశోకుడు తల వంచి ఆలోచిస్తూ ఉంటాడు. రాధాగుప్తుడు వెంటనే వెళ్ళిపోతాడు. అతడు తల ఎత్తి చూసేసరికి రాధాగుప్తుడు కనిపించడు. ఒక ముసలిది మూలుగుతూ కర్ర ఊతగా చేసుకొని నడుస్తూ ఏడుస్తూ కనిపిస్తుంది.]

ముసలిది: ఎవరు నాయనా, నీవు దొంగలాగా ఉన్నావు?

అశోకుడు: ఏమంటున్నావు! అశోకచక్రవర్తి రాష్ట్రములో దొంగలా?

ముసలిది: అశోకుడే పెద్దదొంగ అయితే, ఇక రాజ్యములో దొంగలకేమి తక్కువ!

అశోకుడు: [ఆశ్చర్యముతో] అశోకుడు దొంగా అవ్వా?

ముసలిది: అశోకుడు చేసే పనులు మామూలు మనుష్యులు చేస్తే బందిపోటు అంటారు. అదే అశోకుడు చేస్తూ ఉంటే, రాజాధిరాజు, చక్రవర్తి అంటారు. అట్లాంటి వాడికి చావు రాదు కదా నాయనా!

అశోకుడు: ఎందుకు పాపము, అశోకుడికి చావు? నీ కేం అపకారము చేశాడు?

ముసలిది: [కోపముతో వణుకుతూ] అపకారమా- వాడినోట్లో దుమ్ము పడ! నా కొంప కూల్చాడు, నా వంశనాశము చేశాడు. వాడు శిల, వాడు చావడు!

అశోకుడు: ఆయనకు నీ కొంప కూడా కావలసి వచ్చిందీ; నీ వేం మహారాణివా, నీ వంశము నాశము చేయడానికి?

ముసలిది: అది కాదు బాబూ! నా పెనిమిటి కిందటి సంవత్సరము మాళవదేశ యుద్ధములో చనిపోయినాడు, ఆయన వయస్సు చెల్లినవాడు, పోయినాడని ఒక్క ఏడ్పు ఏడ్చి ఊరుకొన్నాను: ఈ సంవత్సరము కళింగదేశ యుద్ధములో నా కొడుకు లిద్దరూ చనిపోయినారు.

అశోకుడు: అయితే ఆ కొడుకులకు బిడ్డలు లేరా?

ముసలిది: అయ్యో, అయ్యో, బాబు- బుల్లిబాబు! [అని చతికిలబడి ఏడుస్తుంది.]

అశోకుడు: [ఆమె పక్కనే నిలుచుని] ఏడవకు-ఏడవకు.

ముసలిది: [ఏడుస్తూ] అయ్యో బాబయ్యా, నాగొంతు ఎందుకుపోతున్నది. నేనుకూడా చచ్చిపోగూడదూ! ఈకూన అయినా—

అశోకుడు: ఈకూన ఎవరు?

ముసలిది: నా మనమడు: కొడుకులు పోయినా ఈ పసికందు బ్రతుకగూడదూ?

అశోకుడు: ఈ పసిబిడ్డ చనిపోయినాడా?

ముసలిది: అ, ఈఉదయమే. అశోకుడు - వాడిదుంప తెగ! ఈచనిపోయిన కూనమీద కూడా వాడికి ద్వేష మెందుకో?

అశోకుడు: ఏం చేశాడు, ఏం చేశాడు?

ముసలిది: ఈఉదయము ఈపసికందును పాతిపెడదా మని వల్లకాటికిపోతే, రాజుగారికి సుంకము చెల్లించండి రాజభటులు పాతిపెట్ట నీయలేదు.

అశోకుడు: పాపము, నీదగ్గిర డబ్బు లేదు కాబోలు. రాజుగా రాసిపాయీల కుటుంబాలకు పింఛన్ ఇస్తున్నాడే!

ముసలిది: వాడి డబ్బూ వాడూ ఊడ్చుకుపోను! వాడిడబ్బు నాకక్కర లేదు. అందు కెన్నో సిఫార్సులు కావాలి. అయినా బందిపోటుదొంగ డబ్బు నాకక్కర లేదు.

అశోకుడు: మరి నీ విప్పు డెక్కడికి వెళ్లుతున్నావు?

ముసలిది: శవాన్ని ఒక్కరోజుకంటే ఇంట్లో అట్టే పెట్టుకో గూడ దని ఆ పాడుముండాకొడుకు శాసనము. ఊరిబయట ఏగోతిలోనైనా పారవేసి నేనూ ఏగోతిలోనైనా పడుదా మని బయలుదేరినాను.

అశోకుడు: అంత అవస్థపడవలసిన అవసరము లేదు. శ్మశానములో రాజభటు లంతా మావాళ్ళే. నేనుకూడా నీవెంట - కాదు కాదు, నాకు పని ఉంది. నా వేలి ఉంగరము ఇస్తాను. ఈ ఉంగరము చూపిస్తే వాళ్లు నీకు కావలసిన సహాయ మంతా చేస్తారు.

ముసలిది: నీ వెవరో ఈరాజ్యములో చాలా మంచి వాడివి లాగా ఉన్నావు. అయితే ఉంగరము వాళ్ళ కిచ్చివేసేదా?

అశోకుడు: నీ ఇష్టము—పోనీ నీవు అమ్ముకొని ఆ డబ్బు తీసుకో.

ముసలిది: నా కెందుకు నాయనా నీడబ్బు?

అశోకుడు: అయితే వాళ్ళకిచ్చి వెయ్యి.

ముసలిది: అయితే అబ్బాయీ, సరే కాని నాకు రాజదర్శనము కావలె నంటే ఏం చెయ్యాలో చెప్పగలవూ?

అశోకుడు: ఎందుకు?

ముసలిది: ఒక్క—సంగతి అడుగుదా మని- ఆసంగతి అడగగానే అక్కడి భటులు నన్ను ఎట్లాగూ చంతారు. నేను చచ్చిపోతాను. నేనుకూడా వాడి చేతులో చచ్చిపోదా మని ఉంది.

అశోకుడు: ఏమిటి అవ్వా ఆసంగతి?

ముసలిది: ఇట్లా అడుగుదా మని: "ఓరి అశోకుడా, మాకొంపలో ఒక రిద్దరు చచ్చిపోతే మే మిట్లా ఏడుస్తాము. నీ రాజ్యములో- రాజ్యమంటే కుటుంబము కాదా- నీకుటుంబములో ఇంతమంది చచ్చిపోయినా ఇంతహాయిగా నిశ్చింతగా ఎట్లా ఉంటావు? ఆసంగతి ఏమిటో నాకు కూడా కాస్త చెప్పు. అయినా ఆ కళింగ దేశములో మగ పురుగు లేకుండా చేశావుట. ఇక రాజ్యము చేసేది వెధవముండలనూ, ముసలి ముండలనా?" అని అడగగానే అక్కడ ఉండే వాళ్ళు నన్ను చావ దంతారు, సరిపోతుంది!

అశోకుడు: నేను మహారాజు గారితో చెప్పుతానులే.

ముసలిది: నీ వాయన కొలువులో ఉన్నావా ఏం? అయితే నీకు చెప్ప వలె నని మనసులో ఉన్నా, చెప్పజాలవు. ఎట్లాగైనా నాకు దర్శన మిప్పింతూ.

అశోకుడు: రాజుగారి దర్శనము కావడము దుర్ఘటము ముసలమ్మా! నేను వెళ్ళి పోవాలి. వెళ్ళనియ్యి.

ముసలిది: నాయనా, నీ వెవరో గుర్తు పట్టలేను. వెయ్యేళ్ళు వర్ధిల్లు! నీ మేలు మరిచిపోను. నీవు సిపాయివా బాబూ? మా అబ్బాయికు స్నేహితుడవా?

అశోకుడు: ఆఁ అవును లే. వెళ్ళుతున్నాను. వెళ్ళవలెను. [అంటూ అశోకుడు వేగముగా వెళ్ళిపోతాడు. ముసలమ్మకూడా వెళ్ళిపోతుంది.]

## మూడో రంగము

[తెల్లవార వస్తున్నది. అప్పుడప్పుడు పిట్టలు కిలాకిలా కూస్తున్నవి. మర్రిఊడలవల్ల పొదరిల్లుగా ఉన్న ప్రదేశములో చలవరాతి అరుగుకు ఒకపక్కన మాళవ రాకుమారి నిలుచుని ఉంది. మరొకపక్కన అశోక చక్రవర్తి నిలుచుని ఉన్నాడు.

ఆమె సన్నగా పొడుగుగా తీగెలాగ ఉంది. రామచిలుక ముక్కులాంటి ముక్కు, వాలుగన్నులు. ఆమె ఒక్క ఆభరణము నైనా ధరించలేదు. ముఖాన బొట్టు అయినా పెట్టుకో లేదు. చాలా కోపముతో ఉన్నట్టు కనబడుతున్నది.

అప్పుడప్పుడు అశోకుడివంక మిర్రిమిర్రి చూస్తూ వెంటనే తల వంచు కొంటూ ఉన్నది.]

అశోకుడు: కార్యాంతరములలో పడిపోయి ఈదాసజనుడు ఇంత కాలమువరకూ నీ దర్శనము చేయలేక పోయినాడు; అన్యథా అనుకో వద్దు [చేయి పట్టుకో బోతాడు.]

రాకుమారి: [చెయ్యి పట్టుకోకుండా తప్పించుకొని ఓరకంటితో అతి తీవ్రముగా చూసి ఊరుకొంటుంది.]

అశోకుడు: ఈ దాసాధముడిమీద ఇంతకోపము తగదు. నీవు మాట్లా డక పోయేటట్లయితే నాకు చాలా కష్టము వేస్తుంది. కోకిలలాగా ఒక్క

పలుకు పలికి నాచెవులతుప్పు పోగొట్టరాదూ! అసలే తాపముతో ప్రాణాలు పోతున్నవే- నీకృపా కటాక్షములు నామీద బరపి, నాతాపము బాపరాదా? అంత కోపమా, ఎందుకు అలా పెడతావు ముఖము? నిజముగా నేను నీకోపానికి పాత్రుణ్ణే! ఇదిగో నిజముగా నీకు కోపము వచ్చినట్టయితే ఎందుకు నీవు అబాహువల్లరులతో నన్ను బంధించి, పారవేసి, కొరికి వేయరాదు దంతాలతో?

రాకుమారి: [స్థాణువులాగా నిలుచుని తీవ్రముగా చూస్తూ ఊరుకొంటుంది]

అశోకుడు: [సమీపించి మోకాళ్ళపైన కూర్చుని దోసిలియొగ్గి] నీ ఆశ్లేషముకు నేను తగనా?

రాకుమారి: [అతివరుషముగా] నేను మీఖైదీని; నన్ను ఇన్నిరింత వేడుకో వలసిన అవసరము ఏమీ లేదే.

అశోకుడు: నాఖైదీవా? ఆః అంతమాట!- ఎంతమాత్రము కాదు. నేను నీబందీని; నీకోప పాత్రుణ్ణి.

రాకుమారి: నన్నిక్కడికి మీరు ఖైదుగానే తీసుకొని వచ్చినారు.

అశోకుడు: కాదు, ఎంతమాత్రము కాదు. నీవు నా హృదయరాజ్ఞివి, రాణులందరూ నాకు ఒకయెత్తు, నీవు ఒక్కతెవు ఒక్కయెత్తు! ఇటువంటి హృదయ విదారక వాక్యములు నేను వినలేను.

రాకుమారి: హృదయ విదారకకృత్యములు చేసేవారికి మాటలతో పని ఏ ముంది? తమ కీదౌర్భాగ్యురాలిని—.

అశోకుడు: దానుడి తప్పు దణ్ణముతో సరి అన్నారు. ఎందుకు మాట లని నా హృదయాన్ని చీల్చివేస్తావు?

రాకుమారి: నేను మిమ్ములను ఏమీ తూలనాడడము లేదు. తమంత శత్రుభీకరులు ఒక ఖైదీనీ, అందులో ఒక స్త్రీని ఇంత బలిమాలడములో అర్థము తెలియడము లేదు.

అశోకుడు: [రాకుమారి దగ్గరికి వెళ్ళి చేయి పట్టుకొని కౌగిటిలో చేర్చుకో

బోతాడు. ఆమె తప్పించుకుంటుంది. దగ్గరదగ్గరకు వెళ్ళబోతాడు. అతడు సమీపించినకొద్దీ ఆమె దూరము జరుగుతూ ఉంటుంది] నీవు అలా "ఖైది ఖైది" అంటూ ఉంటే నాకర్ణ రంధ్రములలో సీసము కరిగించి పోసినట్లుగా ఉంటుంది. నీవు నాహృదయాధిష్ఠాన దేవతవు—

రాకుమారి: ఎంత ఆశ్చర్యము- ఎంత ఆశ్చర్యము! నాతండ్రి, నా అన్న మీకు పరమశత్రువు అయిపోయినారు. మీరు వారిని చంపించినారు. నేను మాత్రము మీ కింత ఆప్తురాల నైనానా? పాము చుట్టము, కడిగి మాత్రము పగ అట. ఆహా!

అశోకుడు: నిజమే; నీ కత్యంత సంతాపము చేకూర్చిన మాట సత్యమే. అది క్షాత్రధర్మము. క్షత్రియాంగనవు, నీ విటు వంటి వాటికి ఇంత దుఃఖించకూడ దని నామనవి.

రాకుమారి: [ఆశ్చర్యముతోను కోపముతోను] తాము క్షత్రియులా, క్షత్రియులా?

అశోకుడు: నీకు తెలియదా ఆసంగతి? నేను క్షత్రియుడను కానా?

రాకుమారి: ఎంతమాత్రము క్షత్రియులు కారు. తమతల్లి బ్రాహ్మణాంగన. తండ్రిగారు మాత్రము క్షత్రియులు.

అశోకుడు: [నవ్వుతూ] అయితే నేను- ఎంత కాత్రిదానివి!

రాకుమారి: రాధాగుప్తుడు మంత్రి కాక పోయి నట్టయితే తమ రెవరో తమకే తెలిసేది.

అశోకుడు: [మందహాసముతో] రాధాగుప్తుడు ఏమి చేసినాడు?

రాకుమారి: సుక్షత్రియు డయిన తమ అన్నగారిని మోసపుచ్చి బ్రాహ్మణాభిమానము వల్ల తమకు రాజ్యము కట్టబెట్టి తమను క్షత్రియులను చేసినాడు.

అశోకుడు: మా అన్నగారి నెన్నడూ మోసము చేయలేదు. మాతండ్రే నాకు రాజ్యమిచ్చినాడు. రాధాగుప్తుడు నాకు రాజ్య మిప్పించి నా డన్న మాట అసత్యము.

రాకుమారి: ఏమో. తమవిక్రుతాకారానికి తమ తండ్రిగారెంతో అసహ్యించుకొనేవారట. ఇటువంటి తమ్ము కన్నందుకు తమతల్లి మీదకూడా రాజుగారికి కోపము వచ్చి తరువాత ఒక్కసారి అయినా చూడలేదట. తాము మరణిస్తే సంతోషింతామనే ఉద్దేశ్యముతో శత్రుసేనలపైకి తమ్ము పంపించినారట.

అశోకుడు: నాపరాక్రమము పరీక్ష చేయడానికి మాతండ్రిగారు అట్లా చేసినారు. నీకు తెలియదు. నీవు చిన్నదానివి. నాకు గిట్టనివాళ్ళెవరో నీకివన్నీ కల్పించి చెప్పినారు. అయినా నేను క్షత్రియోచిత మయిన కృత్యములను చేయడము లేదా? గుణములను బట్టే వర్ణము లేర్పడుతవి.

రాకుమారి: [నవ్వుతూ] తాము తమ ఆకారమునకు తగిన పనులు చేస్తున్నా రంటే సమంజసముగా ఉంటుంది.

అశోకుడు: అయితే నా ఆకారము క్షత్రియోచితము కాదా?

రాకుమారి: కాదు. కిరాతాకారము!

అశోకుడు: [నవ్వుతూ] నేను కిరాతుణ్ణా?

రాకుమారి: అవును. ఈ రక్తపాతములు, ఈ రాజ్యధ్వంసములు, ఈ పాళ్యములు, ఏమి టివన్నీ—

అశో: [వేగముగా చేయి పట్టుకొని కౌగిటిలోకి చేర్చుకో బోతాడు. ఆమె తప్పించుకోడానికి ప్రయత్నము చేయబోతూ చప్పున స్థాణువులాగా నిలుస్తుంది. కొంత ఆశ్చర్యము చెంది] ఇంత కోపమూ ఇంత ద్వేషమూ నా మీద వద్దు. నేను నీదాసుణ్ణి. నేను తప్పు చేస్తే దండించ వలసినది నీవు, [కౌగలించుకో బోతాడు.]

రాకుమారి: [కర్రవలె నిలుచుని కోపముతో చుర చుర చూస్తూ] మీ రీ దేహాన్ని ఏమి చేసినా చేయవచ్చు నని ఇదివరకే మనవి చేసికొని ఉన్నాను. కాని నా హృదయము మాత్రము మీకు లభ్యము కాదు.

అశోకుడు: నీహృదయము కోసరము, నీ అంతరంగము కోసమురకాక పోతే ఈరాజ్యాలు నేను జయించడము ఎందుకు?

రాకుమారి: నాకు మీరాజ్యములతో పని లేదు మీయుద్ధములతో పని లేదు. [గద్గదస్వరముతో] మీ వికృతరూపము చూస్తూఉంటే త్రిశంకు జ్ఞాపకము వస్తున్నాడు. అమ్మో, అమ్మో! [గజగజ వణకుతూ] దేశదేశాలను ధ్వంసము చేసే తమకు అరక్షిత అయిన స్త్రీని ధ్వంసము చేయుడము ఒక లెక్కా! కానీయండి, నేను అసహాయను.

అశోకుడు: [విచారముతో] నన్ను తూలనాడ వద్దు. నీకోసరము సమస్తమూ, రాజ్యమూ పరిత్యజించి వేస్తాను. ఇక ఒకయుద్ధము చేస్తే పితృద్రోహము చేసినంత ఒట్టు.

రాకుమారి: సమస్తమూ త్యజించగలరు. రాజ్యముకూడా పరిత్యజించగలరు. కాని ఒక్క స్త్రీ కోసరము ఒక్క అశుచిత స్త్రీక కోసరము ఎంత తాపత్రయము!

అశోకుడు: [కోపముతో] నిన్ను మాత్రము పరిత్యజించలేనని అనుకొంటున్నావు కాబోలు!

రాకుమారి: ఒక్కస్త్రీకోసరము లోకాన్ని అంతా పరిత్యజించగల వారు ఇంతరాజ్యము ఏలా చేస్తారా అని ఆలోచిస్తున్నాను.

అశోకుడు: అయితే రాజ్యపరిపాలనకుకూడా అనర్హుడనవే నీ అభిప్రాయము కాబోలు!

రాకుమారి: ఏమో, నాకు తెలియదు.

అశోకుడు: [విసుగుతో] కనుసైగతో సమస్తదేశములనూ జయించినాను. కాని ఒక్క స్త్రీ హృదయాన్ని మాత్రము జయించలేక పోయినాను గదా!

రాకుమారి: దేశాలను జయించినట్టే ఈ స్త్రీని జయించవచ్చును. రాజా, తాము దేశదేశాల రాజులను జయించినారు. కాని వారి హృదయాలను

మాత్రము జయించలేదు సుమా! ఆయా రాష్ట్రజనుల హృదయాలలో చిచ్చు పెట్టినారు. మీ కీవిషయము తెలియదు కాబోలు. అట్లాగే నా దేహము మీ అధీనము. నా హృదయము మాత్రము మీది కాదు. దాన్ని మీరు జయించలేరు.

అశోకుడు: నాకు హృదయము లేదా!

రాకుమారి: ఏమో నాకు తెలియదు.

అశోకుడు: భయపడ వద్దు, చెప్పు. నాకు హృదయము లేదా!

రాకుమారి: మీ ఇతరవిషయాలు నాకు తెలియవు. నా తండ్రిని చంపి నా అన్నను చంపి నా తండ్రి రాజ్యాన్ని లాక్కొని నా ఈ తుచ్ఛ దేహాన్ని ఆశించేవారికి హృదయము ఉందని నేను ఎలా అనుకోనేది?

అశోకుడు: [తేరిపార తీవ్రముగా చూస్తూ తల ఊగిస్తూ] అవును!

రాకుమారి: [కండ్లు మూసికొని] అమ్మో, అమ్మో, మీ నేత్రములు, మీ భీకరాకారము చూడలేను! అమ్మయ్యో, మీకు కోపము వచ్చినట్లున్నది. నన్ను ఏం చేస్తారో కదా! [గజగజ వణుకుతుంది.]

అశోకుడు: భయము లేదు, భయము లేదు నీ హృదయాన్ని జయించిన నాడే నీవు నన్ను చూడవచ్చును. [అని వెళ్ళిపోబోయి ఆమెవంక చూస్తాడు. ఆమె అట్లాగే వణుకుతూ ఉంటుంది.] దాసీ, దాసీ! [ఒక దాసి పరుగెత్తుకొని వచ్చి ప్రణామము చేసి నిలుచుంటుంది.]

అశోకుడు: ఈమెను తీసుకుపో.

[రాకుమారీ దాసీ వెళ్ళిపోతారు. అశోకుడు విచారముగా ఆలోచించుకుంటూ నిలుచుని ఉంటాడు, తెల్లవారవస్తుంటుంది. దూరమునుంచి శ్రావ్యముగా ఈక్రింది పద్యములు వినబడుతవి.]

జితమారారి సమరం
జ్ఞేయసాగర పారగమ్
లోకైక లోచనం బుద్ధం
వందేహం వంద నారహమ్.

భవన్న వతరం తానం
తరీవశరణం సదా
శిరస్సా పణమే సమ్మా
ధమ్మం మోహావిద్ధం నకమ్.
కరణీయం కతం సబ్బం
పుణ్యా క్షేత్ర మనుత్తరమ్
అత్థారి యాగణం సుద్ధం
వందేహం సుగతోరసమ్.
సమ్మా సమ్మాభిసంబుద్ధం
ధమ్మం ధమ్మప్పకాశనమ్.
సంఘుం సంఘుత్తమం లోకే
వందేహం వందవారహమ్.

అశోకుడు: దాసీ, దాసీ.

దాసి: [గబగబ వచ్చి] మహాప్రసాదం.

అశోకుడు: ఎవరా పద్యాలు పాడేది?

దాసి: ఇక్కడికి అరక్రోసుదూరములో ఉన్న బౌద్ధారామములో ఉపగుప్తులవారున్నారు బహుశః వారు.

అశోకుడు: నీవు సత్వరము పోయి అశోక చక్రవర్తి పిలుస్తున్నాడని చెప్పి త్వరగా సూర్యోదయము కాక పూర్వమే తీసికొని రా. [కొంచెము విచారించి] కాదు కాదు, అశోకుడు తమదర్శన భాగ్యము కోసరము ప్రార్థిస్తున్నాడని ప్రార్థించి తీసుకొనిరా. పో. నీవు వచ్చేవరకు నాకేమీ తోచదు.

దాసి: చిత్తము [అని వెళ్ళిపోతుంది.]

అశోకుడు: సమ్మా సమ్మాభి సంబుద్ధం. [అనే పద్యము పాడుతూ విచారముతో అటూ ఇటూ ఒకటిరెండుసార్లు పచార్లు చేసి వెళ్ళిపోతాడు.]

# శ్రీకృష్ణుడు

## శ్రీ చింతా దీక్షితులు

### ౧

శ్రీకృష్ణుడు: అమ్మా, అమ్మా, నే వచ్చేశా.

యశోద: వచ్చావా, నాయనా! నాతండ్రే, ఇప్పటిదాకా ఏం చేస్తున్నావు నాయనా?

శ్రీకృష్ణుడు: అమ్మా, మరేం, మరీ, మరీ ఆడుకుంటున్నానమ్మా.

యశోద: అయ్యో నాయనా! ఎక్కడ ఆడుకొంటున్నావు రా? ఇప్పుడే గదా ఇల్లంతా వెతికేను, నీకోసం.

శ్రీకృష్ణుడు: అమ్మా, నాకేమన్నా పెట్టవూ, ఆడుకొంటాను.

యశోద: ఎక్కడ ఆడుకొంటూన్నావు రా ఇంతసేపటినుంచీని?

శ్రీకృష్ణుడు: ఏవే అమ్మా, నాకేమేనా పెట్టవూటే?

యశోద: ఆడుకోవడం లేదు; అల్లరి చేస్తున్నావు, అవునా?

శ్రీకృష్ణుడు: లేదే, అమ్మా, ఆడుకుంటున్నానే. తువ్వాయిలూ అవీ పరిగెడుతూంటే చూస్తూన్నానే.

యశోద: వెన్నముద్ద పెట్టనా?

శ్రీకృష్ణుడు: ఊహుఁ.

యశోద: వెన్నెందుకు వద్దురా? నీకిష్టమేగా?

శ్రీకృష్ణుడు: నాకేం, నాకేం......

యశోద: పోనీ, పాలు తాగుతావా?

శ్రీకృష్ణుడు: ఊహుఁ.

యశోద: ఏమిరా నాయనా, ఏమీ వద్దంటున్నావూ; ఇలా దగ్గిరనా రా; ఏదీ చూడనియ్యి నీ కడుపు.

శ్రీకృష్ణుడు: వద్దే అమ్మా, వద్దే... పోనీలే నాకేమీ పెట్టకపోతే— నేను వెళ్ళిపోయి ఆడుకొంటాను.

యశోద: నాతండ్రివిగా; దగ్గిరనా రావూ; రా అమ్మా రా! ఏదీ కళ్ళు మూసుకొంటాను, ఎవరొస్తారో, ఎవరొస్తారో!

శ్రీకృష్ణుడు: ఊఁ, ఊఁ, ఊఁ— నేను రానూ— నేను వెళ్ళిపోయి ఆడుకొంటానూ— ఊఁ, ఊఁ.

యశోద: నాతండ్రివి గావూ, ఎవరొస్తారో ఎవరొస్తారో; కంటె వస్తుందో కాసుల పేరు వస్తుందో; నా చిన్నిబొజ్జ కృష్ణమ్మ వస్తాడో; నా బంగారుగజ్జెల కృష్ణమూర్తి వస్తాడో; ఎవరొస్తారో, ఎవరొస్తారో!

శ్రీకృష్ణుడు: ఊఁ, అమ్మా, నే రాను, నే రాను — నే వెళ్ళిపోతాను. నే రాను......

యశోద: రావు కాదూ. నా వరహాలమూటవు కాదూ, నాకన్న తండ్రివి కాదూ, నా ముత్యాల పేరువు గాదూ, నా నాయనవు కాదూ, రా, అమ్మా, రా. ఎవరొస్తారో, ఎవరొస్తారో!

శ్రీకృష్ణుడు: అమ్మా, మరేం, నాన్న మొన్న తెచ్చాడు — ఆ బొమ్మ యియ్యవూ? గదిలో కూచుని ఆడుకొంటాను—

యశోద: రావు కాదూ; వస్తున్నా ఉండు, పారిపోకురా, చూశావా, చూశావా, ఎలా పరుగెత్తుతున్నాడో- నా నాయన కాదూ-దా, ఇలాదా; నీకు బొమ్మ యియ్యనా?

శ్రీకృష్ణుడు: ఇయ్యి మరీ.

యశోద: నాదగ్గిరికి రా; ఒక్క ముద్దు ఇయ్యి; తరువాత బొమ్మిస్తా, ఏం?

శ్రీకృష్ణుడు: నన్ను పట్టుకొని కొడతావూ?

యశోద: కొట్టనులే, రా; రా, అమ్మా, రా. పారిపోకమ్మా! పారి

పోతు— అం, దొంగా. దొరికావు లే—

శ్రీకృష్ణుడు: అమ్మా, నాకు మరి బొమ్మియ్యవూ?—

యశోద: ఇస్తా నమ్మా, ఇస్తాను—ఏమి రా నాయనా, కడుపు ఇంత గట్టిగా ఉంది; పొంగిన ట్లుం దేమిటి?

శ్రీకృష్ణుడు: ఏమో! మరి ముద్దు పెట్టుకొన్నావు కాదూ — బొమ్మియ్యీ—

యశోద: ఇ దేమిట్రా, వళ్ళంతా ఉజిడ్డు, ఏదీ చూడనియ్యి, అయ్యో, అయ్యో, నాతండ్రీ, ఇదేమిట్రా ఈ పెదివిలమీద ఈ నెత్తురుచారలూ?

శ్రీకృష్ణుడు: ఏం లేదు.

యశోద: అయ్యో నాతండ్రీ— ఎక్కడికేనా వెళ్ళి ఏమైనా తిన్నావా ఏమిట్రా?

శ్రీకృష్ణుడు: ఊఁ హు.

యశోద: ఎవరితో నైనా గిల్లి కజ్జాలు తెచ్చుకొన్నావా ఏమిటి?

శ్రీకృష్ణుడు: ఊఁ హుం.

యశోద: నాతండ్రికి దిష్టి తగిలిం దమ్మా; దిష్టి తీస్తా నుండు.

శ్రీకృష్ణుడు: బొమ్మియ్యవు టే అమ్మా?

యశోద: ఉండు, దిష్టి తీస్తాను—తప్పమ్మా తప్పు. దిష్టిదీపం ఊదేసి ఆర్పెయ్యకూడదు— ఊదకు రా—

శ్రీకృష్ణుడు: మ రియ్యవు టే బొమ్మా?

యశోద: ఇస్తాను గాని, — చూడు నిజంగా చెప్పు — ఈ కడుపు ఇంత ఉబ్బరంగా ఉంది గదా — ఎక్కడేమి తిన్నావో చెప్పు—

శ్రీకృష్ణుడు: ఊఁహుం.

యశోద: చెప్పవు గాదూ-చెప్పకపోతే ఏం చేస్తానో ఎరుగుదువా?—

శ్రీకృష్ణుడు: మరి, పొద్దున్నే, పాలు తాగాను కాదూ!

యశోద: ఛా, ఉట్టిది—

శ్రీ కృష్ణుడు: అవునే.

యశోద: చెప్పవూ? చెప్పవూ?—

శ్రీ కృష్ణుడు: ఉండు, ఉండు, చెబతా ఉండు—కొట్టకు మరి— మరేం, ఇందాకొను, మన పెద్దావు వుంది కాదూ—.

యశోద: గబగబా చెప్పూ.

శ్రీ కృష్ణుడు: తువ్వాయి దానిదగ్గిర పాలు తాగి ఆడుకొంటోందే అవ్వ. లేం, నేనేం, మరేం—

యశోద: ఏమి చేశావు, చెప్పూ—

శ్రీ కృష్ణుడు: నేనేం, అప్పుడూ, పెద్దావుదగ్గిరికి వెళ్ళానే—వెళ్ళి, తువ్వాయి పాలు తాగుతుంది కాదూ—ఆలాగ—

యశోద: అలాగ, ఏమిటి?

శ్రీ కృష్ణుడు: దానికాళ్ళసందు కెళ్ళి పాలు తాగేనే—

యశోద: అయ్యో, అయ్యో, నాయనా, అది తన్నలేదు కదా?—

శ్రీ కృష్ణుడు: లేదే అపాలు ఎంచక్కా వెచ్చగా తియ్యగా ఉన్నాయే—

యశోద: ఈనెత్తురుచార లందుకా—అది తన్నిందా ఏమిటి—

శ్రీ కృష్ణుడు: లేదే పాలు తాగుతూంటే తువ్వాయిని నాకుతుంది కాదూ—అలాగే నన్నూ నాకిందే పెద్దావు.

యశోద: అయ్యో, నీ ఆగడం బంగారం కాను—ఇంకెప్పుడూ ఆవు కాళ్ళసందుకి వెళ్ళకేం—

శ్రీ కృష్ణుడు: వెళ్ళనే అమ్మా.

యశోద: మరింద బొమ్మ — ఇంద అక్కా పిడతలు — అరుగుమీద కూచుని ఆడుకొంటావు కాదూ?

శ్రీ కృష్ణుడు: నే నరుగుమీదకువెళ్ళను ఇంట్లోనే నీదగ్గిర కూచుంటాను—

యశోద: అరుగుమీద కూర్చుంటే ఏం, నాయనా?—

శ్రీ కృష్ణుడు: నాకు భయమేస్తుందమ్మా, నే వెళ్ళను.

యశోద: నా అల్లరితండ్రికి భయం కూడానూ? అయితే ఈ పీటమీద కూచో. నేను పాలు పితుక్కు వస్తా—

౨

గోపికలు: ఏమమ్మా, యశోదమ్మా, తలుపు తియ్యవమ్మా ఒకమాటు.

యశోద: ఎవరమ్మా అక్కడ?

గోపికలు: మేమమ్మా గోపికలము-ఒక్కమాటు తలుపు తియ్యవమ్మా.

యశోద: నాకృష్ణుడేడీ? ఈపీటమీద కూర్చోకుండా ఎక్కడికి వెళ్ళావురా, నాయనా?

గోపికలు: తియ్యవమ్మా తలుపు, ఓయశోదమ్మా.

యశోద: ఉండవమ్మా వచ్చేను — నాయనా, కృష్ణా ఎక్కడున్నావురా?

శ్రీ కృష్ణుడు: ఊం.

యశోద: ఈమూల నక్కేవేమిరా, నాయనా?

శ్రీ కృష్ణుడు: ఏం లేదు—

గోపికలు: అదేమమ్మా, పలికినీ తలుపు తియ్యవూ? మాకుమాత్రం పనులు లేవటమ్మా, యశోదమ్మా, తలుపు తియ్యరాదుటమ్మా ఒకమారు?

యశోద: వస్తున్నానమ్మా- అల్లా తొందర పడతారేం? - రా, నాతండ్రీ, రా, నిన్నెత్తుగొని వెళ్ళి తలుపు తీస్తాను.

శ్రీ కృష్ణుడు: నేను రానే, నాకు భయం!

యశోద: గోపికలను చూస్తే భయమేమిటి? నీవు రోజూ వాళ్ళతో ఆడుకొంటూ ఉంటావు కాదూ!—

శ్రీ కృష్ణుడు: నేను రానే అమ్మా - తలుపు తియ్యాకే.

గోపికలు: యశోదమ్మా! ఓ యశోదమ్మా!

యశోద: వస్తున్నా నమ్మా; తొందర పడకండి - రా అమ్మా రా, ఎత్తు కొంటాను - అమ్మ దొంగా; ఎత్తుకోనా, ఎత్తుకోనా?

శ్రీ కృష్ణుడు: వద్దే.

యశోద: అలాగ కాదమ్మా-అం-ఎత్తుకున్నా నామరి-ఈమాటు తలుపు తీద్దాం, ఏం?

గోపికలు: ఇక్కడే నిలబడిపోతి మమ్మా యశోదమ్మా, తలుపు తియ్య వమ్మా—

యశోద: ఇదిగో నమ్మా తలుపు తీశాను-ఎందు కమ్మా ఇంతమంది గోపి కలు వేళ గాని వేళ మా ఇంటికి వచ్చారు?

గోపికలు: అవు నమ్మా యశోదమ్మా-మీపిల్లవాడి ఆగడం మీకు ఇష్ట మయితే కావచ్చును గాని-ఊరివా రందరికీ ఇష్టమౌతుం దమ్మా?

యశోద: అదేమి గోవమ్మా, అంతకోప మెందుకే? - మాపిల్లవా డేమి చేశాడో చెప్పవే.

గోపిక: ఏమి చేశాడో నేను చెప్పేద మెందు కమ్మా? మీపిల్లవాడి ఆగడం మీకు తెలియ దటమ్మా?

ఇంకో గోపిక: మీపిల్లవాణ్ణి అదుపాజ్ఞలలో పెట్టుకోక - ఏమి చేశా డంటా వేమి టమ్మా యశోదమ్మా?

మూడో గోపిక: మీకృష్ణమ్మ ఏమీ ఎరగని నంగనాచమ్మా! - నోట్లో వేలు పెడితే కరవలేదు పాపం!—

యశోద: మాపిల్లవాడు పొద్దిటినుంచీ మా ఇంట్లోనే ఉన్నాడు గా దటమ్మా.

గోపిక: అవు నమ్మా మీ ఇంట్లోనే ఉన్నాడు—

ఇంకో గోపిక: మీ ఇంట్లో నే ఉండి మా ఇళ్ళన్నీ చక్క బెట్టుతున్నాడు-కా దటమ్మా, యశోదమ్మా?

మూడో గోపిక: చంకలో నక్కి- కూచుని ఎలా చూస్తున్నాడో ఏమీ

ఎరగనట్లు-నాలి ముచ్చులా అలా చూస్తున్నావుగా ఏమీ ఎరగనట్లు కృష్ణా!

యశోద: అయితే మీ రందరూ కలిసి ఏమి తప్పు చేశా డంటారు మాకృష్ణమ్మ!

గోపిక: అవునే, యశోదమ్మా, మ మ్మెందు కడుగుతా వమ్మా, మీపిల్లి వాణ్ణే అడగ వమ్మా—

ఇంకో గోపిక: ఏమిరా, కృష్ణా, చెప్ప రా మీ అమ్మతోటి—

యశోద: ఏమి చేశావు, నాయనా, ఏమి చేశావు? - నాకు చెప్పవూ!

శ్రీకృష్ణుడు: ఏమీ చెయ్య లేదే—

గోపిక: ఏమీ చెయ్యలే దుట్రా పెంకే?

ఇంకో గోపిక: ఏమీ చేయలేదు గా-నంగనాచీ?

మూడో గోపిక: అవును, ఏమీ చెయ్యలేదు-ఏమైనా చెయ్యగలవా అల్లరి-పాపం-అవునా కొంటే?

యశోద: ఎందు కమ్మా, మా అబ్బాయిని మాట లంటారు? - ఏమి చేశాడో మీరే చెప్పరాదు టమ్మా?—

గోపిక: మే మెందుకు చెప్పా లమ్మా యశోదమ్మా?

యశోద: చెప్పకపోతే ఎట్లా తెలిసే నమ్మా, గోపమ్మా?

గోపిక: తెలియ దంటా వేమి టమ్మా? — అంతా విడ్డూరం!—మీ అబ్బాయివళ్ళు చూశావు టమ్మా?

ఇంకో గోపిక: అజిడ్డంతా ఒంటికి ఎందుకు వచ్చిందో అడగరాదు టమ్మా ఆ దొంగకృష్ణుణ్ణి?—

యశోద: ఏమిరా, నాయనా, ఒంటికి జిడ్డు ఎందుకు వచ్చిం దంటావురా! చెప్పమ్మా?

గోపిక: ఆ పెదవిమీద చార లేమిటో అడగవే మమ్మా, యశోదమ్మా!

శ్రీకృష్ణుడు: అమ్మా, వాళ్ళని వెళ్ళిపొ మ్మనవే, భయం వేస్తోంది—

యశోద: అ దేమి టమ్మా అందరూ కలిసి మాకృష్ణమ్మను తెదర

గొడుతున్నారు—వెళ్లిం డమ్మా, మీ ఇళ్ళకు మీరు వెళ్ళండి — ఎవళ్ళని చూచి ఎవ రనుకొన్నారో—

గోపిక: ఎంత చిత్రంగా మాట్లాడతా వమ్మా—మీ కృష్ణమూర్తినే మే మెరగము కాబోలు!

ఇంకో గోపిక: మ్మా కెప్పుడూ కనిపించకుండానే ఉంటున్నాడు కాబోలు రోజూకు రోజు!—

యశోద: అయ్యో ఎంత ఖర్మం వచ్చిం దమ్మా! మానాయన ఏమీ చెయ్యలే దంటూంటే ఏమో అల్లరి చేశా డని అంటున్నారు కాబోలు— ఆ అల్లరి ఏమిటో చెప్పరాదు టమ్మా?—

గోపిక: పిల్ల అని అదమాయించుకోకుండా మే మేమో అన్నా మంటూ ఎందు కమ్మా?—మీ అబ్బాయినే అడగ వమ్మా! మాటలు రావా ఏమిటి పాపం మీ వాడికి!

యశోద: చెప్పు, నాయనా, ఏమి చేశావో చెప్పు.

శ్రీ కృష్ణుడు: నే నేమీ చెయ్యలేదే అమ్మా.

యశోద: మాకృష్ణమ్మ ఏమీ చెయ్యలే దంటున్నా డమ్మా.

గోపిక: అంటా డమ్మా, అంటాడు—అనడు మరీ?—మీ వాడు బుద్ధి మంతుడు—చూ డమ్మా, నువ్వే చూడు—దీని పెదివి ఎలా కొరికవేశాడో చూడు—చూపవేమే గోపీ, పెదివి చూపు— అల్లా సిగ్గు పడతావేం?

శ్రీ కృష్ణుడు: ఉత్తిదే అమ్మా!.

ఇంకో గోపిక: చూడ వమ్మా, మీ బుద్ధిమంతుడు మా చెల్లెలిపెదివి కూడా రక్తా లొచ్చేటందుకు ఎలా కొరికేశాడో!

శ్రీ కృష్ణుడు: ఊఁ—నేకొరికేనా?

ఇంకో గోపిక: చూ డమ్మా యశోదా, చూడు ఈ పిల్ల బుగ్గ—వళ్లు ఎలాగ దిగారో- మాపిల్లలుమాత్రం పిల్లలు కా రటమ్మా!

శ్రీ కృష్ణుడు: నాకు వెన్న ముద్ద ఇస్తానని ఆశ పెట్టి—

యశోద: అయితే నిజంగా కోరికేవుట్రా—చూడు నిన్నేం చేస్తానో? ఏమి చేశావో నిజంగా చెప్పు.

శ్రీ కృష్ణుడు: కొట్టకే అమ్మా! మరి చెబతాను—

యశోద: చెప్పు మరి—

శ్రీ కృష్ణుడు. మరేం, ఈపిల్ల నాకు వెన్నముద్ద పెడతా నందే—

యశోద: ఎప్పుడూ?

గోపిక: ఎప్పు డేమిటి ఇందాకానే.

యశోద: అవునా?

శ్రీ కృష్ణుడు: "నాకు వెన్నముద్ద పెడతా నన్నావు. పెట్ట" మంటే చేత్తో తట్టుకు ఊరించిందే "పోనీలే, పోనీలే, పెట్టవూ, పెట్టవూ" అంటే నోట్లో వ తేసుకొని ఆకాశం చూపించిందే.

పిల్ల: అన్నీ అబద్ధాలే.

యశోద: నిజం చెప్పవుట్రా.

శ్రీ కృష్ణుడు: అప్పుడు నే నన్నాను గదా—మా అమ్మతో చెప్తా నుండు—అన్నాను. అంటే వ న్నెత్తుకొని వెన్నముద్ద బుగ్గను పెట్టుకొని—బుగ్గ కొరికి తీసుకో మందే—అంటే నేను బుగ్గ—

యశోద: ఏ మమ్మా, మీరే మాపిల్లవాడికి అల్లరి నేర్పి మాపిల్లవాడు అల్లరి చేస్తున్నా డని ఎదురు చెప్పుతా రమ్మా!

గోపిక: మీపిల్లవాడు మహా గజమరిలాగ చెప్పుతా డే మమ్మా!

యశోద: అయితే నిజ మేమి టమ్మా?

గోపిక: పోనీ చిన్నివాడు గదా అని ఎత్తుకొంటే "నీబుగ్గ వెన్నముద్ద లాగ ఉం" దని కొరికేడే నీకొడుకు యశోదమ్మా!

ఇంకో గోపిక: పెదివి ఎందుకు కొరికాడో అడగవమ్మా?

యశోద: నిజం చెప్పరా; నీ మూలాన్ని మాకు ఊండ రాములు లేకుండా ఉన్నాయి.

శ్రీ కృష్ణుడు: ఆ అమ్మాయి న న్నెత్తుకో లేదా ఏమిటి మొదట—న న్నెందు కెత్తుకోవాలి?

గోపిక: చిన్నపిల్లాడ వని ముద్దుకొద్దీ ఎత్తుకొంది—ఎత్తుకొం దని పెదివి కొరికేస్తావా?

శ్రీ కృష్ణుడు: నే కొరికేనా ఏమిటి? న న్నెత్తుకొని పాట పాడింది—ఆ పాట తియ్యగా ఉందన్నాను—

యశోద: అంటే?

శ్రీ కృష్ణుడు: ఆతీపి ఎక్కడిది దనుకొన్నావు— అంది ఆ అమ్మాయి. అంటే పెదివిల్లోంచి వస్తోం దన్నానే—అంటే పాటతీపి పెదవిల మూలా న్నే—కావలిస్తే చూడు అందే—అంటే కొరికేనే.

యశోద: మీకు న్యాయమే నమ్మా? ఇటువంటి బుద్ధులు పిల్లవాడికి నేర్పుతారు టమ్మా.

గోపిక: మీపిల్లవాడిమాటే నిజ మనుకుంటావే మమ్మా యశోదా?—శ్రీకృష్ణుడు నట్టి మాయలాడమ్మా—ఎత్తుకొని ముద్దు పెట్టుకో మని అడిగి పెదివిలమీద ముద్దు పెట్టుకొంటూంటే గోపిక పెదివి కొరికివేశా డమ్మా!

యశోద: అవునుట్రా కృష్ణా?

శ్రీ కృష్ణుడు: కాదే అమ్మా!

యశోద: ఏమిరా నాయనా ఇంత అల్లరి చేస్తారురా! నిన్నేమి చెయ్య మన్నావు చెప్పు!

గోపిక: ఇంకా వినవమ్మా మామాటలు?

యశోద: ఇంకా వినుం దమ్మా?

ఒక గోపిక: మాగూనలో వెన్నంతా తినేశాడే ఓయమ్మా!

ఇంకో గోపిక: మా పెరుగంతా దిమ్మరించేశాడే యశోదమ్మా!

ఇంకో గోపిక: మా పాలన్నీ పంచిపెట్టేశాడే ఓసెమ్మా!

గోపిక: ఏమిబుద్ధులు చెబతావో చెప్పమ్మా మీపిల్లవాడికి—మమ్మల్ని

ఇక్కడే ఉండ మంటావా ఇంకో ఊరు చూచుకో మంటావో.

యశోద: ఇక్కడ కూర్చో కృష్ణా. ఇంట్లోకి వెళ్ళి తాడు తెచ్చి నిన్ను స్తంభానికి కట్టివేస్తాను.

శ్రీ కృష్ణుడు: వద్దే, అమ్మా.

గోపిక: నీవు వెళ్ళి తాడు తేనమ్మా; పారిపోకుండా మేము చూస్తూ ఉంటాము.

యశోద: ఇదిగో వెళుతున్నా నమ్మా—పారిపోనివ్వకం డమ్మా.

3

ఒక గోపిక: నన్నుకూడా ఒకమారు ఎత్తుకోనియ్య వమ్మా మాచిన్ని కృష్ణుడ్ని!

ఇంకో గోపిక: ఉండ వమ్మా, నువ్వూ ఎత్తుకొందువు గాని—అయితే కృష్ణా—మీ అమ్మదగ్గిర ఎందుకు చెప్పావు అన్నేసి అబద్ధాలు?

శ్రీ కృష్ణుడు: మా అమ్మతో మీ రెందుకు చెప్పా రేమిటి?

గోపిక: నేనుకూడా ఎత్తుగుంటాను ఒకమాటు రావూ? నా కృష్ణమ్మవు కావూ?

శ్రీ కృష్ణుడు: నే రాను, మొన్న నెందుకు నన్ను కొట్టావు?

గోపిక: చూశావా, చూశావా, నేను కొట్టానా?

శ్రీ కృష్ణుడు: ఊం, కొట్టలేదు కామోసు?

గోపిక: నారవికె చింపేస్తే నే కొట్టనూ — నాదగ్గిరికి రావు కాదూ? రావు కాదూ? ఎందుకు రావో చూస్తాను—ఏం? ఏం—ఈమాటు వచ్చావా!

శ్రీ కృష్ణుడు: మా అమ్మతో చెబతా ఉండు!

గోపిక: చెబతావా—చెబతావా—నీబుగ్గలు చిదిమిబూర్లొండేసెయ్యనా? వండెయ్యనా?—చెప్పు కృష్ణా, చెప్పవ?

శ్రీకృష్ణుడు: నా ఊపిరి సలపడం లేదు.

గోపిక: నీబొజ్జ కరిగించెయ్యనా? నీ చిన్ని బొజ్జ — ఏదీ నీ చిన్ని బొజ్జ ఏదీ?—

శ్రీకృష్ణుడు: నన్నొదిలెయ్యి.

ఇంకో గోపిక: అలాగ నలిపేస్తావే మమ్మా చిన్ని కృష్ణమ్మని?— ఇలా ఇయ్యవమ్మా— మేము మాత్రం ఎత్తుకో వద్దుటమ్మా?

గోపిక: ఇంద వమ్మా, అల్లరి కృష్ణమ్మని ముద్దుగా ఎత్తుకొంటే తలంతా ఎలా లేపేశాడో— ఇం కెప్పుడూ లేపెయ్యవు గదా!— నల్లగా జీడిగింజలా ఒళ్లూ నువ్వూను!

ఇంకో గోపిక: ఏడీ? నాకృష్ణమ్మ ఏడీ? నాముద్దులమూట ఏడీ?— కృష్ణా ఏదీ నీబుగ్గ?— ముద్దు పెట్టుకో నియ్యి.— కూకటిని కూడా ముద్దెట్టుకో నియ్యి? — ఏదీ నీవరహాలబొజ్జ?— ఇదేనా?— ముద్దుపెట్టుకోనా?

శ్రీకృష్ణుడు: నాకు కితకిత లవుతున్నాయి.—

గోపిక: ఏదీ నీగజ్జెల మొలతాడు?— ఒక్క ముద్దు పెట్టుకో నియ్యి. నీ చిన్న పాదా లేవీ?— చిన్న పాదాలు— ఎర్రటి మెత్తని పాదాలు— ఒక్క ముద్దు!

ఇంకో గోపిక: అస్తమానం నువ్వే ఎత్తుకోవాలి టమ్మా? — పాపం! అక్కడ కూర్చోబెట్టనేనా కూర్చోబెట్టమ్మా- పిల్లవాను నలిగిపోతున్నాడు.

శ్రీకృష్ణుడు: నేను కూచోను, కూచుంటే అమ్మ వచ్చి కొడుతుంది.

గోపిక: పోనీ మా ఇంటికి తీసుకుపోమా?

శ్రీకృష్ణుడు: నే రాను.

గోపిక: ఉండు, కృష్ణా— ఈచీరచెంగుతో నీ ఒంటి జిడ్డంతా తుడిచే నియ్యి— నెమిలి పింఛం సరిగా పెడతా నుండు— కదలకు. పువ్వులు సరిగా పెట్టనియ్యి— అయ్యో, మా కృష్ణమ్మ బొట్టు చెరిగిపోయిం దమ్మా ఏమి చేశాడో గాని.

గోపిక: నీవు అలా నిలబడవమ్మా, నీబొట్టు కొంచెం తీసి కృష్ణమ్మకు పెడతాను—

శ్రీ కృష్ణుడు: అ. మొమ్మొస్తూంది.

గోపిక: అక్కడ కూచోబెట్టవే, అక్కడే కూచోబెట్టు-మన మిక్కడే ఇదివరకులాగే నిలబడదాము.

యశోద: ఏ డమ్మా, కృష్ణుడు పారిపోలేదు గదా—ఎక్కడా వాడు తాను కనిపించడమే లేదు. ఇప్పుడే వస్తాను—చూస్తూ ఉండం డమ్మా మాపిల్లాడిని.

గోపిక: వెళ్ళ నమ్మా చూస్తూ ఉంటాము—మీ అమ్మ వెళ్ళిందిలే- రావూ నే నెత్తుకుంటాను, కృష్ణా రావూ!

శ్రీ కృష్ణుడు: నేను రాను.

ఇంకో గోపిక: పోనీ, నాదగ్గరికి రా.

శ్రీ కృష్ణుడు: ఊహుఁ, రాను.

ఇంకొక గోపిక: నా దగ్గరికో?

శ్రీ కృష్ణుడు: నే రాను.

గోపిక: పోనీ అమ్మా మరి నువ్వు రాకపోతే మీఅమ్మతో చెప్పి కొట్టిస్తా ఉండు.

శ్రీ కృష్ణుడు: ఊఁ—మా అమ్మతో నేను చెబుతాను—అమ్మా, అమ్మా, నేను పారిపోలేదు. నేను అల్లరి చెయ్యలేదు. మరేం, న న్నెత్తుకుంటా నంటే వెళ్ళ నన్నానే అమ్మా—అంతేనే అమ్మా—అంటాను.

గోపిక: రావు కాదూ, రాకపోతే మొట్టికాయలు తింటావు సుమా?

ఇంకో గోపిక: ఏ వేలితో మొట్టానో చెప్పు.

ఇంకో గోపిక: నే నే వేలితో మొట్టానో చెప్పు.

గోపిక: అయ్యో, పాపం మా కృష్ణమ్మని అందరూ అలాగా మొట్టికాయలు మొట్టుతా రేమి టమ్మా పాపం!—రా కృష్ణా, రా, నే నెత్తుకుంటాలే.

గోపిక: నాచీర చింపేశాడే, అయ్యో!

ఇంకో గోపిక: నాహారాలు తెంపుతావురా ఇలాగ!—

శ్రీకృష్ణుడు: నన్నెందుకు కొట్టాలి?

గోపిక: కొట్టములే—నేను ఎత్తుకున్నానా మరి—ఏది ఎక్కడ నొప్పెట్టిందిచూపించు అక్కడ ఒక్కముద్దు పెట్టుకుంటే పోతుంది.

ఇంకో గోపిక: పాప్పం, నొప్పెట్టిందా ఉండు నేను ముద్దెట్టుకుని నొప్పి తీసేస్తాను—ఏం—ఈమాటు పోయిందా?

ఇంకో గోపిక: అందరినీ ఒక్కొక్కమారెత్తుకోనియ్యండమ్మా—అన్తమానం ఒక్కరే ఎత్తుకుంటే ఏలాగమ్మా మా చిన్ని కృష్ణమ్మని?

గోపిక: ఇదుగో నమ్మా, నువ్వెత్తుకోవమ్మా, మా చిరిబొజ్జ కృష్ణమ్మని.

ఇంకో గోపిక: నువ్వు ఎత్తుకోవే నల్లకృష్ణమ్మని!

ఇంకో గోపిక: ఇదుగో నమ్మా కృష్ణమ్మా, పెద్దతామరరేకుల్లా కళ్ళు విడూను—నలిపెయ్యకుండా ఎత్తుకోండమ్మా.

ఇంకో గోపిక: ఇలా తేవే, నేనూ ఎత్తుకుంటాను.

ఇంకో గోపిక: పాపం ఊపిరి సలపదే—అంతగా మొహంమీద మొహం పెట్టి ముద్దులాడుతావేమిటే?

గోపిక: అందరూ ఇలా గుమిగూడే రేమిటమ్మా!

యశోద: ఏడమ్మ, మాకృష్ణమ్మ?

గోపిక: ఇదుగో నమ్మా, బిక్కమొహం వేసుకు కూరుంటే పోనీ పాపం అని ఎత్తుకున్నాము.

యశోద: అదే వమ్మా, అంతా చోద్యంగా చెప్పుతావు—ఇప్పుడే కాదటమ్మా, మాకృష్ణుడు అల్లరి చేశాడని ఆడిపోశారు?

గోపిక: అల్లరి చెయ్యలేదంటున్నామమ్మా ఇప్పుడు మాత్రం?

యశోద: నేను చూడ్డంలేదటమ్మ—మా కృష్ణమ్మనెత్తుకొని అందరూ ముద్దాడడం లేదుటమ్మా?

గోపిక: చిన్నపిల్లాడు గదా అని ముద్దాడితే తప్పా టమ్మా?

యశోద: బుద్ధులు చెప్పమనీ, దండించమనీ ఎంతో కోపముతో చెప్పి-ఇంతట్లోకే ఎలా ముద్దాడుతున్నా రమ్మా?

గోపిక: అల్లరి చేశాడు గనక అల్లరి చేశా డన్నాము కాని-ఇంతట్లోకే పాపం, కృష్ణమ్మని తాడుతో స్తంభానికి కట్టి వెయ్యాలమ్మా?

యశోద: మీరే కా దటమ్మా మాకృష్ణమ్మమీద నేరాలు మోపారు?

గోపిక: అ దేమి టమ్మా, అలా గంటావు-మేము మాత్రం కనిపెంచే-వాళ్ళము కాదు టమ్మా-అమాత్రానికి పిల్లలిని తాళ్ళతో స్తంభాలకి కట్టి వేస్తారు టమ్మా?

యశోద: నే నప్పుడే అనుకొన్నాను-మాకృష్ణుడు అల్లరి చేసేవాడు కా డని-ఎందు కమ్మా ఈలాటి నీలాపనిందలు మాకృష్ణమ్మమీద వెయ్య డం?-ఇది న్యాయమేన టమ్మా?

గోపిక: ఉండ వమ్మా ఒక్క-మారు కృష్ణుణ్ణి ముద్దు పెట్టుకొని వెళ్ళి పోతాము.

యశోద: అలాగ అందరూ మీద పడి నలిపేస్తా రే మమ్మా చిన్న పిల్లాడిని? మా అబ్బాయిని ఇలా యియ్యం డమ్మా-బెదరిపోతాడు—

గోపిక: ఇదుగో నమ్మా తీసుకో వమ్మా ఇంతటి మనా మీఅబ్బాయిని మేము వెళ్ళిపోతున్నాము.

యశోద: రారా, నాయనా, రా, అమ్మా, రా, నీమీద ఎలాంటినేరాలు మోపేరో—తీరా మోసి వాళ్ళమాటలు నమ్మి నిన్ను స్తంభానికి కట్టేమ కాను—ఇంకా నయం—ఎంతటివాళ్లైనా ఉంటారు.

శ్రీకృష్ణుడు: అమ్మా, నాకు బువ్వెట్టవు టే?

యశోద: పెడతా నమ్మా, పెడతా భయ మన్నావు, భయ పోయిందా నాయనా.

శ్రీకృష్ణుడు: పోయిందే.

యశోద: అయినా ఇంకోమారు దిష్టి తీస్తా నుండు—ఎవరికళ్ళు ఎలాంటివో.

కృష్ణుడు: అస్తమానం నాచుట్టూరా మిరపకాయలుతిప్పుతా నంటావెం దుకే—నా కక్కరలే దమ్మా—నాకొద్దు.

౧౬౩-౧



# అపవాదు

శ్రీ ముద్దు కృష్ణ

◆ ◆ ◆ ◆

రావ్ . లలిత . పంతులు
ఉమ . శ్యాం . వెంకటరావు

◆ ◆ ◆ ◆

౧

[లలిత ఇంటిలో చావడి తూర్పుగోడమూలను డ్రాయరు. దాని యెదగ కుర్చీ. దక్షిణపు గోడవరసను రెండు రోజ్ వుడ్ కుర్చీలు. తూర్పుగోడను ఆని డ్రాయరు, పక్క-రెండు పడకకుర్చీలు. పడమర గోడుమీద జారే అరడుగుల యెత్తుతెర. తెరను ఆని సోఫా, తెరఅవతల పడకగది, దాని వెనుక స్నానాలగది, వంటయిల్లు. ఉత్తరవు తెరిపిని వీధి: వీధిలోని గుమ్మమూ-సాయంత్రం నాలుగు. తెర వేసిఉంది. చావడిలో రెండు స్టౌవ్ లు వెలుగుతూ ఉన్నవి. ఒకదానిమీద బాణలి, రెండవదానిమీద టీ కెటిల్ ఉన్నవి. పంతులు గరిట చేతితో పుచ్చుకుని బాణలిని చూస్తూ న్నాడు. రెండవ స్టౌవద్ద లలిత నిలుచుంది. ఉమ పడక కుర్చీలో కాళ్లు చాపి పడుకొని పత్రిక చదువుతూ ఉన్నట్టు నటిస్తూ న్నాడు. రావ్ రోజ్ వుడ్ కుర్చీలో కూర్చుని ఉన్నాడు. బాతాఖానీ సాగుతూ ఉన్నా లలితా, పంతులూ, టీ ఉప్మాల తయారు చూస్తూనే వుంటారు.]

రావ్: లలితా, ఈదినం మీరు కప్పులూ ప్లేట్లూ అందమైనపద్ధతిని సర్దడం, పైజాగ్రత్తలూ చూడండి...

లలిత: కాదు, కాదు, ఈవేళ నేనే చేస్తాను టీ.

ఉమ: రావ్! లాభం లేదు. ఈవేళ అన్నీ ఆవిడే చేయాలిలే, తగినంత కారణం ఉంది. [లలిత ఘట్టిగా చూస్తుంది ఉమని. ఉమ నవ్వుతూ] పంతులు గారూ, మీరుకూడా ఉప్మా ఆమె...

లలిత: [తొందరగా] పంతులుగారూ! కవీశ్వరులతో యేం గాని నూక వేసేప్పుడుమాత్రం నాతో చెప్పండి!

పంతులు: వీళ్ళమాటలతో ఏ మమ్మా? అంతా అమిరిస్తే ఆరగించను దిగుతారు స్వాములు. గరిట పుచ్చుకోవడం అంటే కలం కదపడం కాదు; కాఫీపొళ్ళు కలపడం-అంటే కవిత్వం కాదు. ఆ తలకాయలు పని చెయ్యవు ఇక్కడ.

ఉమ: తలకాయ పనివిషయమై చెప్పవలసి వస్తే...

లలిత: పంతులుగారే ఫస్టు! [అందరూ నవ్వుతారు.]

పంతులు: [వొచ్చిన ఉడుకుబోతుతనాన్ని నొక్కివేసి మోటుగా] మీ చమత్కారం నాతలకాయలాగే ఉంది లేండి!

రావ్: అంటే?

లలిత: అంటే ఏమీ లేదు కాని, ఆగుండురాయి ఇలా అందుకోండి. గుండుశబ్దం పంతులుగారికి కష్టంగా ఉంటుం దేమో, పోనీ ఆగులకరాయి ఇలాఅందుకోండి!

ఉమ: పంతులుగారూ! ఎవరిమొహం. చూశారో పొద్దున్నే, ఖర్చు లేకుండా తలంటు...

పంతులు: వీళ్ళిలాగ అల్లరి చేస్తుంటే ఉప్మా చెడిపోతుం దండీ!

లలిత: ఆ. ఆలా వీ ల్లేదు. గరిట ఇలా ఇవ్వండి!

ఉమ: ఈ దినం ఏదీ చెడిపోడానికి వీ ల్లేదు లెండి!

లలిత: [గరిట పుచ్చుకొని ఉమమీదకు బెదరింపుగా వచ్చి] ఈవేళ మీనోరు మహాచురుకుగా ఉంది. పొద్దున్న ఏ మన్నా వస నమిలారా?

ఉమ: పస నమిలిన నోటి పస మీరింకా యెరగరు పత్రిఖ్యాతి వల్ల గాని ఇంక కాస్సేపటికి ఆఘ్రాింసు, అసంగతులూ...

రావ్: ఖ్యాంసంగతి ఈమెకు తెలుసునా?

ఉమ: విస్తారం తెలియదు. తెలిస్తే...

పంతులు: ఇదిగో వృమ్మా డికాక్షను తయా రైంది.

లలిత: అలా ఉంచండి. పాలు కలపకండి. ఉమా టైం ఎంత యింది?

ఉమ: ఇంక పదినిమిషాలు. పాశ్చాత్యపద్ధతులవాళ్లు గడియారాలాగే నడుస్తారు.

పంతులు: ఓహో! తెలిసింది!

లలిత: ఏం తెలిసిం దండి?

రావ్: చెప్పనా?

లలిత: వొద్దు, వొద్దు. నియోగిబుర్ర ఏం గ్రహించిందో చూతాం.

పంతులు: హుమ్. ఇంకా గ్రహించకపోవాలి! ఇక్కడకు పదినిమిషాలలో ఇంకొకకొత్త అపవాదు వొస్తూ ఉన్న దన్న మాట.

లలిత: పంతులుగారూ, మీమాటలు బాగుండ లేదు.

రావ్: కొత్త అపవాదు లంటే పాపం పంతులుగారికి ఎంత భయమో, పాతవే అయితే ఫరవాలేదు.

పంతులు: నావల్ల ఎవరికీ అపవాదురాదు.

లలిత: ఎందుకు ఈ ఘర్షణ!

ఉమ: పంతులుగారి నియోగిబుర్ర ఈవిషయంలో సరిగ్గా పనిచెయ్యదు అనుకుంటా.

రావ్: ఏమీ అలా అంటున్నావు?

ఉమ: ఏమీలేదు. పంతులుగారు తెల్లబడుతూవున్న మీసాలకు నల్లరంగువేయడం మానివేసినా, అతిజాగ్రత్తగా పైస్వచ్ఛత కాపాడుతుంటూన్న ఆయనకీర్తికి ప్రపంచం ఏమూలనుంచో నలుపు అంటిస్తూనేవుంది

లలిత: ఇదీ కవిత్వంగానే చెప్పాలి?

పంతులు: చాతకాలనీ, చకోరాలనీ, మేరువుపర్వతాలనీ సృష్టించే కవీశ్వరులు ఏమి సృష్టించలేరు?

రావ్: పంతుగారు, ఏమి పాతకబుర్లు చెబుతా రండీ? ఈనాటి కవిత్వంలో చాతకాలూ చకోరాలూ లేవు.

లలిత: [ఉమకేసి చూస్తూ-] పోనీ అవి కాకపోతే నిజం కాని ప్రేయసీ ప్రియులూ, ... ప్రేమలూ, విరహాలూ...

ఉమ: [నవ్వుతూ, తప్పించడానికి-] అయితే పంతులుగారూ! మీ విషయమైన మీకు అంత ఘట్టినమ్మక మేనా?

పంతులు: ఓ!

రావ్: పాపం, మీసంగతి మీకే తెలియడం లేదన్నమాట.

లలిత: అన్యాయం, పంతులుగారు అంతవొళ్ళు తెలియకుండా ఉన్నారు అనడం.

పంతులు: లేనిది ఉన్నట్టు సృష్టించే కవిగారు ఆయన; ఉన్నా ఉండక పోయినా ఏదో ఉన్నట్లు వ్రాస్తేనే కాని వీలు లేదు ఈ పత్రికావిలేఖరికి. వీరిమధ్యను పడినతరువాత ఏ అపవాదులూ రాకుండా ఎలా ఉంటవిలే?

ఉమ: చూసి చూసి నిరోగిపేచీ పేశారు పంతులుగారు.

రావ్: ఎంత లౌకికు లయినా ప్రపంచసంగతి పూర్తిగా గ్రహించినట్టు లేరు పంతులుగారు. ప్రపంచంప్రవర్తన మహావికృతం. నేను నిర్దోషిని అన్నట్టుగా ఇతరుల దోషాలను ఏకరవుపెడితే నాభుజం తట్టి నాచేత ఇతరులదోషా లన్నీ పలికిస్తుంది. కాని నేను వెనుకకు తిరగగానే, అంతకన్నా అద్భుత మైనవిశేషాలు నన్నుగురించే పలికేస్తుంది.

లలిత: అయితే ఇవన్నీ అన్యోన్యసాహాయ్యాన అన్నమాట. దీనిలో కవిగారి కవిత్వం ఎంతవరకూ?

పంతులు: అదీ! మీరు నిజం గ్రహించారు. ఎవరు ఏ అపవాదులకు ఎంత కారణమో ఇప్పుడు తేలుతుంది. కవీ...

ఉమ: ఉండండి, ఓ గోల! మోటార్ సైకిల్ ... [లలిత గుమ్మందగ్గరకు తొందరగా వెళుతుంది. వీధిలో ఏచప్పుడూ లేదు. ఆమె తిరిగి వచ్చేటప్పటికి అందరూ నవ్వుతారు. ఆమెముఖం ఎర్రబడుతుంది.]

లలిత: ఉమా! ఈమాత్రం పరాభవం నీకు చేయలేకపోతానా? [పడక కుర్చీలో కూర్చుంటుంది]

పంతులు: వీళ్ళతో నేమి గాని, ఇదిగో నమ్మా, ఉప్మా తయారైంది. టీ కలపనా?

లలిత: ఉండండి, ఉండండి, నేను కలుపుతాను. [లేచి కలుపుతుంది]

రావ్: అన్నీ తయారుగానే ఉన్నవి. కాని...

ఉమ: కాని?

లలిత: మీవల్ల బొత్తిగా...

[మోటార్ సైకిల్ ఆగుతుంది గుమ్మంలో లలిత గుమ్మంవేపు వెళ్ళబోయి, ఆగి, ఉప్మా పళ్ళాలలో సర్దుతూ ఊరుకుంటుంది. శ్యాం గుమ్మంలోనికి వొచ్చి ఎవ్వరూ ఆహ్వానించకపోవడం చూసి, ఆగి, దగ్గుతాడు]

ఉమ: రావేం లోపలికి? ఓహో, పాశ్చాత్యపద్ధతిని ఆహ్వానించనిదే రావు కాబోలు.

[శ్యాం లోపలకు వస్తాడు. లలిత ఉప్మా సర్దుతూ ఉన్నట్టునటిస్తూ ఇటు చూస్తుంది. ఉమ ముందు రావ్‌ని తెలియబరుస్తాడు. రావ్ నమస్కారం చేస్తే, శ్యాం షేక్‌హేండ్ చేస్తాడు. తరువాత లలితను పరిచయం చేస్తాడు. శ్యాం ఆమె చేతిని మృదువుగా అన్నట్టు నటనతో పట్టుకొని వదలకుండానే]

శ్యాం: నేను చాలాసుదినము. మిమ్ములనుగురించి నాచే వినబడడమే కాని ఇదివరలో మిమ్ములనుచూచే అదృష్టము నాకు కలగలేదు.

లలిత: [బిడియపడుతూ, చేయితీసుకుని] ఇది పెద్దఅదృష్టంగా భావించవలెనా?

ఉమ: లలితా! మీరు పొరపాటుపడుతున్నారు. ఇంగ్లీషు తెనుగు అది. ఆమాటకుమనం తెనుగులో ఇచ్చినంతవిలువ ఇంగ్లీషులోలేదు.

లలిత: అలాగా! క్షమించాలి. మాటకు తగినంతవిలువ ఉండవలెకాని; విలువలేనిమాటలను ఉపయోగించేమర్యాదలు అతెల్లవాళ్ళకే వొదిలిపెట్టి మనమర్యాదలనే అనుసరిస్తే...

శ్యాం: [కొంచెంవొంగి-] మీరు నావందనాలు అంగీకరించాలి. నాకు, వేల్యూబుల్- మహావిలువైన పాఠంచెప్పినారు.

లలిత: నేను హాస్యానికి అన్నమాట...[హేళనగా] మీరు ఎక్కువవిలువ పాఠంగా తీసుకొన్నారు.

శ్యాం: [మెచ్చుకున్న] నవ్వుతో చాలాఆనందముగా ఉన్నది. మంచిహాస్యరసం ఒలికించారు.

ఉమ: ఏమిటోయ్, చంపుతున్నావ్ ఆ తెనుగు.

శ్యాం: [లలితతో] మీకు-ఏనీ నంబర్-ఎన్నయినా క్షమాపణలు! పది సంవత్సరాలు బహిర్దేశాలలో ఉండిపోవడంవల్ల తెలుగు మాట్లాడడమే...

ఉమ: బహిర్దేశాలేమిటోయ్! చస్తున్నాం ఈ అపసవ్యపు మాటలతో...

శ్యాం: -ఐ ఏమ్ సారీ- నేను చాలా విచారిస్తున్నాను. నాఉద్దేశం...

లలిత: ఫరవాలేదండి. ఇంత పట్టింపు ఎందుకు కూర్చోండి.

శ్యాం: -థేంక్స్- వందనాలు. ఆమిత్రులు ఎవ్వరో- ఇంట్రొడ్యూస్- తెలియబడలేదు.

ఉమ: ఆయన...

లలిత: ఉండండి. ఆపని నేను చేస్తాను. ఈయనే నారాయణరావు పంతులుగారు. మన స్నేహితులు. ఏదో కొంచెం ఉన్నవారు. అందుచేతను

దీనపోషణ, దేశసేవ చేస్తుంటారు. పల్లెటూళ్ళలో చదువుకోసం...

పంతులు: [పెద్ద మొహంతో] ఏదో వారు అభిమానరికొద్దీ అనేమాటలు కాని...

శ్యాం: [షేక్‌హేండ్ చేస్తూ] ఓహో! మిస్టర్ డి. నారాయణరావు ఆఫ్ ఎడల్ట్ ఎడ్యుకేషన్ స్కీమ్ రెపుటేషన్!

రావ్: అవును. అయనే...

లలిత: పైకి సనాతనంగా కనపడినా అన్నిటా మనతో కలుస్తారు.

శ్యాం: వారు సరియైన - పొలిటీషియన్ - అన్నమాట. చాలా ఆనందం మీదర్శనసౌఖ్యం. మీకీర్తి ఇంగ్లండ్‌లో ఉన్నప్పుడుకూడా చాలాసార్లు పత్రికలద్వారా వినబడినది.

లలిత: కూర్చుందురూ. ఈపొగడ్తలకన్నా బాగా కడుపు నింపే ఉప్మా టీ ఉన్నవి...

శ్యాం: లలితగారు చాలా హాస్యగర్భులు.

లలిత: పాశ్చాత్యసంపర్కంవల్ల మీలో నవీనత ఎక్కువ ఉంటుంది అనుకున్నాను. కాని మీది అంతా పురాణఫక్కీగా ఉన్నదే!

ఉమ: ఆతనిభాషకీ అతని భావాలకూ సంబంధం లేదు.

శ్యాం: ఒరేయ్! చంపుతున్నావు నీకవిత్వం, అ, అవేమిటి... అ శ్లేషలూ అన్నీ నామీద ఋణాయించి-

ఉమ: నీభాష నీఉద్దేశాలను తెలపజాలలేదని కాదోయ్! నీఅభిప్రాయాలుకూడా నవీనాలు కావేమో అన్నట్టు లలిత అంటే, నీఅభిప్రాయాలు నవీనాలే అంటున్నాను.

శ్యాం: లలితగారూ, మీరు.......

లలిత: క్షమించి గారూ అనేశబ్దం పేరుతో కలిపి వాడకండి! నాకు ఎందుకో ఆశబ్దం చెవికి ఇంపుగా ఉండదు. [శ్యాం ఆమెను మైమరచి చూస్తాడు. పంతులు రావ్‌ని చూడమన్నట్టు కన్ను గీటుతాడు.]

శ్యాం: మంచి - టేస్ట్ - రుచి, సంగీతం జీవితంగా చేసుకున్న మీకు చెవి సున్నితం, ఔను. [ఆప్యాయంగా. అన్నట్టు]- లలితా, ఇంగ్లండు లోనూ, యూరప్‌లోనూ, అమెరికాలోనూ స్త్రీస్వేచ్ఛ - ఉమన్స్ ఫ్రీడమ్- అంటే ఏమిటో బాగా చూశాను. అందుకే నాహృదయం గంటి ఏనాటికైనా మనఇండియాకూడా అంతటి-హై లెవెల్ - ఎత్తైన స్థితికి తీవ గలుగుందా అనిపించేది. మీవంటి స్వేచ్ఛావ్యక్తులు ఈ దేశంలోనూ ఉంటున్నారని కలైనా కనలేదు. కన్నుల పండువుగా, చెవుల పండు వుగా...

లలిత: మీ టీలో పంచదార సరిపోయిందో లేదో...

శ్యాం: - ఎక్స్‌క్యూస్ మీ - నన్ను క్షమించాలి. నేను టీలో చాలా తక్కువ పంచదార వేసుకుంటాను. ఫ్రాన్స్‌లో....

ఉమ: [పంతుల్ని కన్ను గిలికించి] ఫ్రాంసుసంగతి ఎత్తినప్పుడుకూడా టీ సంగతీ, టీలోని పంచదారసంగతీ ఎందుకు? టీకన్నా, టీలోని పంచ దారకన్నా, తీయని విషయాలు, చేమకూరవాడు అన్నట్టు 'తీయని పంచ దార వెనుతీయగ పల్కి...'

లలిత: ఫ్రాంసులో మీరు ఎన్నాళ్ళున్నారు?

శ్యాం: [దర్జాగా] నేను వీ లున్నన్నిసార్లు పెరీలోనే ఉండేవాణ్ణి - బై దీ బై - పెరీ అంటే మనవాళ్ళు తెలియక తప్పు పలికే పేరిస్- వీకెండ్స్ - అంటే వారం చివరలను ఈ బొందిని - పెరీలో - విసరకపోతే గిలగిలా కొట్టుకునేది.

లలిత: [నవ్వుతూ] మరి ఇప్పుడు ఎట్లా ఉంటూన్న దండీ?

శ్యాం: [తెచ్చి పెట్టుకొన్న నవ్వు బిగ్గరగా నవ్వుతూ] లలితగారూ! కాదు - ఐమ్ సారీ - నేను విచారిస్తున్నాను. మీరు నన్ను క్షమించాలి. [ఆగి మోహం తమాషాగా పెట్టి] లలితా! ఇంగ్లీషులో 'డిజైర్' అంటారు. దీనికి తెలుగు ఏమిటోయ్ కవీ?

రావ్: అచ్చ తెనుగులో తాటాకులు కట్టడం అంటారు. [లలిత నవ్వు ఆపుకుంటుంది]

శ్యాం: థేం క్యూ - అదీ - జర్నలిస్ట్ - అంటే? ఇడ్యమేటిక్ భాషాంతరీకరణం చెప్పారు.

పంతులు: ఇంతకూ మీ భావం చెప్పలేదు.

శ్యాం: [పంతులుకేసి] థేం క్యూ - చక్కగా జ్ఞాపకం చేశారు. ఇంగ్లీషు గరల్స్ అంటే కన్యలకు ఉన్న - షార్ప్ విట్ - చురుకైన హాస్యం లలిత సంపాదించారు ఎలాగో!

[లలిత ఓరగా చూస్తుంది. శ్యాం పైప్ వెలిగిస్తూ పక్క చూపుగా చూస్తాడు ఆమెను. పంతులు ఉమని చూస్తాడు వికటంగా]

ఉమ: ఇంతకూ ఉత్తబాతాఖానీ యేనా, లేక ఏదైనా కార్యక్రమం ఉన్నదా?

శ్యాం: [పెద్దగా నవ్వుతూ] ఎంతకైనా కవీశ్వరుడవే నోయ్! మహా అద్భుతంగా పోయటిక్ పాథ్ - కవిత్వం బాటకు దింపుతావు.
[వాచీ చూస్తూ] కవీ! ఈ సాయంత్రం - షో - ఏమిటో?
[పంతులు కండువా తియబోతాడు]

లలిత: పంతులుగారూ, అంత భయపడనక్ఖరలేదు. సినీమాకు వెళ్ళ వద్దులెండి. కాని...

శ్యాం: [నాటకంగా లేచి, ఆమెయెదుట నిలిచి] మీరు - డిసైడ్ - అంటే నిర్ణయించేసి ఆజ్ఞాపించండి. మేము - ఫాలో - అంటే అనుసరిస్తాము.

లలిత: [హేళనగా] థేం క్యూ! కాని కూర్చోండి చెబుతా. మేమందరం జట్కామీద సారంగధరుడిమెట్టకు వస్తాం. మీరు సైకిల్ మీద రండి. వెన్నెలవచ్చినతరవాత అందరం తిరిగి వచ్చివేతాం. నేను రోజూ రెండు మైళ్ళయినా నడవాలి.

శ్యాం: గ్రేండ్ గా ఉంది!

రావ్-పంతులూ-ఉమ: [హేళనగా] ఫేమస్ గా ఉంది!

శ్యాం: అయితే నేను- ఇన్ ఎడ్వాన్స్- ముందుగా వెళ్ళి మీకు- వెల్కమ్ సుస్వాగతం ఏర్పాటు చేస్తాను. [లలితచేయి పట్టుకుని- షేక్ హేండ్ చేసి, పైగా నమస్కారం కూడా పెట్టి, తతిమ్మావారివైపు దొరలపద్ధతిని, వంకరగా పెట్టిన తలా కళ్లూ కదిపి వెళ్ళిపోతాడు. నలుగురూ వింతగా అదారిన చూసి ఒకరిమొహాలు ఒకరు చిరునవ్వుతో చూసుకుంటారు.]

తెర

౨

[మధ్యాహ్నం మూడు. చావడి అట్లానే ఉన్నది, స్టౌవ్ లూ ఉపాహారసామగ్రి మాత్రం లేవు. లలిత సోఫాలో కూర్చుని పత్రిక చదువుతూ ఉన్నది. నిమిషమైనతరవాత పత్రికను కిందకు జారవిడిచి, అగ్గి రెప్ప వడని కళ్ళతో ఆలోచనగా ఇంటికవ్వాకేసి చూస్తూ ఉన్నది. పంతులు వీధిగుమ్మంలోనుంచి లోపలికి ఒక అడుగు వేసి, పత్రికవైపూ లలితవేపూ చూసి]

పంతులు: చూశారా కథంతా? ఇట్లా అవుతుం దనే నేను తప్పించుకుంటా.

లలిత: ఈవ్రాసిన వ్రాతలకు నే నేమీ బాధ పడను, భయపడను; కాని ఈ అబద్ధా లేమిటి? ఎవ రండీ ఈమహాపతివ్రత? జీతం భత్యం లేని సంఘసంరక్షకురాలు?

పంతులు: ఆఁ, అ దంతా టక్కరివేషం! ఎవడో ధైర్యం లేనిచచ్చు ఆ పేరు కల్పించుకొని వ్రాశాడు.

లలిత: వీడికి మనవల్ల కలిగిన బాధ ఏ ముం దని ఇన్ని అబద్ధాలు కూశాడు?

పంతులు: అసలు రహస్యం కడుపుబ్బు: ఈర్ష్య. ఏదో ధర్మసంస్థాపన కోసమూ, మీరు అన్నట్టు సంఘాన్ని ఉద్ధరించడం అనే సెపమూ. ఇంత కన్నా ఏ ముంది?

లలిత: వీడివార్తకు భయ పడిపోతాను అనుకున్నాడు కాబోసు?

పంతులు: [నవ్వుతూ] అయితే ఇ దంతా ఏమిటి మరి?

లలిత: నాకు భయం వేసి కాదు ఇట్లా అడుగుతూ ఉంటా, అసహ్యం వేసి. నిజంచెప్పి ఇష్టం వచ్చినట్టు విమర్శించ మనండి, తగిన జవాబుకూడా ఇస్తాను. నా పేరు ఎత్తి బహిరంగంగా విమర్శించనీయండి. తగాదా లేదు. అంతే కాని ఈఅసహ్యపువ్రాతలూ, ఈస్త్రీజాతిదూషణా, ఈఘోర అబద్ధాలూ, ఈపిరికితనం ఎందుకు?

పంతులు: మీరు ఏమీ అనుకో మంటే నేను అవశ్యం పుచ్చుకుని వాదిస్తాను. [లలిత తల ఊపుతుంది]

ప్రపంచానికి ఏది నిజం అనే ఆలోచన లేదు సరే గదా, అబద్ధమైనా ఏది సరదాగా ఉంటే అదే కావాలి అని కోరుతుంది. మీరు ఏబాధ పడితే నేం, కాస్సేపు గమ్మత్తుగా చెప్పకోడానికి ఏదో ఒక కథ. మీసుఖాన్ని పాటించడానికి అంతా మంచే యెంచడానికి ప్రపంచం తాపత్రయ పడదు.

లలిత: అంత బుద్ధీ మంచీ లేనిప్రపంచాన్ని నేను పాటించను.

పంతులు: [దెప్పగా] మీరు పాటించకపోయినా మిమ్మల్ని పాటించక మానదుగా ప్రపంచం!

లలిత: అయితే ఏడవ నీయండీ, మొరగ నీయండీ!

పంతులు: ఏ ద్వేది ప్రపంచమైనా......

లలిత: నన్ను ఉడికించకండి పంతులుగారూ!

పంతులు: ఉడికిలి పోతే కాదు. నేను అనుభవంమీద చెబుతున్నా, వినండి. ప్రపంచం కపటనాటకం. దీనిలో అందరూ దొంగలే. ఎవరినిజమూ తెలియనూ తెలియదు, తెలియకుండా ఉండనూ ఉండదు. సత్యంతో నిమిత్తం

ఎవరికి! నాసంగతి చెబుతాను వినండి ఇంతవరకూ మీరూ ఎరగరు. నాభార్య చనిపోయి పదిహేనుసంవత్సరాలు అయింది. ఆనాటినుంచీ సంసారమూ నాసుఖమూ అనేకవిధాల సర్దుకుంటున్నాను. నేను సంపర్కం కల్పించుకోని సంస్థ లేదు. ఎందరితోనో వ్యవహరిస్తాను. అయినా నా జీవితం ఎన్నిరహస్యాలలో ఎలా జరుగుతూ ఉన్నదో ఎవరికీ తెలియదు. నామీదా అనుమానాలు లేక పోలేదు; నిర్ధారణా లేదు. వెనక గుసగుస లాడుకునే వారే ఎదరకు రాగానే అతిమర్యాదగా ఉంటారు. నాకు కావలసినసుఖాన్ని నేను ఎలాగైనాసరే పొందుతాను, అతిరహస్యంగా; కాని నారహస్యాలు బయటకురానీయను, వచ్చినా కాదంటాను. [గర్వంగా] తెలివిఅంటే అలా ఉండాలి.

లలిత: పంతులుగారూ, నేను గుంటనక్కను కాలేనండి!

పంతులు: [పౌరుషంతో] గుంటనక్కలు కానక్కర లేకపోతే గాడి...ఎందుకు లేండి కాని - మరి కోరి తెచ్చుకుంటూ ఇతరుల్ని అనడ మెందుకు?

లలిత: ఈ అబద్ధాలు ఎందుకు అన్నాను కాని...

పంతులు: మీరు కష్టంగా యోచుకో వద్దు; నేను అవసరమని నిర్మొహమాటంగా మాట్లాడుతాను. ఏది అబద్ధమో ఏది నిజమో ఎవరికి కావాలి! తన పద్ధతులకు వ్యతిరేకంగా నడిచేవారిని ఉపేక్షించదు సంఘం. స్త్రీ యెడల అనుమానానికి అవకాశం ఉంటే చాలు, అపవాదుగానే ఎంచుతుంది.

లలిత: ఔను. మరి స్త్రీలు లోకువగా దొరికారు. ఇంక మేము లొంగం ఈ అన్యాయాలకు. సంఘం ఉపేక్షించకపోతే చచ్చువాగితలు వాగిసుకో మ్మనండి, తప్పుడు కూతలు కూసుకో మ్మనండి నేను అసలు లక్ష్య పెట్టను. ఇక ముందు ఏ స్త్రీకూడా అన్యాయానికి దచ్చుగా లొంగదు. నేను చేస్తూ ఉన్న తప్పు ఏమిటో అంటా? ఈ సంఘానికి అణిగి ఉన్న

న్నాళ్ళూ కలిగిన బాధలు చాలు. అంత అన్యాయంగా, బలవంతంగా నా ఆరోగ్యం చెడగొట్టి, పైగా నా ఆరోగ్యం చెడి రోగిష్ఠిని అయినా, నని వంక కల్పించుకుని రెండో వివాహం చేసుకున్నాడు. ఈ సంఘం ఏమైనా నాకు, జరిగిన అన్యాయాన్ని దిద్దిందా, ఆ వివాహానికి అడ్డు వచ్చిందా? పైగా వాళ్ళిద్దరివల్లా అవమానాలు పడలేక, రోగాలతో మూలగలేక నేను దాటుకువస్తే అనేవాళ్ళు అనేమాట అన్నీ అననే అన్నారు. పురుషులు దుర్మార్గంపక్షమై స్త్రీలను ఇంత అన్యాయం చేసే ఈ సంఘాన్నా మన్నించడం? నేను మన్నించను సరేగదా, ఇకముందు ఏ స్త్రీ కూడా మన్నించదు ఇంతకూ నేను చేస్తూ ఉన్న తప్పు ఏమిటో చెప్పండి? మా నాన్న ధర్మమా అని చదివించిన చదువూ చెప్పించిన సంగీతమూ ఉన్నవి కనుక ఉద్యోగం సంపాదించుకుని నా బ్రతుకు నేను గడుపుకుంటున్నాను. నా ఆరోగ్యం బాగు పడడానికి డాక్టరు సలహా ఇచ్చినప్రకారం రోజూ మూడు నాలుగు మైళ్ళు నడుస్తున్నాను. ఇదా మహాతప్పు! ఈ సంఘానికి లొంగి, చావు అయినా ఆరోగ్యంగా చావకుండా మూలకూర్చుని మూలిగి మూలిగి అలా కుళ్ళి చస్తే ఇల్లాలూ ఉత్తమురాలూ!...

పంతులు: ఆరోగ్యంకోసం షికారు వెళ్ళినందును కాదు. కాని...

లలిత: మీ కాని... నాకు తెలుసును. మగవాళ్ళతో కలిసి ఎందుకు వెళ్ళాలి అని.

పంతులు: అదీ!

లలిత: మొట్టమొదట నేను ఒంటరిగానే వెళ్ళేదాన్ని. కాని, అప్పుడు సంప్రాప్తమైనది ఏమిటో తెలుసునా? మామూలుగా నలుగురిలోనూ మహా పెద్దమనుష్యులం అనిపించుకునేవారే ఎవరైనప్పుడు చూసే చూపులూ, అన్యాపదేశంగా అనేమాటలూ, వారు పుట్టించిన పుకార్లూ, వాటివల్లను రేగి విపరీతచర్యలకు పూనుకున్న రౌడీల దుర్యత్నాలూ భరించలేక కవినీ, రావునీ, బ్రతిమాలుకున్నాను. ముందు వాళ్ళూ ఒప్పుకోరు. అయినా వాళ్ళ

ధర్మమా అని సరియైన న్యాయదృష్టిగల ధైర్యవంతులు గనుక వొస్తున్నారు. నేను చేస్తూ ఉన్న పనిలో పితప్పులేదు. ఉంటే నేనే అనుభవిస్తాను. మీరి కెందుకు? కానీయండి, ఈసంఘానికి ఏమైనాసరే భయపడను.

పంతులు: సంఘమూ భయపడదు ఈ బెదిరింపులకు. అంతేకాదు. తాను ఏ సరిహద్దులు పెట్టిందో ఆ సరిహద్దులు దాటి నడుస్తే అడుగడుగునా నిల దీసి ప్రశ్నిస్తుంది. ఆ ప్రశ్నకు జవాబు చెప్పితీరాలి...

లలిత: ప్రశ్నిస్తుందేం? ప్రశ్నించనీయండి! నా స్వాతంత్ర్యాన్ని అన్యాయంగా, అనవసరంగా ప్రశ్నించి, నాపైన అపవాదులు కల్పించే ఈ అవకతవకలకూ ఈ అబద్ధపు వ్రాతలకూ అడుగడుగునా జవాబు అవసర మైతే, ఇదిగో ఈ వ్రాతలకూ, వీడికీ, ఇటువంటివాళ్ళ కందరికీ, ఈ సంఘా నికీ ఇదీ నాజవాబు! [కింద పడిఉన్న పత్రికమీద కాలు నొక్కి నలిపి రాస్తుంది. పంతులు తెల్లబోయి చూస్తుంటాడు; ఇంతలో రావ్ ఉమా ప్రవేశిస్తారు]

రావ్: భేషక్! ఉమా! నీ కవిత్వందృష్టి గొప్ప దోయ్!

ఉమ: లలితా! మీ ధైర్యానికి అభినందనాలు!

లలిత: కవిత్వందృష్టి ఏమిటి?

రావ్: గ్రంథాలయంలో పత్రిక ఇప్పుడే చూశాం. ఆ పాడుకథ మీకు బాధగా ఉంటుందేమో అన్నాను నేను. 'ఆ మెఘట్టి నీకు తెలియదు' అని ఈ సంఘాన్ని బాగా పోల్చి చెప్పాడు, కవి.

పంతులు: ఏ మని?

రావ్: 'తనతో అభిప్రాయభేద మున్నవ్యక్తిని గాడిదను చేసి తోక దగ్గర అల్లరి చేసి బెదరగొట్టి పరుగెత్తించి తమాషా చూడడానికి యత్ని స్తుంది సంఘం; కాని తెలివైన గడసరి గ్రహించి నిదానంగా ఆగి వెనుకకు రానిచ్చి రెండుకాళ్ళూ విసిరి మూతి పగలదన్నుతాడు. దుప్పికొమ్ము పట్టు దడదళ్ళు పట్టగానే బుద్ధి కలిగి 'మనకు ఎందుకులే' అని సర్దుకుంటుంది

సంఘం అని పోల్చి, 'లలిత ఈమాత్రానికి బెదిరి పరిగెత్తే ఆమె కాదు, తగిన మూతివిరిగే జవాబే ఇస్తారు కాని' అని ఇప్పుడే అన్నాడు. సరిగ్గా లలితా అటువంటిజవాబే ఇస్తున్నారు...

పంతులు: [నవ్వుతూ] కవిదృష్టి గొప్పదే. ఇందాక నన్ను ఈవిడ గుంటనక్క అంటే, మీరు 'గాడిదలు అనబోయి జంకారు. ఇప్పుడు కవే పోల్చాడు కనుక నా మాట సరిపోయింది.

ఉమ: [తడాఖాగా] ఒక్కపోలికతోనే పోలేదే! నేను చెప్పిన జవాబు కూడా వొచ్చింది!

[పంతులు ఖండువా తీసుకొని పోబోతాడు]

లలిత: [ఇటు తిరిగి] ఆగండి మీరు అప్పుడే వెళ్ళడానికి వీలు లేదు. నక్కలతోనూ, [అటు తిరిగి] గాడిదలతోనూ ఏమి కాని, మీరు అంత అసహ్యంగా ప్రవర్తిస్తారు అనుకోలేదు, నే నెప్పుడూ...

ఉమ: ఇంతకూ మా ప్రవర్తనలోనేనా లోపం కనబడుతూ వుంటా?

రావ్: ఇంత పక్షపాతం...

లలిత: ఊరుకోండి ఇంకా మాటలుకూడానా? మీ మాటలను ఇంకెప్పుడూ నమ్మను. అద్భుతమైన వాడు అంటే చూతా మనుకున్నాను కాని ఆషాఢభూతిలా నాడలగొడతాడు అనుకోలేదు.

ఉమ: [చిరునవ్వుతూ] తరువాతకథ చెప్పండి!

లలిత: కథా! ఔను మరి, మీకు అంతా కథగానే ఉంటుంది. [కోపంతో] పెద్దమనుష్యులు మళ్ళీ...అట్లా అసహ్యంగా విడిచిపెట్టి ... నాకు ఒళ్ళు మహామండుతూ ఉంది!...

ఉమ: లలితా! మీకు ఇంత కష్టంగా ఉంటుంది అనుకోలేదు.

రావ్: ఎందుకంత కోపం వొచ్చింది మీకు?

లలిత: కోపంటాదూ? అపరాయివాడితో అలా ఒంటరిగా విడిచిపెట్టి మీరు చెప్పనైనా చెప్పకుండా వెళ్ళిపోతారా?

ఉమ: వాడు అంత అపకతవకగా ప్రవర్తించి, మమ్మల్ని వెగటుగా చూసి...

లలిత: అయితే, అది నా తప్పా లేకపోతే ఇటువంటి అసందర్భపు వాడని తెలిసి ఇక్కడకు రప్పించిన పెద్దమనిషి తప్పా?

ఉమ: ఇ దేమిటీ? నా కేం జ్యోతిషం తెలుసు ననుకున్నారా!

లలిత: మీరు ఎరగరూ అతని సంగతి? సాంఘికచరిత్ర పొడిచివేశాడు, మహోఆశయాలు ఉన్నవాడు అని ఏమేమో పొగిడి...

ఉమ: అవన్నీ నిజాలు కావా? అయినా చదువుకీ ప్రవర్తనకీ సంబంధం ఏమిటి?

లలిత: ఔను, సంబంధం లేదని ఇప్పుడుగా తెలిసివచ్చింది?

పంతులు: బాగా అన్నారు!

రావ్: ఎట్లా గ్రహించగలం? అన్ని దేశాలు తిరిగాడు, విద్యావతులైన పాశ్చాత్య స్త్రీలతో పరిచయాలు ఉన్నవి అంటాడు. ప్రవర్తన అంత అపకతవకగా ఉంటుందని ఎట్లా ముందు గ్రహించగలము?

ఉమ: ఇంతకూ మీాకు ఎందుకు ఇంత కష్టం తోచిందో చెబుతురూ?

లలిత: మీరు ఎందుకు నాతో చెప్పకుండా వెళ్ళిపోయారు?

రావ్: మరి ఏమి చేయ మంటారు? మీరు ముఖం చిట్లించుకుంటూ ఉన్నా లక్ష్యపెట్టక, మీతో అంత చనువు తీసుకుంటూ అసహ్యంగా ప్రవర్తిస్తూ ఉన్నప్పటికీ మీకోస మని సహించాం. కాని, మిష పెట్టి మిమ్మల్ని ఆ జీడిమామిడిచెట్టు దగ్గర అంతసేపు నిలిపి, సంఘంమీద వంక పెట్టి అతను మమ్మల్ని ఉద్దేశించి అన్నమాటలు కష్టమనిపించినవి. అయినా పది పదిహేనునిమిషాలు చూశాం. ఎంతకూ తెమలకపోతే వొచ్చివేశాం.

లలిత: నే నేం చేయను? జీడిలా పట్టుకున్నాడు. ఒక్క నిమిషం, ఒక్క నిమిషం అని మొహమాటం పెట్టి కదలనిచ్చాడు కాదు. పెద్దమనిషితరహా దాటకుండా తప్పించిరావడానికి వీలు లేక యమయాతన పడ్డాను. పోనీ,

వెళ్తే వెళ్ళారు కాని ఆ జట్కా తీసుకుపోతే నేను ఎలా రాగలుగుతాను అనుకున్నారు?

ఉమ: మేము దిగి, జట్కా తిరిగి పంపించివేశాం. కాని మీ రోకదారి, జట్కా ఒకదారి అయింది.

రావ్: లలితా! మీకు ఇబ్బంది కలగవలెనని ఉద్దేశిస్తామా?

ఉమ: వాడిని అవమానం చేసినట్టు ఔతుంది అనుకున్నాము గాని, మీకు ఇబ్బంది ఔతుంది అనుకోలేదు. ఈకాస్తకే మీరు ఇంత ధుమధుమలాడ్తరు.

లలిత: మీకు కాస్తవలెనే ఉంటుంది. మగవాళ్ళు మరి. వాడు నన్ను పెట్టినపాట్లు మీకు ఎట్లా తెలుస్తవి? ఆ నైడు కార్‌లో రమ్మని బలవంతం ప్రారంభించాడు. వెళ్ళి జట్కాబండిని పంపించి పెట్టవయ్యా అంటే వినండే. ఒంటరిగా మిమ్మల్ని చీకటిలో వొదిలి వెళ్ళను అని మూర్ఖించాడు. ఇక విధి లేక అంగీకరించాను. దానిలో ఎక్కబోతూఉంటే గభీమని అవసరం లేని సహాయానికి దండ పట్టుకున్నాడు చొరవగా. నాకు ఎంతకష్టం తోచింది!

ఉమ: ఇడియట్! ఏం ఫ్రాన్స్ అనుకున్నాడా?

లలిత: అంతతో అయిందీ? పంతులుగారితోట పక్కనుంచి సోమాలమ్మ గుడిరోడ్డునే తొందరగా పోనీ వయ్యా అంటే, ఆరోడ్డు సరిగా లేదు, చీకటి అని కాలేరు రోడ్డుని ఆర్యాపురంలోనుంచి గోదావరిగట్టు ఎక్కించాడు. ఏమి చెప్పితే ఏమి లాభం. తక్కువస్పీడ్ పెట్టి పైగా నాతో మధ్యమధ్య బాతాఖానీ ప్రియత్నాలు. ఏమి బాధ పెట్టాడు!

పంతులు: మీరు ఇంగ్లాండు వెళ్ళకుండానే...

లలిత: పంతులుగారూ! ఊరుకోండి. నాకు అసలే మాటలు సరిగ్గా వచ్చేటట్టు లేవు. త్వరగా పోనియ్యవయ్యా అంటే, అరొయ్యా మీకు కడుపు అని వత్తి గిన్నాడు తాడు. గట్టుమీద ఉన్న జనమంతా కన్నులు మూసి

దనే నిలిపి వేశారు. 'ఇంకొకరోడ్డుని పోనిమ్మని బ్రతిమాలుకుంటే వినకుండా హిందూసమాజం ఎదరనుంచీ సినిమాముందునుంచీ పోనిస్తాడు. అప్పుడే సమాజంలోనుంచీ సినిమాలోనుంచీ వచ్చేజనం మాఊరేగింపు వింతగా చూశారు.

తల వంచుకుని ఇంటిదగ్గర పడ్డానురా బాబూ, అనుకుంటే, అంతతో అయిందీ. నేను సైడ్ కార్ తలుపు తీసుకో లేకపోయాను, రక్కు—మని సిరి బొమ్మల్లాగ, సర్కస్ వాడివలె ఇటు తిరిగివచ్చి తలుపు తీయడంతో, పోనీయక, దొరసానిని దొర పట్టి దింపినట్టు సొంతంగా చేయి పట్టుకున్నాడు.

రావ్: ఘంటలా గున్నాడే!

లలిత: నాకు ఒళ్ళుమండింది. చేయి విదిలించుకుని, తలుపుమీదకు ఊరికే తీసుకుని లోపల పడ్డాను. మోటార్ సైకిల్ ఆగేప్పటికే ఇరుగుపొరుగంతా చోద్యం చూడడానికి వచ్చారు. ఇక విరగడయింది అనుకుని కూర్చున్నాను సోఫాలో.

పంతులు: అంతతో వదిలాడూ?

లలిత: తిన్నగావచ్చి పడకకుర్చీలో కూర్చుని మళ్ళీ....వీడి సోది తగలెయ్య! ఫ్రాన్స్ అమెరికా అని. మళ్ళీ ప్రారంభించాడు. ఇక ఈజీడి వొదిలేట్టు లేదని, 'నాకు స్నానానికి వేళయింది వొచ్చేవరకూ ఉంటే మీకు అలస్యం అవుతుందేమో?', అన్నాను. నాచీకేసిచూసి 'ఫరవాలేదు. మీరు స్నానం చేసి వచ్చేవరకూ ఉంటాను', అన్నాడు. ఇక ప్రాణం విసిగి స్త్రీనేకాని లాభం లేదనుకున్నాను. స్నానం అయిన తరుతాతకూడా తెర అవతల పడుకున్నాను మాట్లాడకుండా. ఎంతసేపుచూసినా ఏమాత గాదా లేదు. ఆపడకకుర్చీలో కాళ్ళుచాపి పడుకుని, ఇంటికప్పుకేసి చూస్తూ, పైప్ మాటిమాటికీ నింపి కాలుస్తూ కూచున్నాడు.

ఇక ఇట్లా లాభంలేదనుకుని లేచివచ్చి 'మీకు భోజనానికి వేళ అయిన

ట్టుంది' అన్నాను. 'నో నో. నాకు భోజనానికి ఒక టైం అని లేదు, మధ్యాహ్నం మీరు చేసిన ఉప్మా బరువుభోజనం అయింది' అన్నాడు. మొండి మళ్ళీ 'ఇంగ్లండులో మిస్ డెయిసీ అనే స్నేహితురాలు' అని ప్రారంభించాడు. అయిదు నిమిషాలు ఓపిక పట్టి చూశాను. 'నాకు ఆకలి వేస్తూవుంది, భోజనానికి లేవాలి' అన్నాను. ఆ లేవాలి అన్న ముక్క పొరబాటుగా అర్థమౌతుంది అని నేను గ్రహించనేలేదు. నా కొంప మునిగింది. 'థేంక్యూ థేంక్యూ' అంటూ కోటువిప్పి, బొట్టుపెట్టి పిలిచినట్టు తయారయ్యాడు!

ఉమ: వీడితస్సాగొయ్యా!

లలిత: ఇక ఇది ప్రమాదించే ఘాతం. ఇక సున్నితాలు పనికిరావు, మోటుతనం తప్పదు అనుకుని తొందరతొందరగా నాలుగుముద్దలు మింగి లేశా. తాను తెమలడే! ఒక పేసోది ప్రారంభించి, 'ఆదేశాలలో భోజనం గంటసేపు చేస్తారు. అది చాలా ఆరోగ్యం' అని వాగుతున్నాడు. నేను లేచి పోయి చేయి కడుక్కునివచ్చి మంచంమీదను పడకవేశా. నెమ్మదిగా భోజనం ఈడ్చి, మంచందగ్గరగా వచ్చి, 'ఏమి, అట్లా ఉన్నారు?' అన్నాడు. 'నాకు చాలా విచారంగా ఉన్నది, ఎందుకు చెప్పారు కారు! ఇదే ఇంగ్లిష్ గరల్స్ అయితే ఈపాటికి ఎన్నిమందులు తెప్పించుకునేవారు. మీరు నాకు చాలా అన్యాయం చేశారు.

పంతులు: ఓరి వీడి... మధ్య వీడికి అన్యాయమేమిటి?

లలిత: ఆ! వాడిబొంద, ఆ ఇంగ్లీషుపద్ధతులన్నీ మనకు రుద్దడం- శుంఠ ... [ఆగి] అంటూ, ఉండండి వస్తాను... యూ ప్లీజ్ వైట్-అంటూ కోటు తొడిగి తొందరగా సైకిల్ ఎక్కాడు.

పంతులు: అమ్మా!

లలిత: ఏమి అమ్మా? అంతలో ముగియులే ఆషాఢభూతికథ. కదిలాడు అంతే చాలునని తలుపు బిగించి కిటికీకూడా మూసివేసి దీపం ఆర్పివేసి పడుకున్నా. పదినిమిషాలయ్యేప్పటికి మళ్ళీ తయారైనాడు, ఇక ఏమైనా సరే

తలుపు తీయదలచుకోలేదు నేను. ముందు నాలుగయిదుసారులు పిలిచాడు. పదినిమిషాలు ఏ చప్పుడూ లేదు. కాని, మోటార్ సైకిల్ చప్పుడూ లేదు. అందుచేత వీడు అక్కడనే ఉన్నాడు అని గ్రహించా. అయిదేసి ఆరేసి నిమిషాలకు ఒక్కొక్కసారి పిలుస్తూ అరగంటో ముప్పావుగంటో ఆతెచ్చిన అమృతాంజనాన్ని భరించాను. నాకు మహాసరదా వేసింది, మంచిశాస్తి అయిందని.

ఉమ: పిచ్చిముండావాడులా ఉన్నాడే!

పంతులు: [కోపంగా] 'ఆఁ, పిచ్చా, మదమూ?

లలిత: అంతటితో తెమిలిందీ!

రావ్: ఏం తలుపులు ఎత్తేప్రయత్నం చేశాడా?

లలిత: వాడిపుణ్యం అంతవరకూ లేదుకాని, తెల్లవారేప్పటికి మళ్ళీ తయారైనాడు. 'గుడ్ మార్నింగ్, మీకు తలనొప్పి ఎట్లా ఉన్నది?' అంటూ. ఇక లాభం లేదనుకుని స్నానం అయిపోయింది గనుక తాళంతీసి 'నాకు పనిఉన్నది వెళ్ళవలె' నన్నాను. ఓ 'డజన్ట్ మేటర్—మళ్ళీ ఎప్పుడు వస్తారు!' అన్నాడు. బహుశా రాత్రివరకూ రాను. ఈవేళ ఆదివారంకదా స్నేహితులు భోజనానికి పిలిచారు' అన్నాను.

పంతులు: మాంచి ఎత్తు వేశారు!

లలిత: 'ఓ యస్ చాలా బాగుంది. ఇట్లా ఫ్రెండ్స్ పార్టీస్ మీరు అంతా ఇంగ్లీషుపద్ధతుల్ని ... అని ప్రారంభించాడు. 'అయ్యో! నాకు ఇప్పటికే ఆలస్యమైంది. వాళ్ళు కనిపెట్టుకుని ఉంటారు. లేవండి' అన్నాను. 'మీకు ఫరవా లేదు. ఎక్కడో చెప్పతే సైడ్ కారులో తీసుకువెళ్ళి-డ్రాప్ చేస్తాను' అన్నాడు. 'అక్కరలేదు ఈపక్కసందులోనే, మీరు వెళ్ళండి' అని తలుపువేసి ఆచిన్నసందులోకి తిరిగిపోయాను. వెంట పడతాడా...

[ఛట్ మని లేచి రావ్‌నీ, ఉమనీ సాంజ్ఞ చేస్తూ కిటికీదగ్గరకు పరుగెత్తి]

చూడండి, చూడండి! ఇట్లా, మీరు కనబడకుండా కిటికీచాటునుంచి

చూడండి! ఆకుర్రవాడు ఎవ్వరు?

రావు-ఉమ: అరే హేంగాడు!

లలిత: ఎవరు ఇతను?

ఉమ: వీడా? శ్యాంపినతండ్రికొడుకు. వీడే ఆవ్రాతవ్రాశాడని నా, అనుమానంకూడా. కారణాలు తరవాత చెబుతా.

లలిత: అతనితమ్ముడే! వీడిసంగతి చెప్పండి?

రావ్: నేను పొద్దున్నే ఇంకొకసంగతికూడా విన్నాను, అచ్చుఆఫీసులో. శ్యాంకీ వీడికీ ఎప్పుడూ పడదుగదా! శ్యామలరావు అన్నపేరు శ్యాం అని మారుస్తే వీడు నరసింహాం అన్నపేరును హేం అని మార్చాడు పోటీగా.........

పంతులు: ఉమామహేశం ఉమ అయినట్టు.

లలిత: పంతులుగారూ, ఉండండి ఇప్పుడుకాదు హేళన!

రావ్: నిన్నరాత్రి శ్యాం ఇంటికి వెళ్ళాక వీళ్ళిద్దరూ పోట్లాడుకున్నారట ఏకారణంచేతనో. శ్యాం వీడిని చెంప పగులగొట్టి, ఇంటిలోనుంచి గెంటివేశాడట. ఆకడుపుమంటమీదనే రాత్రిరాత్రి ఈవ్రాత వ్రాసి, తెల్లవారకుండా పత్రికఆఫీసుకు పట్టుకువెళ్ళి, ఎడిటర్‌తో మనమీద ఏవో అబద్ధాలు కల్పించిచెప్పి, ఈనాడే ఇదిపడితే అద్భుతం అని ఒప్పించి పేపరు ఆపి, అప్పటికప్పుడుకూర్చి అచ్చువేయించినాడట.

లలిత: ఇక సందేహం లేదు, వీడే చేశాడు ఇదంతా!

ఉమ: విశదంగా చెప్పండి!

లలిత: వీడు ఇదివరకు చాలాసార్లు నన్ను కనిపెడుతూ వెన్నాడడం చూశాను. ఎప్పుడూ ఎదరకుమాత్రం రాలేదు. నిన్నరాత్రి ఆఆషాఢభూతి సైడ్ కారులోనుంచి నన్ను దింపుతూవుంటే పక్కనుంచే పోతూవీడు మమ్మల్ని ఒకచూపు చూశాడు. శ్యాం వీడిని ఘట్టిగా చూశాడు. ఎందుచేతనో వీడిచూపూ, ఆనిమిషం వీడిమొహమూ నాకు బాగా జ్ఞాపకం పడి

పోయినవి. రెండుగంటలనుంచి ఇటేతచ్చాడుతున్నాడు. రెండుమూడుసార్లు గుమ్మందగ్గరగావచ్చి నన్ను చూస్తూ వెళ్ళాడు. ఒకసారి పలకరించబోయినట్టు కనబడితే నేను లోపలకు తప్పుకున్నాను.

పంతులు: ఇంకో సంగతికూడా చెబుతాను. ఈపత్రిక చూడగానే బయలుదేరి సంగతులన్నీ సి. ఐ. డీ. పనిచేసి సంగ్రహించుకొని వచ్చాను. నిన్న రాత్రి శ్యామల రావు ఇతన్ని కొట్టడానికికూడా ఈసంగతే కారణం.

లలిత: అంటే?



పంతులు: శ్యామలరావు ఇంటికి రాగానే ఈ నరసింహాన్ని పిలిచి 'ఎందుకురా, నీవు అక్కడికి వొచ్చావు, సైగా ఏమిటి అట్లా చూస్తావు? మర్యాద తెలియదా?' అన్నాడట. దానిమీద నరసింహం 'సంఘాన్ని పాడుచేస్తున్నారు ఈ ఇంగ్లండూ గింగ్లండూ తిరిగివచ్చినవాళ్ళూ, ఇంగ్లీషు చదువుకొన్నవాళ్ళూ' అని మాటలు మిగిలితే శ్యామలరావు చావగొట్టాడట.

లలిత: మరి ఇంత సంఘాన్ని ఉద్ధరించేపవిత్రుడు ఈచుట్టూ తిరగడాలేమిటి?

రావ్: అయితే లలితా, ఇట్లా తిరగడం వీడిఉద్దేశ ఏమిటంటారు?

పంతులు: అఁ! అదేమిప్రశ్న?

లలిత: వాదనలు కాదుకాని......ఎట్లాగైనా వీడికి శాస్తిచేయాలి...

[ఉమ లలితచెవిలో ఏదో చెబుతూ ఉంటాడు.]

రావ్: [మాటఅని పిలిచి పంతులుచెవిలో ఏదో చెప్తాడు.

పంతులు: అబ్బో మిమ్మల్ని చూస్తే వాడు రానేరాడు. [రావ్ పంతులూ ఏకాంతం మాట్లాడుతూ ఉంటారు ఒక నిముషం. ఇంతలో ఉమ వీళ్ళవైపు వొచ్చి, లలితతో]

ఉమ: ఇంకొక్క రెండుపద్ధలు మాట్లాడేసి మేము తప్పుకుంటాం. మీరు సిద్ధంకాండి తొందరగా!

[లలిత తెరచాటుకు వెళ్ళుతుంది]

రావు:పంతులూ: ఏమిటి సంగతి?

ఉమ: మనం తప్పుకోవాలి. ఇట్లారండి, చెబుతా! [లేస్తారు]

తెర గబగబా పడుతుంది

3

[తెరఆగుతూ లేస్తుంది. వాళ్ళు ముగ్గురూ లేరు. లలిత మార్చిన-చీరకుచ్చెళ్లు సర్దుకుని, అద్దంఎదర నిలిచి ముఖాన్ని అద్దినపౌడర్ జాగ్రత్తగా చిన్న చేతిరుమాలుతో తుడుచుకుంటూ పాడుకుంటూ ఉన్నది.]

దూరాన నారాజు కే రాయిడౌనో,
ఈరోజు నారాత లేరాలపాలో?

సీమ సీటు కనగానె సెదిరి పోతది మనసు
కౌకమ్మనే తైన కలు రంపడా రాజు! ||దూరాన||
కళ్ళ కేటో మబ్బు కమ్మినట్టుంటాది, ||దూరాన||
నిదురల్లైనా వొల్లు నీరసిస్తున్నాది! ||దూరాన||
ఆవు 'లంబా' యంటు అడలిపో తుండాయి,
గుండెల్లొ వుండుండి గుబులు బిగు లౌతాది! ||దూరాన||
తులిసెమ్మ వొరిగింది తొలిపూన పెరిగింది,
మనసులో నాబొమ్మ మసక మస కేసింది! ||దూరాన||

[పాట ముగిస్తూ, గుమ్మందగ్గరకు వెళ్ళి వీధిలోనికి చూస్తూ గడపను ఆని నిలుస్తుంది. రెండునిమిషాలు. చిరునవ్వు నవ్వుతూ లోపలకు ఒక అడుగు వేస్తుంది. ఒకతను జంకుతూ లోపలకు వస్తాడు]

లలిత: మీరు ఎవ్వరు?

అతను: మాది, కాకినాడ. నాపేరు ఎస్. వెంకటరావు.

లలిత: [తీవ్రంగా] ఎస్. వెంకటరావుగారా? ఎందుకు ఇట్లావచ్చారు?

వెంకటరావు: [ఒక్క-క్షణం తెల్లబోయి, సర్దుకుని] మరేమీ లేదు. నేను కలెక్టర్ ఆఫీసులో గుమాస్తాను. మొన్ననే ఇక్కడకు బదిలీ చేశారు. నా భార్యకు ఇంగ్లీషు చెప్పించడానికి దర్యాప్తుచేస్తే మీరు బాగా చెబుతారని ఎవ్వరో అన్నారు. అందుకని అడగడానికి వచ్చాను.

లలిత: [హేళనగా అన్నట్టు] అట్లాగా! ఎస్. వెంకటరావుగారూ, మీరు ఇంత చిన్నవయస్సులోనే ఉద్యోగంలో ప్రవేశించడమే కాకుండా ఇంత కుటుంబబాధ్యత పూనుకోవడం చాలా ఆశ్చర్యంగా ఉంది!

వెంకటరావు: [వెలవెలబోతూ] ఆఁ, దాని కేమిటిలెండి! [ఆమెకేసి చూస్తాడు]

లలిత: [చిరునవ్వుతూ] వెంకటరావుగారూ! మీరు బొత్తిగా భయస్థులులా గున్నారు. ఈమాత్రానికి లోపలకు రావడానికి అంత తటపటాయించి తిరిగారు ఎందుకండి? ఈసంగతి అని తెలిస్తే నేనే పిలిచిఉందును.

వెంకటరావు: [అనుమానిస్తూ] అబ్బే! ఏమీలేదు. మీతో ఎవరైనా మాట్లాడుతున్నారేమో, అట్లా అయితే బాగుండదు కదా అని అనుమానించాను.

లలిత: ఈవిషయానికి ఇంత అనుమానం ఎందుకండి, వెంకటరావుగారూ [ఆగి] మీయిల్లు ఎక్కడండి?

వెంకటరావు: [తెల్లబోయి సర్దుకుని] ఈఊరు నాకుకొత్త. అక్కడ ఎక్కడనో పేటలో ఉన్నాము.

లలిత: ఓహో మీరు మొన్ననేగా ఈవూరువస్తా. ఇంకా అనవాళ్ళు తెలియవు. మీకు సంగీతంలో ఏమైనా ప్రవేశం ఉన్నదా?

వెంకటరావు: నాకు అంతఅదృష్టం లేదండి.

లలిత: అవ్వ సంగీతం పెద్దఅదృష్టమూ ఏమిటి? కాని ముఖంచూస్తే పాడగలరు అనిపించింది.

వెంకటరావు: [చనువుగా] మీకు సాముద్రికం తెలుసునా?

లలిత: [నవ్వుతూ] ఇప్పుడు చెప్పను నిలకడమీద మీకే తెలుస్తుంది.

వెంకటరావు: [చేయిచాపి] అయితే దయచేసి చేయి చూడండి.

లలిత: పరిచయం అయింది కనుక ఇంకెప్పుడైనా చూస్తాను, దానికి వేళలున్నాయి. మీభార్య పాడతారా?

వెంకటరావు: ఏదో ఒకమోస్తరు.

లలిత: భర్తలు భార్యల్ని మెచ్చరులెండి. అది పొరుగింటి పుల్లకూర కాదు. సరేగాని మీకూ, మీభార్యకూ సంగీతం చెబుతాను, నేర్చుకో రాదూ?

వెంకటరావు: నాభార్యను కనుక్కొని చెబుతాను.

లలిత: నాకు చాలా సంతోషంగా ఉన్నది. పోనీ, మీరు చదువుకున్నందుకు స్త్రీలకు ఆమాత్రం స్వాతంత్ర్యాన్ని ఇచ్చారు. మీరు సంస్కారవాదులేగా!

వెంకటరావు: స్త్రీలకుకూడా పురుషులతో సమానమైన హక్కులు ఉండవలెననే నా అభిప్రాయం.

లలిత: స్త్రీలు పురుషులతో సమంగా ప్రవర్తించడమూ, స్త్రీలూ పురుషులూ స్నేహితులైనవారు, కలిసి షికారులు వెళ్ళడమూ మీరు ఏమంటారు?

వెంకటరావు: [ఒక్కక్షణం ఆలోచించి] తప్పకుండా వెళ్ళవలసినదే? తప్పేముంది దానిలో?

లలిత: ఈరోజు పత్రిక చూశారా?

వెంకటరావు: ఏపత్రిక?

లలిత: ఓహో! మరిచిపోయాను, మీరు కొత్తగా ఈఊరికి. ఈఊరిలో ఒక పత్రిక ఉన్నది లెండి.

వెంకటరావు: నాకు పత్రికలు చూడడం అలవాటు లేదండి.

లలిత: [అతనిని కనిపెట్టినట్లుగా] ఈరోజు పత్రికలో ఎవ్వడో గాడిద నన్ను ఉద్దేశించి అబద్ధపుమాటలన్నీ వ్రాశాడు.

వెంకటరావు: ఎందుకు?

లలిత: స్త్రీలు పురుషులతో షికారులు బయలుదేరడం సంసారలక్షణం కాదనీ, ఇటువంటి స్త్రీలు తయారైతే చక్కని హిందూసంఘంకూడా పాశ్చాత్యసంఘాలవలె శీలంలేని స్త్రీలతో నిండిపోతుందనీ చాలా వ్రాశాడు.

వెంకటరావు: ఏడిశాడు. ఎవడో గిట్టనివాడు వ్రాసిఉంటాడు. పాశ్చాత్యం అన్నదానినంతా తిట్టేజాతి ఒకటి ఉన్నదిలెండి.

లలిత: బలవంతంగా నొక్కిపెట్టి ఉంచితే నిలిచే శీలం ఏంశీలం చెప్పండి? స్వాతంత్ర్యం ఉన్నంతమాత్రాన శీలం నిలుపుకోలేనిది ఎంత మాత్రపుశీలం?

వెంకటరావు: మహాబాగా అన్నారు.

లలిత: అట్లా షికారు వెళ్లడం తప్పు అంటారా?

వెంకటరావు: తప్పేముంది? పైగా ఆరోగ్యంకూడా.

లలిత: అయితే, ఈసాయంత్రం మీరూ షికారు వస్తారా మాతో? ఇంకా కొందరు స్నేహితులుకూడా వస్తారు లెండి.

వెంకటరావు: ఈరోజుకి క్షమించాలి. ఇంక ఎప్పుడైనా తప్పకుండా వస్తాను. కొత్త కావడంవల్ల ఇంటివద్ద పనులున్నవి. మావాళ్లు అవస్థ పడతారు.

లలిత: పోనీ మీయింటికి వెళదామా? మీభార్యను నాకు పరిచయం చేస్తురు గాని.

వెంకటరావు: నాభార్యను ఇంకా తీసుకు రాలేదండి. నేను ఒక్కణ్ణే ముందుగా వచ్చాను.

లలిత: [ఏమీ ఎరగనట్టు] మీకు భార్య అంటే ఎంతశ్రద్ధండీ! ఆమె రాకుండానే చదువుఏర్పాటులు కనుక్కుంటున్నారు. మగవాళ్లంటే అలా ఉండాలి!

వెంకటరావు: దానికేమి గాని, నేను బయలుదేరి వచ్చేటప్పుడు ముందు

తనచదువు ఏర్పాటులు చేయమని మరీ మరీ చెప్పింది.

లలిత: అయినా అంతశ్రద్ధ ఉన్నభర్తలు మనలో కష్టం. మీరు హోటేల్‌లో భోజనం చేస్తున్నారా?

వెంకటరావు: ఔనండి!

లలిత: పోనీ ఇవాళ రాత్రి ఇక్కడ భోజనం చేస్తురు గాని.

వెంకటరావు: సంతోషం అలాగే, మళ్లీ వస్తాను.

లలిత: ఏమీ అంత తొందర పడుతున్నారు?

వెంకటరావు: ఏమీలేదు, మీస్నేహితులు వచ్చేవేళ అయినదేమో...

లలిత: ఫరవాలేదు, వొచ్చేస్నేహితులు ఎవ్వరూలేరు. ఆయన ఎవ్వరో నిన్ననే పరిచయం అయినారు, శ్యాంఅట ఆయనపేరు, ఆయనమాత్రం తప్పకుండా వస్తారనుకుంటున్నా షికారుకి... [వెంకటరావు లేవబోతాడు] తొందరలేదు. ఆయనైనా ఇంకా రెండుగంటలవరకూ రారులెండి; వొచ్చినా షికారు వెళ్ళదలచుకోలేదు. కొంచెంసేపు ఉండండి. మీరు ఇంటికి అద్దె ఎంతఇస్తున్నారు?

వెంకటరావు: పదిహేను రూపాయలు.

లలిత: మీకు జీతంఎంత? మరిచిపోయాను.

వెంకటరావు: నలభై.

లలిత: అబ్బా, చాలాఎక్కువఅద్దె ఇస్తున్నారు ఆజీతానికి. అయినా ఈఊరిలో అద్దెలు మహా ఎక్కువలెండి. ఈభాగం చూడండి. ఈకొస్తకూ నేను ఏడురూపాయలు ఇస్తున్నాను. ఇల్లు కాస్త, చూడండి, ఇట్లా రాండి! [లేచి తెరను పూర్తిగా వెనుకకు జరిపివేస్తుంది. తెరవెనక ఉత్తరపు గోడను ఆని చిన్నబల్లా దానిమీద పూలసజ్జ, దానినిఆని మంచం కలం కారీదుప్పటి పరిచివుంటుంది. ఇవతల మూలను ఇంకొకబల్లమీద స్టౌవ్‌లు ఉంటవి. గది అంతా నీటుగా తుంగచాపలు పరిచిఉంటవి. అవతలిగోడ మధ్యను స్నానాలగది తలుపునూసి ఉంటుంది.]

చూడండి ఇదీ ఇల్లంతా, రాండి లోపలికి!

[మంచందగ్గరకు వస్తాడు]

[నటనగా] అయ్యో, మరిచిపోయాను మీ మాటలలో. కూచోండి. కాఫీ పుచ్చుకుందాం?

వెంకటరావు: నేను ఇందాకనే పుచ్చుకున్నాను. మీరు తీసుకోండి.

లలిత: అదేమి మర్యాదండి? మీరు పుచ్చుకొని తీరాలి. కాఫీ నేను చాలా బాగా చేస్తాను. ఒకసారి రుచి చూస్తే కాఫీకోసమైనా మీరు మాస్నేహం ఆశించవలసి ఉంటుంది. కూర్చోండీ, ఆమంచంమీదను; ఇంకా ఇంత మొహమాటమైతే ఎలాగండీ!

[చేయి పట్టుకొని చనువుగా కూర్చోబెడుతుంది. ఆయన వింతగా చూస్తాడు. కాఫీకప్పు అందించి తానూ అతనిని చూస్తూ తాగుతుంది.]

ఎట్లా ఉన్నదండీ కాఫీ?

వెంకటరావు: ఇంత మజా అయిన కాఫీ ఈ జన్మలో ఇంతవరకూ రుచి చూడలేదంటే నమ్మండీ!

లలిత: [చిరునవ్వుతో] అయితే కాఫీకోసమైనా తరుచు ఇక్కడకు వస్తారా?

వెంకటరావు: తప్పకుండా!

లలిత: అయితే ఒట్టు వేయండి!

[చాపినచేతిలో చేయి వేస్తాడు. వెంటనే చేయి తీసి చెంపను చిట్టిదెబ్బ కొడుతుంది. చేయి పట్టుకోబోతాడు. సర్రు మని లాగి తప్పుకుని]

లలిత: ఆగండి. తాంబూలం మరిచిపోయాను. [రెండుకిళ్ళీలు తెచ్చి ఒకటి ఇవ్వబోతుంది]

వెంకటరావు: [ఆప్యాయంగా కళ్లు కదుపుతూ] ముందు మీరు...

లలిత: అబ్బో! స్త్రీ స్వాతంత్ర్యాభిలాషులుగా మీరు!

[అంటూ తాను ఒకకిళ్ళీ వేసుకుంటుంది. వెంకటరావు లేచి చేయి పట్టుకో

బోతాడు.]

లలిత: ఆగండి!

[కిళ్ళీ తొందరగా ఒక బుగ్గను తోసివేసి]

అబ్బో! మీకూ ఆగడం ఎక్కువే!

వెంకటరావు: మీకూ అంటే?

లలిత: అంటేనా, అంకను పుట్టినవన్నీ ఏ మాటవి?

వెంకటరావు: [తగిలి] నాకు అర్థంకావడం లేదు.

లలిత: లేదా! పోనీ కాని కోటు ఇంకా ఎందుకు? తీసి వేద్దురూ!

వెంకటరావు: ఎందుకు?

లలిత: ఎందుకైతే నేమి! స్నేహితురాలిని అడిగాను. [ఆప్యాయంగా] తీయండి! [తీస్తాడు] ఇలా ఇవ్వండి! [పుచ్చుకొని మేకునకు తగిలించి నవ్వుతూ] కలెక్టరుఆఫీస్ గుమస్తా వెంకటరావు ఆకోటుతో ఆమేకున వేలాడుతున్నారు కనుక మీరు ఎవ్వరో నిజంచెప్పరూ?

వెంకటరావు: [వెలవెలబోతూ] ఇదంతా నాకు అర్థం కావడము లేదు?

లలిత: ఇంకా విప్పి చెప్పనా? నీవు వెంకటరావూ కాదు, గింకటరావూ కాదూ. సత్యాన్ని బయటపెట్టనా?

[గడ్డం పట్టి ఆడించింది] మా మరిదివి! [నోరు తెరిచి ఏదో అనబోతే నోట్లో కిళ్ళీ కుక్కి— వేస్తుంది. చేయి పట్టుకోబోతే తప్పించుకొని, దూరంగా వెళ్ళి చేతితో ఆజ్ఞాపిస్తూ] నాకు నీవు కొన్ని వాగ్దానాలు చేయాలి హేం!

హేం: [నొసటి చెమటను తుడుచుకుంటూ] అరే! నా పేరుకూడా తెలుసునా!

లలిత: నా సాముద్రికం అంటే ఏమనుకున్నావు మరి? దాని కేం గాని, నేను నీకు అర్థం కావడం లేదు? అర్థం తెలియ జేస్తాను గాని ఇప్పుడే, ఎప్పటికీ స్నేహంగానే ఉంటానని ప్రమాణం చేయి!

హేం: అలాగే ఉంటాను.

లలిత: స్త్రీలూ పురుషులలాగే స్వతంత్రులుగా స్నేహంగా ఉండవచ్చునని నీవూ ఒప్పుకున్నావు కదా! మరి ఈస్నేహాన్ని సంఘం అపనవ్యంగా చూసి తీరుతుంది. మనలను గురించి అడవ్వాగుడు వాగుతుంది, అసహ్యంగా మాతలు కూస్తుంది. లక్ష్యపెట్టకుండా ఉంటావా మరి?

హేం: ఎందుకు లక్ష్యపెట్టాలి? ఎప్పటికీ లక్ష్యపెట్టను!

లలిత: అదీ ధీరుడు అంటే! ఇంకొకటి మరి. మరి నేను ఉత్తటక్కరిని. అంతే అని నీకు ఆశాభంగ మయితే?

[హేం బిక్కచూపు చూస్తాడు దగ్గరగా వోస్తూ] అయితే గియితే, మరి 'స్నేహంగానే ఉంటాను' అనీ 'స్త్రీలు స్వతంత్రంగా ఉంటే ప్రపంచం అనుమానించి తీరుతుంది! అయినా అంతమాత్రాన నేను చెడ్డగా యెంచను' అని ప్రమాణం చెయ్యి!

హేం: [విసుకుగా] ఏమిటి ఇదంతా? పొద్దున్న పత్రికలో ఎవడో వ్రాసినవ్రాతలు ఏకరువు పెడుతున్నావు?...

లలిత: [మీదకు వెళ్తూ] ఇదంతా తెలియదేం పాపం!

[దవడమీద చిన్నదెబ్బ కొడుతుంది. చేయి పట్టుకోబోతే జారి గిరుక్కుమని తిరిగి మంచంచివర గోడను ఉన్న తలుపులను ఆనుకొని నిలబడుతుంది. వరుగున వచ్చి పట్టుకోబోతున్న హేంని శాసిస్తూ]

లలిత: తొందర పడకు ఆగు మరి. ఇంకొక్కమాటమాత్రం ప్రమాణం చెయ్యి, తరువాత నీదగ్గర నేను ఏ మన్నా దాపరికం చేస్తా నేమో చూడు.

హేం: [ఆగి ఆలోచించి] సరే!

లలిత: 'స్వంతంత్రాభిలాషుల మైన మనం స్వచ్ఛందంగా ప్రవర్తిస్తాము. ప్రపంచం అన్యాయంగా కారులు కూస్తే ఊరికే భయపడేవాళ్ళం కాము' అని సత్యప్రమాణం చేసి నా చేతిలో చేయి వెయ్యి!

హేం: ఏమిటి ఇదంతా?

లలిత: ఏ దైతే నేమి? నాకు ఇచ్చిన చనువు కొద్దీ ఈ మాత్రం శాసించ

కూడదా! ఇంతేనా...

హేం: సరే అలాగే!

లలిత: అలాగే అంటే చాలదు. నేను అన్నట్టు చెప్పు! నా సత్య ప్రమాణకంగా—

హేం: నా సత్యప్రమాణకంగా—

లలిత: స్వతంత్రాన్ని అభిలషించినందుకు—

హేం: స్వతంత్రాన్ని అభిలషించినందుకు—

లలిత: సంఘం కొరుకూతలు కూస్తే. [చేయి చాపుతుంది]

హేం: సంఘం కొరుకూతలు కూస్తే.

లలిత: భయపడే చచ్చులం కాము.

హేం: భయపడే చచ్చులం కాము.

[అంటూ లలిత చేతిలో చేయి వేయబోతాడు. లలిత భట్ మని తలుపులను వీపుతో నెట్టిలోపలకు జారుతుంది. ఒక్కసారి లోపలనుంచి 'భయపడే చచ్చులం కాము' అంటూ మూడుచేతులు అతని చేతికిందకు వస్తవి. హేం ఉల్కి గతుక్కు మని ఒక అడుగు వెనకకు వేసి వీధివైపు తిరుగుతాడు. శ్యాం అప్పుడే గుమ్మం దాటి లోపల అడుగు పెట్టి ఆగిపోయి హేంని చూసి కళ్ళు ఎర్రజేసేప్పటికి, గదిలోనుంచి పెద్దనవ్వు నవ్వుతూ రావ్, ఉమ, పంతులు, లలిత వస్తారు.]

శ్యాం: [ఇది చూసి బిత్తరపోయి] డేమిట్! [వెనుకకు తిరుగుతాడు]

[తెర పిడుగువలె పడుతుంది]



# ప్రభు వాక్యము

## శ్రీ శివ శంకర శాస్త్రి

~ పాత్రలు ~

ప్రతీహారి

మహామాత్యుడు

రూపాంబిక......కాంచీ రాజకుమారి

పురుషోత్తమ దేవుడు...ఉత్కాల మహారాజు

### ప్రథమ రంగము

నీలాచల క్షేత్రము : మహామాత్య భవనము

ప్రతీహారి:

జయము, జయము, మహామాత్యసత్తములకు! పాదదాసి
అధికభక్తితో ప్రణామ మాచరించి విజ్ఞాపన
సవినయముగ చేయ నున్నది!

మహామాత్యుడు :

ఇపుడు వచ్చితి వేమి? ఈతొట్రుపా టేమి?
ఆకస్మికమ్ముగా అహిత ముదయించెనా?

ప్ర తీ హా రి:

అనుకంప వహించి హఠాదాగమనము క్షమియింపుడు!
కాంచీ రాజకుమారిక గాఢశోకతప్తురాలు
దర్శనార్థ మరుగుదెంచి ద్వారముకడ నిలుచున్నది
అనతి యగునేని యామె నాహ్వానించెద లోనికి.

మ హా మా త్యు డు:

ఎల చెప్పుగ జైతి వీమాట తొలుదొల్త?
కాంచీకుమారి, రా గద వమ్మ లోపలికి!

ప్ర తీ హా రి:

చేయక తప్పద పెండిలి శ్రీమద్రాజకుమారికి
ఈనాడే? కొంతకాల మెట్టులైన గడచు నెడల
ప్రభునకు కనికరము గలిగి పట్టుదల త్యజించు నేమొ!

మ హా మా త్యు డు:

ఉత్కలేశ్వరుడు తా నొసగి యానతి తొలుత
అన్యథా చేసెనా అవల నెన్నడుగాని!
కనికరమ్ము జనింప కారణం బీనాడు
కలిగనా అకస్మికమ్ముగా నేడేని?

ప్ర తీ హా రి:

కాలము గడ చినకొలదిని కరగవచ్చు ప్రభుమనసు;
దర్శన మొసగిన పిమ్మట దయసైతము కలుగవచ్చు
దనమున కైనగాక దయ చూపుట కైనగాని
గల్గి ధవులు సమర్థులు!

మ హా మా త్యు డు:

పురుషోత్తమదేవ మహాభూమిపతి యద్వితీయు
చండశాసనుం! డానతి జనులకు సుగ్రీవాజ్ఞయౌ!
కాంచీనాయకులు తిరస్కారము సూచించినార
లస్మత్ప్రభునకు: కావున ఆగ్రహించినాడు రేడు.

రూ పాం బి క:

ఒకమాట మాత్రాన ఉత్కలేశ్వరు డింత
కోపిష్ఠ మూనదగునా—ఎందైన
కార్య మిట్టిది కంటిమా?
మాట అన్నందుకే మారాజ్యము జయించి
సాధించి వచ్చేగాదా!—ఇకనైన
శపథమ్ము విడువ రాదా?
మాతండ్రి తన నేమొ మాట అన్నా డనుచు
నను బట్టుకొని వచ్చునా!—ఇది మీరు
న్యాయ మనుకో వచ్చునా!

మ హా మా త్యు డు:

ప్రభువు కఠినుడు కాడు, పరమ కారుణికుండు
సరసుండు, శర ణన్న శత్రువున్ క్షమియించు
చండశాసను డయ్యు, శత్రుభీకరు డయ్యు!
మనుజనాయకు లెల్ల మాటపట్టింపుచే
ఎంత లెంతలో చేతు; రిది క్షత్రియులరీతి.
ఉత్తమక్షత్రియుం డుత్కలేశ్వరుడు నీ
మీది ప్రేముడిచేత మీతండ్రి వర్తింప,
గౌరవ స్తుతడు సంతోషపూర్వకముగా

నిను సమర్పించి పాణిగ్రహణోత్సవం
బొనరింప వలె ననుట యుక్తమౌనా కాద?
నీతండ్రి అటు చేయనేరక తత్కాలనేత
క్షత్రియుండే యైన సమ్మార్జకుం డనియు
తనకులము స్వచ్ఛ మని తనను నీవు నటంచు
అవహేళనము చేయు టనుచితం బన వేల?

రూపాంబిక:

సమ్మార్జకుం డంట చాలదోషమే! కాన
అన్నమాటకు ఫలం బనుభవించెను కాద
మాతండ్రి!
జనకుమాటకు తనూజాత నిటు శిక్షింప,
మీవంటి సజ్జనుల్ మెచ్చుకో దగినదా
సెల వీందు!

మహామాత్యుడు:

పితరుల మాటకు బిడ్డలు బాధలు
పడుదురు తల్లీ! ప్రపంచకములో.
అందులకే మాయవనీధవు డనె
సమ్మార్జకునకు జాయ వగుదు వని.
ఇది న్యాయం బని యెట్లందుము! మరి
జనపతి మాత్రము చండశాసనుడు!

రూపాంబిక:

తనయెడ భక్తియు తాత్పర్యము గల
అబలమీదనా ఆగ్రహ మూనుట!
నిజముగ నాపై నెనరే లేదాదిని

ఉత్కలేశ్వరున కున్న పక్షమున
కైవస మగు మా కాంచీపురిలో
పెండ్లి యాడడా పృథివీపతి నను?

మహామాత్యుడు:

ఉండెను తల్లీ, ఉత్కలేశునకు
నీయెడ ప్రేముడి నిండుగ నాడిని.
సౌందర్యంబును సద్గుణవర్ణన
మాలకించి రేడనురక్తుండయె
విన్న గూర్చియే నిరతము నాతో
సంభాషించెను చాలదినంబులు.

రూపాంబిక:

అంత ప్రేమ మంతలోనె అంతరించిపోయె నెట్లు!
అనురాగమునకన్న నృపతి కభిమానమె ముఖ్యమాయె.

ప్రతీహారి:

ప్రభుపాదంబులపై బడి ప్రార్థించిన లాభమేమొ
మనసు కరగదా రేనికి మగువదీనవాక్కు విన్న?

రూపాంబిక:

కనికరమున నృపతి నన్ను కన్నియగా విడుచునేని
ఏకామ్రేశ్వరు గొల్చుచు నీజన్మము గడపుదాని!

మహామాత్యుడు:

త్వరలో అన్నాడు గాని తప్పదు రాజాజ్ఞ తల్లి!
నీ వెరుగవు రేడెంతటి నిశ్చలుండో మాటపట్ల.

రూపాంబిక:

కన్యగా జన్మంబు గడప వీలే లేద?
ఏమార్గమున కేను జాయ కావలయు నా!
అక్కటకటా! ఎంతయన్యాయ మన్యాయము!
మాత్మహత్యకుగూడ ఆయుధము లేదాయె!
కంచి కామాక్షమ్మ కరుణించదా నన్ను!
ఏకామ్రనాధునకు నేమి దయ కలుగదా!
కైలాసనాధునకు కారుణ్యమే లేద!
కాంచీకుమారి కీగతి పట్టవలసినద!

మహామాత్యుడు:

ఏడ్వ కమ్మా! ఇవ్వ డేమి చేయుదు నేను?
దుఃఖ మెరుగుదు, నాకు దుహిత లున్నా రమ్మ!
ప్రభు వుంచినాడు నీ పరిణయము కావించు
ప్రబల భారమ్ము నాపైన రాజకుమారి!

రూపాంబిక:

ఈయాపదనుండి నన్ను నెట్టులైన రక్షింపుడు
తండ్రి, ఈ దీనను మీతనయనుగా భావింపుడు!
ప్రణమిల్లితి తావకీన పాదాంభోరుహములపై
అభయ మిచ్చువరకు తండ్రీ, అడుగులు విడువంజాలను!
బ్రాహ్మణపుంగవు లఖిలప్రజ్ఞలు మీకరగతములు!
కనికర ముదయించిన నను కాపాడుట సుకరం బగు!
అలోదధ సేయునెడల ఆపద తప్పించుటకై
మహామంత్రులైన మీకు మార్గము దొరకక పోవునె?
దుర్గతి యదృష్టవశమున తొలగిపోవునేని శ్రేయం

అమరణము మీకు కృతజ్ఞురాలనుగా నుందు తండ్రీ!
రక్షింపుడు, రక్షింపుడు, రాజకుమారిక యేగతి
సమ్మార్జకునకు అయ్యో! బాగుగ జీవింపగలదు!

మహామాత్యుడు :

ఏడువకమ్మా! ఏడువకు!
పెద్దభారమే పెట్టితి వమ్మా!
కాని చూతము కాగల దేదో.
ఉర్వీపతి పురుషోత్తమ దేవుడు
కఠిన మానవుడు కాడు కుమారీ!
అది ధైర్యంబున కాధారం బగు.

* *

దుస్సాధమే యైన తోచుచున్నది యొకటి,
నీకు ద్వేషము లేదు నృపతియెడ నని తలతు.
శీఘ్రకాలములోనె శ్రీమజ్జగన్నాథు
కారుణ్యమున నీకు కల్యాణ మగుగాక!

## ద్వితీయ రంగము

పురుషోత్తమదేవ మహారాజు జగన్నాథాలయములో
సువర్ణసమ్మార్జనితో నూడ్చుచుండును.

మహామాత్యుడు:

మహాప్రభూ, జయము జయము!

మహారాజు:

మహామాత్యా, వందనంబు!

మహామాత్యుడు:

స్వామిసేవయందు ప్రభువు చాల మగ్నులైనవారు.

మహారాజు:

ఎల్లవారు సేవకులే యీమహాప్రభునియెదుట!
గౌడకో కళింగమునకో కాంచికో ఉత్కళమునకో
స్వల్పభాగములకు ప్రభులు చాలమంది కలరు. కాని
సర్వలోకములకు ప్రభువు జగన్నాథదేవు డొకడే!

మహామాత్యుడు:

తమకు గల్గుభావ మితరధరణీపతుల కుండునేని,
ఈలోకము స్వర్గముగా ఎన్నండో మారియుండు.

మహారాజు:

స్వామిసేవలోన నెంతో సౌఖ్యమున్న, దీధరణీ
పాలనమ్మువలన నాకు ప్రతిదినమ్ము జగన్నాథ
సేవకైంకర్యమునకు తెరపి లేదు మహామాత్యా!

మహామాత్యుడు :

నడచు ధర్మదేవత తన నాలుగుపాదాలతోడ
ఈయుత్కలరాష్ట్రమందు నేలికగా నుండ తమరు!

మహారాజు:

పరశురామాది మహాబ్రాహ్మణవీరులు పూర్వము
పృథ్విని యెల్ల గెలిచి, పుట్టిపెల్లవోలె, నిర్మములై
దానమిచ్చి ముదముతోడ తపమునకై వెడలినారు.
ఈకలికాలపరిభాన మేమి చెప్ప! నించుకంత
మహిం నేలెడిరాజా లెంతో మదించి వర్తింతు రవుర!

మహామాత్యుడు :

కావుననే రాజర్షులు కావలె ధరణీకాంతులు.

మహారాజు:

ఏడాదికి నొక్కనాడు ఈనీలాచల తీర్థ
ప్రభు జగన్నాథాలయ ప్రాంగణపవిత్రభూమిని
గొప్ప లుజ్జగించి అన్నికులములవా రధికభక్తి—
సర్వమునే జగన్నాథ మన్న పరసూక్తి కనుగుణముగ—
ప్రసాదంబు స్వీకరించి పవిత్రు లగుచున్నవారు!
ఎంత పూతవాసరంబు! ఎంత శుభదవాసరంబు!

మహామాత్యుడు :

శ్రీమజ్జగన్నాథ సేవానురక్తు లౌ
దేవరవారికీ దివ్యపరిదేశాన
క్రొత్తకానుక నొసగ గొనివచ్చి యున్నాను.
భూసురాశీర్వాద పూర్వకంబుగ దేవ!
శ్రీసన్నిధానాన స్వీకరింపగ వలయు.

మ హా రా జు:

మా వృద్ధికాంక్షించు మంత్రివర్యులు మీరు
బ్రాహ్మణోత్తములు, మీపల్కు లాదరముతో
శిరసా వహించి నే స్వీకరించితి కాన్క!

మ హా మా త్యు డు :

[సంజ్ఞచే సమీపించిన రూపాంబికను నిర్దేశించును.
ఆమె మేలిముసుగు తొలగించి వినత యగును.]

తమయెడ భక్తితాత్పర్యముల్ కలిగి
రాణికి నుచిత వరారమణీయసకల
శుభలక్షణాలతో శోభిలు కన్య
నాదరింపుం డుత్కలావనీరమణ!

మ హా రా జు:

కనకంపుబొమ్మయో కానుక యనుచు
భావింపనైతిని: ప్రేమదంబు! కాని
ఇంచుక వివరింపు డెవ్వ రీకన్య?

మ హా మా త్యు డు :

కాంచీకుమారి యీకన్యాలలామ
ముత్కలేశ్వర సేవనోద్రిక్తహృదయ.

మ హా రా జు:

కనుకనే మా యాజ్ఞప్తికి విపరీతముగా మీరలు
చేయుదలచినారు: మిగుల చిత్రముగా నున్న దార్య!
ఈమెను సమ్మార్జకునకు నిచ్చి వివాహము చేయగ
మనక నాజ్ఞ యొసగినాము: విస్మరించినారో దాని?

మ హా మా త్యు డు :

మహాప్రభూ, తమయానతి మరవగ నెవ్వారితరము!
ప్రభువాక్య మ్మతిశ్రద్ధ పాలింపగ వచ్చినాను.
ఆడినవాక్యము లేనా దధిపశ్రేష్ఠులు తప్పరు.

మ హా రా జు :

అధిపతి యిచ్చినయానతి. నన్యథా చేయరాదు.

మ హా మా త్యు డు :

చిత్తము! కావున దేవర స్వీకరించి తీరవలయు
కాంచీరాజకుమారిని, కాపాడుకొన ప్రతిజ్ఞ!
స్వర్ణదండమండిత మాసమ్మార్జనితో దేవర
స్వామియూడిగంబు సేయు సమయము కాదా యియ్యెడ?

మ హా రా జు :

[చేతులు జోడించి చిరునగవుతో]

మహనీయము భూదేవామాత్యబుద్ధి కౌశలమ్ము!

మ హా మా త్యు డు :

మహాప్రభువు సరసహృదియె
మహనీయము! మహనీయము!

మ హా రా జు :

కాంచీరాజకుమారిని గౌరవమ్ముతో సువర్ణ
పల్యంకిక గొనిపోవుడు ప్రాసాదమునకు వేగమె.

[ప్రజల హర్ష ధ్వనులు]

మహామాంత్యుడు:

శ్రీ పురుషోత్తమ దేవ
క్షితిపాలాగ్రణికి జయము!

[చేతులు జోడించి]

జగన్నాధ మహాస్వామికి
జయము, జయము, జయము, జయము!

[హర్షధ్వానములు]

౧౯౩౮



# సౌందర్యోపాసి

## శ్రీకృత్తివాస తీర్థులు

[ ౧ ]

[బౌద్ధమఠం అంతిమదశ-నలందాలో బౌద్ధసంఘం. రాత్రి పదిగంటలు కొడతారు. సంఘద్వారందగ్గర పారిపోతున్న యువకభిక్కును పహారా వాడు పట్టుకొంటాడు. వెన్నెల్లో నిలబడి, చిరునవ్వు ముఖంలో ఉట్టిపడ, పహారావాడితో భిక్కు ప్రసంగం చేస్తాడు. భిక్కు సన్నముగా పొడవుగా పచ్చగా ఉంటాడు: స్ఫురద్రూపి.]

పహారా: ఎక్కడికి పోవడం? భిక్కూ

భిక్కు: ఎక్కడికయితే నేమి?

పహారా: ఈ రాత్రివేళ మఠం వదలి నగరంలోకి వెళ్ళకూడదు. నువ్వు చేసేపని సంఘధర్మాలకు, వినయానికి విరుద్ధం.

భిక్కు: ఈ వినయధర్మాలవల్ల మాజీవితాలు ఎండిపోయిన బెండుముక్కలై పోతున్నాయి. చివరకు సంఘద్వారందగ్గర పహారావాడుకూడా ధర్మమే ప్రబోధం చెయ్యడం ఆశ్చర్యం!

పహారా: ధర్మం కాదూ మన జీవనసారం!

భిక్కు: ఆమాట చెప్పకు. అహోరాత్రాలు 'అభిధమ్మం' చేత్తో పుచ్చుకుని తదేకదీక్షతో 'తథాగతుణ్ణి' ధ్యానిస్తూ కూర్చోలేను.

పహారా: ధర్మంమీద ఏమిటీ తిరుగుబాటు?

భిక్కు: అవును. అసహజంగా వున్న ధర్మంమీద తిరుగుబాటే. ఇనుపపెట్టెవంటి మఠంలో శరీరం శుష్కింపచేసుకొని, హృదయాన్ని 'తుంచి వెయ్యలేను.

పహారా: మఠాధిపతి ఎన్నిసార్లు చెప్పినా పెడచెవిని పెడతావు. ఎవ్వడూ చేతులో కుంచెలు, గైరికాది ధాతువులు, వర్ణికలూ వదిలెయ్య మంటే వదలిపెట్టవు గద.

భిక్షు: రంగులూ రూపం వదిలెయ్యను. ప్రాణాలయినా తృణప్రాయం. చేతులో కుంచెలు, వర్ణికలు వదలను. మొన్న అభిధమ్మ పిటకం తిరగేస్తూ తలదిమ్ము వచ్చి ఖాళీ వున్నచోటల్లా అందమైన బొమ్మలు గీశాను.

పహారా: శాంతం పాపం. శాంతం పాపం. ధర్మగ్రంథంలో చిత్రాలు చిత్రించడం పరమదూష్యం భిక్షూ!

భిక్షు: ఆకాశంలో మెరిసే రంగులూ రేఖలూ, దివ్య తూలికా కూడా దూష్యమే. చేతనయితే ఆకాశంలో చిత్రవర్ణాలు చెరిపివెయ్యి.

పహారా: అంతా కర్మ. మఠాయతనంలో చిత్రకారుడు చేరడంవల్ల ఇంతవిప్లవం వచ్చింది.

భిక్షు: మా జీవితం తిరుగుబాటే. అంధకారమయం ఈ మఠాయతనం. సాలిగూళ్ళు బాగా పెనవేసుకొన్నాయి. వెలుగంటే భరించలేదు. బూజు పట్టి వెలుతురులేని సాలిగూళ్ళల్లో మా చిత్రకారుల జీవితాలు ధూళిపాలు చెయ్యలేం! చెయ్యలేం! బలమైనసమ్మెటపోటులతో బంధాలు కొట్టి పారేస్తాం. స్వేచ్ఛ మా ప్రాణవాయువు. అలంకారం, అందం మాకు ప్రాణాలు.

పహారా: నీ మాటలు ధర్మగ్రంథాల్లో గోచరం కావు.

భిక్షు: మీకు సహజమైన నేత్రాలు లేవు: గ్రంథచక్షువులు. ఎండిపోయిన శరీరం. ఎముకలపోగులు, చీకట్లు, శూన్యం— ఇవి మీతల్లకెక్కేవి! అబ్బ ఈ మఠంలో కూర్చోలేను. నగరంలో రమణీయ ప్రాసాదోపవనాలు తిలకించాలి. నీలాకాశంలో తారలు చూడాలి. మల్లెపువ్వుల్లాంటి సొగసైన ఘాటయిన వెన్నెల అనుభవించనియ్యరు. పన్నీటి తుషారంలా మిన్నేటి తుంపురుల్లా చల్లదనం ఇచ్చే ఈ పాలవెన్నెల

మతాయతనంలోకి ప్రసరించనీయరు. కిటికీలు అసలే లేవు.

పహారా: ఎన్నాళ్ళుంటుంది వెన్నెల? మన జీవితాలు జగచ్చక్రంలో ఆకులు.

భిక్షు: అంతా క్షణికం. అందుకే బతికినంతకాలం అభిరుచి, ఆదర్శం పోగొట్టుకొని నీరసంగా బతకలేను. శూన్యనీరస ధర్మఝంఝామారుతంలో నా జీవనం జీర్ణపత్రం కాకుండా చూసుకుంటాను.

పహారా: అంత నీరసమా ధర్మం? మన బతుకు జీర్ణపత్రమా?

భిక్షు: వసంతశోభ ఉన్నంతవరకూ యౌవనం సుందరం. వసంతశ్రీలు, కోకిలల కోలాహలం తరిగిపోయి శీతువు వచ్చినా భావనలో వసంతం, యౌవన సౌందర్యం హత్తుకునే ఉంటాయి. మన మనస్సు ఆకాశంలాగ మహోజ్జ్వలమై చిత్రవర్ణ శబలితమై ఇంద్ర ధనస్సులాగ; నీ హారంలో తడిసిన గులాబీవంటి ఉషస్సౌందర్యంతో ఉంటుంది. నన్ను వదిలెయ్యి వెళ్ళిపోతాను.

పహారా: భిక్షు నేనూ నీలాగే యౌవనమదంలో వొళ్ళు తెలియక స్వేచ్ఛా జీవినై సమస్త ఘణామణిపల్లిలో బాలకూ పతంగం అయ్యేవాణ్ణి. నా శరీరం మిసమిసలాడుతూ పచ్చదబ్బపండులా మెరిసిపోయేది. దేహం యవనశిల్పంలా ఉండేది. వినయధర్మాలు కఠినం. విధి లేక సంఘధర్మ పరశుధారకు మేకపిల్లనై తల వొంచాను. మతగ్రంథం బూజు దులిపి చేత్తో పుచ్చుకునేసరికి, మనస్సు పాదరసంలాగ తారుణ్యంవైపు తరలిపోయేది. కళ్ళాలు తెంచుకొని గుర్రంలా పరిగెత్తేది. రూపకల్పనలో మురిసిపోయేది. కఠోర సాధనకు లొంగిపోయాక ఇప్పుడు కష్ట మనిపించదు.

భిక్షు: కత్తి అంచులమీద నడవడం ఘోరం, బాధాకరం!

పహారా: బాధ లేదు. నాకు పుష్పరాగం, వీథుల్లో ధూళి సమానం.

భిక్షు: ఎంత నీరసం!

పహారా: ఇంత చిత్రకారుడివి భావుకుడివి ఎందు కొచ్చావు ఇక్కడికి?

భిక్షు: అర్ధణా లేనివాళ్ళం ఏం చేస్తాం! పొట్ట చేత్తో పట్టుకు తిరగక?

ఈనలందాలో శిశిరంలో మంచులో తడిసి వణికి, ఆకలితో తిరిగాను— ఎవడయినా కుంచెల కయినా పైసా ఇస్తాడేమో నని.

పహారా: ధనంతో వచ్చిన మర్యాదవల్ల, పొగరువల్ల కళ్లో పొసకుల్ని అత్యం చేస్తారా మదాంధులు? అయ్యో, ప్రపంచసరళి ఎరగని అమాయకుడవు.

భిక్షు: తిండి లేక ఆదర్శం అభిరుచీ చంపుకో లేక తిరిగాను. వాడ వాడల బిచ్చగాడిలా తిరిగాను. నాకేక ఎవరూ వినరు.

పహారా: ఎలా వొచ్చావు మఠాయతనంలోకి?

భిక్షు: మాపిన్ని బలవంతంగా చేర్పించింది. ఇక్కడ ఉంటే శరీరం నిలుపుకో వచ్చు, రుచిని స్వీకరించవచ్చని ఆశ పడ్డాను.

పహారా: నీదృష్టి మారిపోతే బాగుపడే వాడవు.

భిక్షు: బాగుపడడానికే వెళ్ళిపోతున్నాను.

పహారా: దృష్టిని అంతర్వాహిని చేసి 'తథాగతుడి' వైపు మరల్చు.

భిక్షు: ఉత్తమ చిత్రకారుల దృష్టి అంతర్ముఖం కాక మరేమిటి? అందుకే అఖండసౌందర్యం ఉపాసిస్తున్నాను.

పహారా: అయితే ఆడవాళ్ళ అవయవసూర్తి చిత్రించడం ఎందుకు?

భిక్షు: స్త్రీ మాట తలపెట్ట కూడదా?

పహారా: కూడదు. కోరిక లేరిక లెత్తించి, జగత్తు నిత్యమనే సుందర భ్రాంతి కల్పించి తిప్పుతుంది. అందుకే తథాగతుడు ప్రకృతికి దూరంగా ఉండ మన్నాడు.

భిక్షు: స్త్రీ జగదంబ. ఇవ్వాడన్నా తెలుసుకో. యువకయువతీ భిక్షు–నీగణం వినయ శాసనాలవల్ల సంసారం నిస్సారం చేసుకుంటున్నారు.

పహారా: నిస్సారం! చెరుకుపిప్పి కాక మరేమిటి?

భిక్షు: పిప్పివంటిబుద్ధి, నీరసమైన మనస్సు సారం ఏలా గ్రహిస్తుంది? అంతా పాడయిపోతున్నారు మఠాల్లో. వదిలెయ్యి వెళ్ళిపోతాను

(అకటక పావుకోళ్ళచప్పుడు వినవస్తుంది.)

[౨]

[మఠాయతనంలో గది. సంఘాధ్యక్షుని కాళ్ళచప్పుడు విని ఏడుపు ముఖంతో ధమ్మపదం తిరగవేస్తూ ఉంటాడు భిక్షు. ప్రవేశం మఠాధిపతి.]

అధిపతి: భిక్షూ? ఏమిటా పుస్తకం?

భిక్షు: చిత్తం చిత్తం...ధర్మపదం.

అధిపతి: కొంపదీసి ప్రాకృత శృంగారగాథలు కావు గద? (పుస్తకం తిరగేస్తూ) ధమ్మపదంనిండా ఈ సుందరాకృతు లెందుకు? ఏమిటీ శిల్పం! ఎందుకీ హస్తవిన్యాసాలు? అబ్బబ్బ! నమో బుద్ధాయ! ఎక్కడ చూచినా అవయవస్ఫూర్తి, యౌవనశ్రీలు, అందం! ఛీ! ధమ్మపదం చిత్రిస్తున్నావా? (విసుగుదల, కోపం.)

భిక్షు: మనస్సు సరి లేనప్పుడు బొమ్మలు గీశాను.

అధిపతి: తథాగతుణ్ణి ధ్యానం చెయ్యి. ఎందుకు సరిగా వుండదు? ఉదయం చైత్యవందనానికి రాక ఈ పాడుపని చేస్తూ కూర్చున్నావా?

భిక్షు: (చేతులు నలుపుకుంటూ)...అవును స్వామీ!

అధిపతి: నీకు ఎన్నిసార్లు చెప్పాను! పాలిలో వున్న గ్రంథాలు చదవమని?

భిక్షు: చిత్తం.

అధిపతి: అస్తమానం హాలుడి గ్రంథం చదువుతావు. ఎందుకా గాథలు? అసలు మఠాయతనంలో సౌందర్య మీమాంస పనికి రాదు. పరమ నాస్తికుడివి!

భిక్షు: (ధైర్యంతో) పరమాస్తికుణ్ణి—జీవితంలో రుచి చంపుకో లేను.

అధిపతి: ఆత్మోన్నతీ ధర్మం అక్కర్లేదూ?

భిక్షు: ఆత్మోన్నతి వుంటేనే అందమైన శిల్పం వస్తుంది, శరీరం తిట్టిపోశారు. తిట్టిపోస్తున్న మీరే శరీరం ధరిస్తున్నారు?

అధిపతి: దానికీ నాకూ సంబంధం లేదు. నువ్వు ఎవరో తెలుసుకో.

భిక్షు: తెలుసుకొన్నాక?

అధిపతి: అప్పుడు నీకు కుంచెలు తెప్పించి ఇస్తాను. గైరిక ధాతువులిస్తాను.

భిక్షు: అమ్మయ్యా! నా కోరిక ఫలించింది.

అధిపతి: మళ్ళీ కోరిక అనకు - అదే దుఃఖానికి మూలం. కోరికలు రెచ్చగొట్టే చిత్రాలు గీయకు.

భిక్షు: అంటే ఏలాటి బొమ్మలు స్వామీ?

అధిపతి: శరీరం లేనివీ రూపం లేనివీ?

భిక్షు: దయ్యాలూ భూతాలూ.

అధిపతి: ముసలీ ముతక వాళ్ళను, కాటికి కాళ్ళు చాచిన వాళ్ళను, ప్రళయం సృష్టించు.

భిక్షు: ముసలీ ముతక వాళ్ళకు శరీరం ఉండదూ?

అధిపతి: సౌష్ఠవం లేని శరీరం కనక చిత్రించవచ్చును. తారుణ్యం దగ్గిరికి రానీయకు. అలాంటి చిత్రాలు గీయాలి.

భిక్షు: ఈ మఠాలన్నీ బొమ్మరిళ్ళు. మఠంలో సన్యాసులు వొట్టి బొమ్మలు, పీకముక్కలు. ఎంతసేపూ గతానుగతికంగా వచ్చే బూజు పట్టిన పాతపుంతలో, వెనక చూపుతో నడుస్తారు.

అధిపతి: అనవసరం అదంతా నీకు.

భిక్షు: ప్రసంగం కట్టిపెడతా గాని నాకు కుంచెలు ఎప్పుడిస్తారా అని తహతహలాడి పోతున్నాను. అప్పుడే నా రక్తంలో సుకుమార మయిన భావాలు పారాడుతున్నాయి. అందమయిన మంచుతెరతో ఇంద్ర ధనుర్వర్ణాలు నాకళ్ళకు మాపుతుంది ప్రకృతి. నాభావనలు వింతవింత స్వప్నాలు అల్లుతున్నవి. మనస్సే తూలికగా మారి చిత్రరచన చేస్తున్నది. ఆహా!

అధిపతి: చాలు చాలు నీ ప్రేలాపన! కట్టిపెట్టు వెర్రిమొర్రి కబుర్లు! నేను చెప్పినట్టు చిత్రాలు చిత్రించు తెలిసిందా?

భిక్షు: మతగ్రంథాల్లో వెయ్యమన్నారా బొమ్మలు?

అధిపతి: ఛత్! గోడలమీద వెయ్యాలి. చైత్యావందనం చేసేచోట గోడ మీద చిత్రించాలి.

భిక్షు: చిత్తం స్వామీ. (నిష్క్రమణ)

[3]

[ఉదయం చైత్యావందనం చేసేచోట. బౌద్ధ భిక్షు భిక్షుణీ గణం కిటకిటలాడుతూ ఉంటారు. గోడమీద చిత్రాలు చూసి నివ్వెరపోతున్నారు. జనంలో కలకలం.]

ఒక బౌద్ధ భిక్షు: శాంతం పాపమ్! నమోతస్స భగవతో అరహతో సమ్మాసంబుద్ధస్స!

రెండో భిక్షు: (ధమ్మపదం కళ్ళకు అడ్డుగా పెట్టుకుంటాడు) అబ్బ పాడుబొమ్మలు!

అంతా: బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మంశరణం గచ్ఛామి (కలకలం శాంతిస్తుంది).

అధిపతి: (గంభీరంగా) భిక్షూ! ఇవేనా బొమ్మలు!

భిక్షు: చిత్తం!

అధిపతి: మహాభినిష్క్రమణ, ధర్మచక్రం, మహాబోధి, ఏవీ కనపడవే!

భిక్షు: సమస్త లావణ్య ప్రకృతినీ సృజించాను.

అధిపతి: ఘోరం! సంఘం కలుషిత మయింది! (కేకలు) ఏం మాట్లాడవేం భిక్షూ?

భిక్షు: రమణీయ ప్రకృతి!

అధిపతి: కాటుక కన్నులనుండి వచ్చేవాలుచూపుల తోరణాలు, పండుతమలపాకుల్లాంటి పాదాలమీద జీరాడే సరిగంచులసొగసు, నీలిసరస్సు మీద చంక్రమణం చేసే చక్రవాకాలు, ప్రియా ధమ్మిల్లం, —అమ్మో రోత

ఖండాలవు సౌందర్యం! ఇటువంటి చిత్రాలే! అబ్బ ఎక్కడచూసినా స్త్రీ స్త్రీ.

తక్కినవారు: ఆమాట ఉచ్చరించవద్దు.

భిక్కు: సర్వసృష్టి కళ ఎక్కడనుంచి వస్తున్నది?

అధిపతి: వొద్దు విచారణ.

భిక్కు: మఠంలో చీకట్లు పెనవేసుకొంటున్నాయి. భిక్కులంతా సాలిపురుగులు. మీరు సృష్టించుకొన్న చీకటివలల్లో మీరే చిక్కిపోతారు.

అధిపతి: చాలించు!

తక్కినవారు: ఈమారుని దూతను తరిమెయ్యండి. వీడు మారుడిదూత!

అధిపతి: అవును నిజం. నీకు శక్తి వుంటే శూన్యాన్ని సృష్టించు.

భిక్కు: శూన్యం ఎలా వుంటుందో చెప్పండి. తర్వాత బొమ్మగీస్తాను.

అధిపతి: శూన్యమా!...అది...అది...(ఆకాశం చూస్తూ)

భిక్కు: ఇకనైనా ప్రకృతిచిత్రాలు దూషించకండి. సౌందర్యాన్ని తిట్టకండి. ధర్మపథంలో చరిస్తున్నా మనే డాంబీకం అహంకారం వదలిపెట్టండి.

అధిపతి: గోడలన్నీ పాడుచేశావు.

భిక్కు: శూన్యరాజ్యంలో మీ కీటకాలతో దొంగధర్మం పాటించండి! మీకు వెలుతురు ఎందుకు? కిటికీలు ఎందుకు?

భిక్కులు: అక్కర్లేదు పదు. ముం దిక్కణ్ణించి! (కేకలు.)

భిక్కు: వదిలేస్తున్నాను సాలిగూళ్ళు! వదిలేస్తున్నాను బొమ్మరిళ్ళు!

(నిష్క్రమణ)



# గ్రీష్మఋతువు

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు

[పెద్ద వడగాలి రొదలుం నడుమ నడుమ దీనంగా ఒక్కొక్క పక్షీ, జంతువూ అరుస్తూంటుంది. గాలి రొదలో మందారి రాగం తీగలు సాగుతూంటుంది. గాలి రొదలోనే మెల మెల్లగా జన సందోహం,—'అబ్బా, అబ్బా, కాళ్లు పొక్కులెక్కాయి'—'దాహమోయ్ దాహము,' 'తల మాడిపోతోంది, ఒళ్ళు కాలిపోతోంది' అని యీ విధంగా—పాంథ జనులు—వొక్కొక్కరుగా. అంటూ, 'ఏం గ్రీష్మం, ఏం గ్రీష్మం' 'ఏం ఎండ ఏం ఎండ! అని ఐక్య కంఠంగా అరుస్తారు]

పాంథుల ఒకటో జట్టు:

బృంద గీతి

నడిమింట చండ రవి మండు నెండ కాచె
వడగాలులు సుడి తిరిగి హోరు మని వీచె
సడలి తరుపర్ణములు జరజర మని రాలె
వడలి సుమ ఫలాలు సొగసు చెడి పడి తూలె
కడ లంటు బ్రతుకులను జీవరాశి రోసె
బడలి మంచెపయి తోటమాలి కను మూసె.

(పాట దూరంగా పోయి సన్నగా వినబడుతూ వుంటుంది.)

చిన్నపిల్ల: బాబా, బాబా, లే. త్వరగా లే.

వృద్ధు: ఏం తల్లీ, పడుకో. చెట్టునీడ దాటి బయటికి పోకు. వొక చెంపని వడగాడుతూ వుం దింకాను. పడుకో తల్లీ!

చిన్నపిల్ల: ఈ రహదారిని వొద్దు బాబా, ఈ వేడి వెలుగ్లో కళ్ళకి చీకటులే గాని—

వృద్ధు: నా కళ్ళ కెప్పుడూ చీకటులే గా దమ్మా. నువ్వు దూర మైతే మరీని.

పిల్ల: బాబా, బాబా, అక్క డెక్కడో తోట వుందిట. ఎండ రెందరో పాడుకుంటూ వెడుతున్నారు.

వృద్ధు: ఏరీ?

పిల్ల: ఆ మలుపులో వున్నారు, మనమూ పోదాం, లే బాబా, తోటకి.

వృద్ధు: తోటా, అమ్మో. ఎక్క డుందో! పేదవారం. నిస్సత్తువలం, పోగలమా?

పిల్ల: (వినకుండానే) తోటే బాబా. అంతా వెడుతున్నారు. తోట మాలి అని వుంటా డట అందులో. వీ రంతా అక్కడికేట. బాబా, పోదాం, పోదాం లే, బాబా.

వృద్ధు: ఇంత యెండలో తోటమాలి, తోటమాలి—అవును. నా గురువులు చెప్పేరు—చిన్నతనంలో. నట్టనడి వేసవిలో యెప్పు డైనా ఆకలీ దాహమూ యెక్కు వయి ప్రాణాలు నిలుపుకోడం కష్టమయితే తోటమాలిని కలిసికో మన్నారు. తోటమాలి — చలిది దాహా లిస్తా రట. ఫల రసాలూ, పానకాలూ, అన్నీని. కనుక్కో. కనుక్కో. తోటమాలి తోటలో వున్నారో లేదో కనుక్కో తల్లీ.

పిల్ల: నడువు మరి. (పాంథుల పాట దగ్గిరికి వస్తుంది) — అయ్యా! చూడరూ ఇలా? చెప్పరూ — తోటమాలిట — తోటలో వుంటారా?

వృద్ధు: ఎండల్లో కూడా...

పిల్ల: యెండల్లో కూడా? చెప్పరూ. వుంటారా తోటలో?

ఒక పాంథుడు: యెవరు? తోటమాలా? తోటలోనా? తోటమాలి సంగతి నీ కెందుకు?

పిల్ల: మా బాబు అడగ మన్నాడు. మేం అక్కడికి వెళ్ళాలి.

పాంథుడు: మీకు దర్శన మివ్వడు పో. మేమూ ఆ సంగతే కనుక్కుందా మని వెడుతున్నాం.

మరొకడు: లాభం లేదు పో. అతనిప్పుడు మొద్దులా నిద్రిస్తూ వుంటాడు.

(జన సందోహపు ధ్వనులు వస్తూ పోతూ వుంటాయి. వుండుండి సుడి గాలులు వీస్తూనే—జంతువులు అరుస్తూనే వుంటాయి.)

పిల్ల: బాబా, (వెక్కి వెక్కి ఏడ్చే ప్రయత్నం.)

వృద్ధు: రా, అ దేమిటి? ఏదీ చెయ్యి. మనకి ఆసరా అమ్మా తోటమాలి— ఏ మన్నారు?

పిల్ల: తోటమాలి — బాబా — మొద్దుట —దర్శన మివ్వ డుట మనకి.

వృద్ధు: పట్టి దమ్మా పట్టిది. వారు చెప్పింది జ్ఞానం లేని మాట. గురువుల వుపదేశం లేదు వారికి. నా గురువులు తప్పు చెప్పరు. నాకు విశ్వాసం వుంది, పద. నన్ను తీసుక వెళ్ళు తల్లీ.

పాంథుల రెండో బిట్టు:

దరిద్రపు తాపం బుభుక్షా ప్రకోపం
నిదాఘపు ప్రతాపం మహా తీవ్ర తాపం
హుతాశా త్తధూపం మృతోద్ధూత రూపం
చ్యుతోద్యానదీపం వృథా దీనపాపం.

వృద్ధు: (కర్ర నేలని కొడుతూ) అయ్యా, అయ్యా, వినండి. తోటమాలిని గురించి...

పాంథు: తోటమాలి యెవడు? యెవడు వాడు? యెక్కడున్నాడు? ఇవేమీ అఖ్ఖర్లేదు మాకు. మేం దరిద్రుల క్లేశం, ఆకలిమంటా వేసవి గాడ్పు తీవ్రతా అధికార మత్తుల నిరంకుశత్వం — ఇవేమీ సహించలేం.

వృద్ధు: అయ్యా, తోటమాలి కూడా సహించలే డట. మా గురువులు

చెప్పేరు. దాహం ఆకలీ మిక్కుట మైతే వేసంగుల్లో తోటమాలి దగ్గిరికి వెళ్ళి తీర...

పాంథు: తోటమాలీ లేదు, గీటమాలీ లేదు. ఎందుకు మాకీ సొద? చూడు, మాకు కొన్ని యుగాలనుంచీ విపరీత మైన దాహం ఆకలీ దారిద్ర్య మూనూ. ఇవాళ తోటమాలిమీద పడి వాటిని తీర్చుకో దలచాము. ఇన్ని యుగాలనుంచీ పాడులోకం చలాయించిన నిరంకుశత్వం ఇంతటితో సరి అనుకో...

(తప్పుకో అనే కేకా, కొరడా చప్పుడూ, గుర్రపు డెక్కలూ, బండ్ల చక్రాలు నడిచి పోతున్న ధ్వనులూను.)

బండిలో ఒక యువతి: నాన్నగారూ, యీ జనమంతా మన తోట విందుకులాగే వుందే. వీళ్లంతా తోటలోకి వస్తే తోట అగుతుందా?

బండిలో పెద్దమనిషి: మనవాడేగా, తోటమాలి. అదమాయిస్తాడు లే.

(బండి వగైరాల చప్పుడు.)

పాంథుడు: ఆరుగో నిరంకుశులు, పోతున్నారు. వీళ్ళని లెఖ్ఖ చెయ్యం. ఇవాళ తోటమీద పడి తీరుతాం.

పిల్ల: బాబా, తోటమాలి వున్నా డని చెప్పుకుంటున్నారు బండిలో.

వృద్ధు: అవును రా, తల్లీ, రా.

పాంథులు: దరిద్రానుతాపం బుభుక్షాభిఘాతం
నిదాఘ పరితాపం మహా తీవ్ర తాపం
హుతాశాత్త ధూపం మృత్యోద్ధూతరూపం
చ్యుతోద్యోనదీపం వృథా దీన పాపం.

(మళ్ళీ గాలీ — కొత్త జనసందోహపు సందడీ — కలకల నవ్వులూ — గాజులూ అందెలూ.)

పాంధుల మూడో జట్టు:—ఆశావాదుల

బృందగీతి

ఎండ కాదు ఎండ కాదు
తోట లన్నీ పండే కాదు.
వన దేవత కావి కురులా మెరసి పోలు కెంజివురులో
విరిసివాడీ, కమ్మతావు లారసి, మరులు చిమ్మతోటన...
తరుల నీడల వసేందిర పరచికొనిన చలిపందిర
విరి దేసెలు ఫలరసాలు కురిపి నోరు నిండే కారు...
తెర తీసిన మావి తోట సురిగి చవెడు పికము పాట
తేటలోన మేను మరచి తోటమాలి పండే కాదు...
ఎండ కాదు ఎండ కాదు
వంటలన్నీ పండే కాదు.

వృద్ధు: తల్లీ, వీరెవరో మంచి పాట పాడుతున్నారు. తోట యింకా యెంత దూరమో అడుగు...

పిల్ల: అయ్యా, తోట యింకా యెంత దూరము?

పాంధుడు: అమ్మాయీ, అదుగో చూడు —అ కనబడే ద్వార బంధం... అదే తోట సింహద్వారం. చూశావా — ఊఁ. ఎంతదూరంనించి వస్తున్నా వమ్మా. పాపం ఈ యెండబడి? నీకూడా ఎవరూ లేరూ?

పిల్ల: లే కేం? ఇదుగో మా బాబు. చాలా దూరంనుంచి వస్తున్నాం. చెప్పండీ. తోటమాలి చాలా మంచివాడు కదండీ? అందరికీ పానకాలూ వళ్లూ అవీ పంచుతా డని చెప్పేడు మా బాబు. ఎండగాలిగా వుందని పడుకుని నిద్రపోడు కదూ?

పాంధుడు: మనం యింతమందిగా వెడుతుంటే ఆయన పడుకో డను కుంటాను. తను పడుకున్నా సరే. మనకందరికీ పానకాలూ పళ్ళూ అందే యేర్పాటు చేసి తీరతాడు. చూడు, ఇదిగో యీ పువ్వులు తీసుకుంటావా?

పాడిపోయా రేమో.........

పిల్ల: యివ్వండి - నా కెంతో యిష్టం.

ఇంకొక పాంథుడు: ఏమోయ్, అన్నీ ఇచ్చెయ్యక, కొన్ని దాచు. తోటమాలికి అందమైన పిల్ల లుండొచ్చు.

పిల్ల: తోటమాలికి నాలాంటి పిల్ల లున్నా, రాండి? నాతో ఆడుకుంటూ రాండి?

పాంథుడు: ఓ. తప్పకుండా. త్వరగా నడవండి.

[పాట.]

ఎండకారు ఎండ కారు
తోటలన్నీ పండే కారు.

నిరాశావాది: ఏయ్, ఆగండి. మీరు పాడేది సర్వం అబద్ధం. మీ రెవరు? ఈ వినాశ కాలంలో ఈ ఆశ యేమిటి? ఈ ఆనందం ఏమిటి?

ఆశావాది: పాపం, మీరు ఆనందానికి నిరాశ చేసుకున్నారు కాబోలు. ఆనంద పూర్ణమైన ఆశాపథికులం. గ్రీష్మంలో బ్రహ్మానందం లేదూ?

నిరాశావాది: అబద్ధం. గ్రీష్మ మేమిటి? బ్రహ్మానంద మేమిటి? తప్పాడు పాటలు. లోకాలు మండిపోవటం లేదూ? నీ తలపైని నిప్పు కొండలు పగులుతున్నట్లు లేదయ్యా? ఏమిటీ యీ అసందర్భపు ఆశా, ఆనందమూనూ?

బృంధగీతి

ఈ లేదు జగాలు నోలె ఈ గ్రీష్మజ్వాలాకీల
ఈ తాపము నార్చు నేత లేదు
ఈ పాపము తీర్చు తాత్రిత లేదు
అనల మ్మనిలమ్ము కలసి ఆకాశము నొసట పొగలు
వనరె జీవ జంతు తతుల బ్రిము కాశల కడల రగులు.

ఈ తాపము......... ఈ పాపము.........
ప్రేమ కొరకు మరిగి మండి వ్రీలిపోయినవి యెడదలు
తేమకొరకు సురిగి యెండి చీలిపోయినవి యేరులు
ఈ తాపము......... ఈ పాపము.........
వెతలను మరపించుదారి కతలు మాయమాట లోయి
వితలా యెండమావులే వినిపించే పాటలోయి.
ఈరేడు జగాలు పోలె ఈ గ్రీష్మజ్వాలాకీల.

పిల్ల: బాబా, బాబా, భయం... బెంగ...

వృద్ధు: తల్లీ, నన్ను పట్టుకో.

ఆశావాది: భయం లేదు. వొచ్చేశాం. తమ్ముడూ, చూడు, మీ గందరగోళమూ గాభరా చూస్తే యీ గ్రీష్మంకంటే తీక్షణంగా వుంది. అమాయికులమనస్సులే కాలుస్తూంది. పైని యెన్ని నిప్పు కొండలు పగిలినా మా హృదయాల్లో ఆ తీవ్రతకు ఆగగల మంచుకొండ లున్నాయి. మా దృష్టిలో వసంతం, హేమంతం, గ్రీష్మం అన్నీ సౌందర్య మహితాలే... ఆనంద భరితాలే...

నిరాశావాది: మిమ్మల్ని చూస్తే వింతా కోపమూ కలుగుతున్నాయి. ఇంత భయంకరమైన వాస్తవాన్ని యెలాగ కప్పి పుచ్చుతారు? ఎందుకు కప్పుతారు? మోసం, ద్రోహం కాదూ యిదీ?

ఆశావాది: మిమ్మల్ని చూస్తే మాకూ జాలి కలుగుతూంది. మనస్సులో ఎగుడూ దిగుడైన భావాలవల్ల క్షణక్షణం విషమంగా, విరుద్ధంగా, వివిధంగా మారే ప్రకృతిని సమన్వయించుకో లేరు. మీ తత్వచింతా, అనుకంపా స్వార్థపూరితాలు.

నిరాశావాది: మీరు మనస్సుల్లో కల్పించుకొన్న వూహాలూ, నిర్మించుకున్న స్వర్గాలూ వాస్తవాలే? ఎంతకాలం నిలుస్తాయి?

ఆశావాది: కలకాలం. మేం స్వర్గాలు నిర్మించుక పైకి లేస్తాం మీరు

నరకాలు కల్పించుకుని బ్రతికుండగా పాతాళంలోకి కుంగదీసుకుంటారు.

పిల్ల: బాబా, బాబా, గొంతు తడి ఆరిపోయింది...అబ్బ...దాహం ... చెవులు గళ్ళు...

వృద్ధు: అయ్యొ పిల్లకి వడ గొడుతూంది. తోటమాలి దగ్గరికి వెళ్ళడం యెలాగ? యెప్పటికి? వడ గొడుతూంది నా పిల్లకి. యెవ రైనా వింటున్నారా బాబూ?

ఆశావాది: కొంచెం వోర్చుండి, కొన్ని క్షణాలు. తోట సింహద్వారం యిది......అహా, కొలనుమీదినుంచి చల్లగాలి అప్పుడే తిరిగింది.

ఇంకొకడు: ప్రాణాలు లేచి వచ్చాయి. ఓహో, శ్రావ్య కల కంఠాలు......

(పక్షుల కలకలం. జనుల కలకలం. వుండుండి.)

వనకన్య లేమిటి చెప్తాన్నా వాళ్ళు?......

వనకన్యలు: బృందగీతి

సంధ్యారుణిమారుచిరజ్యోతుల
సకల పాంథులకు స్వాగతము!
నందనవనివారిచందన వివృతా
నందాంగణమున స్వాగతము!
ప్రసవ సుగంధిల నీహార శీతల
పాద్య జలమ్ముల స్వాగతము!
విచికిలాక్షతా దధిమధు ఫలరస
రచితార్ఘ్యాంజలి స్వాగతము!
వసంతాంత మృదు కిసలయ తోరణ
మసృణాంగుళీముల స్వాగతము!
అదళిత కదళీ శ్యామ విస్ఫుర
చ్ఛద కరమ్ముల స్వాగతము!

పిల్ల: బాబా, నా కింక దాహంలేదు. వారితో కలిసి ఆడాలనీ పాడాలనీ వుంది.

వృద్ధు: ఏ జన్మంలోనో వీ రంతా మన బంధువు లమ్మా! చల్లని స్వాగత గీతంతోనే తనువే కాకుండా గుండె కూడా పులకరించి పోయింది. తోటమాలి వచ్చా లేమో.

నిరాశావాది: ఈ తోటమాలి పిచ్చేమిటోయ్ వీళ్ళకి? ఏయ్, అమ్మాయిలూ, తోటమాలి అంటూ వొకడున్నాడా?

వనకన్యలు: (కలకల నవ్వుతారు.)

ఒకడు: తప్పాకో...

బండిలో స్త్రీ: నాన్నగారూ, తోటమాలి యింకా యేర్పాటులు చేసినట్టు కనబడ దేం?

భాగ్యవంతుడు: ఆ వన కన్యలు అతని పిల్లలేమో... ఏడీ మీ తండ్రీ? మేం వచ్చా మని చెప్పండి.

వనకన్యలు: [కిలకిల నవ్వుతారు.]

ఆశావాది: తమ్ముడూ, అడుగో ఆ పర్ణశాలలో వున్నా డేమో పిలిచి చూడు. అందులో పడుకుని వుంటా డని మా అనుమానం. మేలుకొలుపు పాడితే గాని మేలుకో డేమో?......

బృందగీతి

తోటమాలీ, తోటమాలీ, .
ఏటి కింక లేవవు, ఈపాటికి నీ నిదర తేలీ
తోటమాలీ, తోటమాలీ!
పాటి రేవులో కదలక పడవ లాగిపోయినవో
ఏటినీరు రాక తోట యెండి మాడిపోయినదో
తోటమాలీ తోటమాలీ!,
మావి పండ్లు కొవిలోన మాగిపోయినవో రోకా

తావి జారి పూవులన్ని రాలిపోయినో యేమో
తోటమాలీ తోటమాలీ!
వడగాలులు వీచుచుండ, ఒడలు కాలి నుండిపోవ
మడులలోని విత్తనాలు ముడిగి విడిగి యుండిపోవ
తోటమాలీ తోటమాలీ!
యేటి కింక లేవవు, ఈపాటికి నీ నిద్ర లేలీ
తోటమాలీ, తోటమాలీ!

ఆశావాదులు: మనమూ పిలుద్దాము. తప్పకుండా వస్తాడని ఆశిస్తున్నాను.

బృందగీతి

ఓసారి లెమ్మ ఓ తోటమాలి
హాసమ్ము చిందు వదనమ్ముతోడ
ఓ తోటమాలి ఓసరిలి లెమ్మ లెమ్మ...
వేసంగి నలగి వేగునే ప్రాణి తతులు
ఈసారి లేచి ఈక్షింపు జీవగతులు
ఆశాళ నందుకొను హాయి లోకనతులు
ఓసారి లెమ్మ............
వేసంగి క్రాగి వీగి భువి రిత్తవోయె.
వాసంత జీవనపు హాయి నిత్తువేని
బ్రదుకెల్ల మధుమయ మ్మందు మెత్తు హాయి.
ఓసారి లెమ్ము............

వృద్ధు: తల్లీ, వచ్చాడా, తోటమాలి?
(జన సందోహం అంతా విడివిడిగా వొక్కొక్కరుగా తోటమాలి తోటమాలి - పెద్దగాలి కెరటం, చల్లని సంగీతం.)

పిల్ల: బాబా, పర్ణశాల తలుపులు కదుల్తున్నాయి.
వృద్ధు: తల్లీ, తల్లీ, నన్ను పట్టుకో. గట్టిగా పట్టుకో.
(జన సందోహం – విడిగా వొకొక్కరుగా మొదలుపెట్టి గోలగా కలిసిపోయి, 'తోటమాలి – తోటమాలి.' అంటారు అంతా)
కవి: (పర్ణశాలలోనుండి బయలుపడి)

బృందగీతి

తోటమాలి జోలె నీ కెందుకు ?
తోటలో తేనె తేటలో తీయ పాటలో మునిగి తేలక
వనములో పక్షి జనములో సుధాసవములో మునిగి తేలక
తోటమాలి జోలె నీ కెందుకు?
తోటమాలి నిద్రింపనూ లేదు
తోటమాలి మేలుకోనూ లేదు
నీదు పూర్వులో నాదు పూర్వులో
నీ పాటల నా పాటల మాటల
పెరుగులో విరుగులో తరుగులోన
పరుగువారు కపబడని తేజమా
తోటమాలి జోలె నీ కెందుకు?

నిరాశావాది: ఇతను తోటమాలి కాడు.
ద్వితీయ పాంథుడు: ఇతను తోటమాలి కాడు.
అందరూ: ఇతను తోటమాలి కాడు
ఆశావాది: ఈయన కవి.
పిల్ల: బాబా, ఈయన కవి ట.
అంతా: ఈయన కవి.
కవి: అవును నేను కవినే. మీ కందరికీ వినోద విలాసాల కల్ల అమే

యమైన బ్రహ్మానందం కలిగించడానికి ఈ సమావేశాన్ని వచ్చింది నేనే. మన కెప్పుడూ ఆశాభంగం లే దనుకొని క్షమించండి.

విరి చెలువలార, నవమాధవీ నికుంజ
మందు కలయంపిగా తేనియలను చిల్కి
గరిదవోడు లల్కి పైడి సింగంపు పీట
లం దతిథివర్యు లెల్లరు నధివసింప
పజ్జ గొజ్జంగి చలువ వీవనలు గొనుడు.

మొదటి సఖి: అయ్యా, అతిథులారా, దయచేయండి. అదిగో మాధవీ నికుంజం లోపలే పానీయశాల.

అందరు: చలి పందిర. చలి పందిర... [జన సందోహం.]

రెండవ సఖి: [తియ్యగా] చలిపందిర. లేవండి మరి...అంతా... అందరూ...... కదలరిడి...... దయచేయండి పందిట్లోకి.

మూడవ సఖి: అ దేమిటి వెనుకంజ వెయ్యకు స్నేహితుడా ... జంకు లేదు.

మొదటి సఖి: మోమోటంవా! మీరూనూ. రండి రండి.

రెండవ సఖి: నడవ రేం!. ఆ కనుబొమల ముడిత తీసెయ్యా లయ్యా మీ రింక!

అంతా: [నవ్వుతారు.]

మొదటి సఖి: ఏయ్, అబ్బాయ్. ను వ్వింక నైనా నవ్వకపోతే వొవ్వ కోను సుమా......

యువకుడు: (నవ్వుతాడు. అంతా నవ్వుతారు.)

వృద్ధు: నా తల్లీ, నా గురువులు చెప్పిన ఆగుణాలూ ఆ వర్ణనా అన్నీ ఈ కవీశ్వరుడిలో హత్తుకున్నాయి తల్లీ! నా గురువులు తప్పు చెప్పరు. నా కెంత సత్తువ? కొత్త జన్మ. గురువుల దయ. చలిపందిర. వేసంగిలో చలిపందిర.

అంతా: చలిపందిర, చలిపందిర.

(క్రమంగా హెచ్చిన జన సందోహం—తగ్గుతూరేటే నాట్యాను
గుణంగా—గాజులా అందెలా సవ్వడులు.)

బృందగీతి

సఖీజనం: బ్రతుకందు గాసిలిన పాంథా
ముది యెండ శోషిలిన పాంథా
బిరుసైన చూపు విదళించు
చిరునవ్వు పెదవి గదియించు...

పాంథులు: చలిపందిర లోపల విందు
కలలూరు మధువనమునందు
మలు సంజమంచు నునుజల్లు
వలి కమ్మతెమ్మెరల వెల్లు..

సఖీజనం: 'ఎలదేటులార లే లెండు
విరిబోటులార రా రండు
నవ వర్ష మధువులను తెండు
యువ హర్ష గంధముల నిండు..

పాంథులు: క్రొవ్విరుల తేనె జడి ముసురు
మవ్వంపు గందవొడి విసురు
చలి పందిర లోపల విందు
కల లూరు మధువనము నందు..

సఖీజనం: 'ఫలరసాలు నవ శీధువులు
కలరవాలు యువ మాధురులు
అజరుండ వైతి వీక పాంథా
అమరుండ వైతి వీక పాంథా,.

పాంథులు, సఖీజనం: ఇదె ఆశకై సుధా పాత్రి
ఇదె ప్రేమకై సుధా పాత్రి
ఇదె స్మరణకై సుధా పాత్రి
విస్మరణకై సుధా, పాత్రి.,
(దూరంగా పోతూ పోతూ కోయిల కూత.)

కవి: సఖీ, గ్రీష్మం ముదిరిన యీ రోజునే కోయిల వసంతం కోసం మరో దేశం పోతూంది. దానికి వీడ్కోలు చెప్పు.

సఖి: తీయమావి చివుళ్ళు మత్తిల్ల మెసవి
పాడి, తెగ పాడి, కోయిలా నేడు నీవ
సంత మలరాదు వేరు ద్వీపాంతరమ్ము
చనియు వీడవు మా హృదంచలము లెపుడు.

బృందగీతి

సఖులు: చివురు గుబురుల గూటిలోనె దాగితివి
చివురు రసమును చేదుగానె త్రాగితివి
తీయ తీయగ పాడి హాయి మనిపించు లే
కాని కంటికి కానరానే లేదోయీ!
రానే రావో కోయిలా, ఇక నీవు
పోనే పోదువో కోయిలా...
దెసల యంచుల పాట తేని కరగేనో
ముసలి మావికుల్లతోట సోలి మరిగేనో
పాయకే మా హృదయ ఫలకాల చిత్రిత
మ్మాయెనే నీ పాట, కాన రాలే దీవె.
రానే రావో కోయిలా, ఇక నీవు
పోనే పోదువో కోయిలా.

కవి: ఇంక భరత వాక్యం.

కనవో, ప్రతి ఋతు మధురీతి
వినవో, ఈ ఆశాగీతి
వడలో సందడిలో ప్రశాంత
వనజనసంగతి నీ ఆశ.
జడిలో అలజడిలో మనోజ్ఞ
శంపాద్యుతగతి నీ ఆశ...
చలిలో ఆకలిలో కలిత
స్వప్న సుధాస్మృతి నీ ఆశ.
పువులోన మధువులో హసంత
కవి పిక గళరుతి నీ ఆశ......

బృంధగీతి

మెరసినవి విను వీధిలోగిట వెలుగు తేనెల పైడి గిన్నెలు
కురిసినవి యీ తోట ముంగిట ననుచు మల్లెల చలువ సోనలు
ఒలసినవి యీ సంజ వాకిట మధువు లొలికిన పాట తేటలు
వెలసినవి యలసంపు బ్రదుకుల అమృత చైతన్యంపు బాటలు
ఒరగినవి వెతలడగి యెడదలు మరపుటంచుల మెరపుపాలకి
కరగినవి తరలి మలు కన్నుల విరియు మించుల తోటమాలికి.

(ఆల్ ఇండియా రేడియో వారి అనుమతిని)

# మొక్కుబడి

## శ్రీ మొక్కపాటి నరసింహ శాస్త్రి

~ పాత్రలు ~

| | | |
|---|---|---|
| వెంకటేశ్వర్లు | ... | మంగమ్మ తండ్రి |
| మంగమ్మ | | |
| డాక్టరు | | |
| సుకుమార్ | ... | మంగమ్మ అల్లుడు |
| రాజ్యలక్ష్మి | ... | మంగమ్మ కూతురు |
| చంద్రశేఖరం | ... | ఆయుర్వేద వైద్యుడు |

~ ౧ ~

[హాలులో ముసలి అంధుడు వెంకటేశ్వర్లుగారు, ఆయన కూతురు వితంతువు మంగమ్మగారూ, ఉంటారు. పక్కగదిలోనుంచి మూలుగు వినబడుతూ ఉంటుంది.]

వెంకటేశ్వర్లు: అమ్మాయి! అమ్మాయి!

మంగమ్మ: (కళ్ళు వొత్తుకొంటూ) ఏం! నాన్నా!

వెంకటేశ్వర్లు: పిల్ల ఎలా ఉందమ్మా? ఊరికే అలా మూలుగుతున్నది అస్తమానమ్మూను.

మంగమ్మ: ఎలా ఉందని చెప్పనూ! తెల్లవార్లూ, ఒక్కమాటూ కంటిమీద కునుకు లేదు, ఒళ్ళెరగదు! ఏదో బాధ పడుతోంది బిడ్డ! మొద్దులా ఏమీ చెయ్యలేక అలా చూస్తూ ఊరుకున్నాను. ఏం దారి! ఎన్నాళ్ళకీ ఏమార్పు కనబడదాయె. నా తల్లి నాకు దక్కేటట్టు లేదు. ఈ లోకంలో లేదు.

ఒళ్లు తెలియనిబాధ తప్ప ఇంకేమీ ఎరుగదు.

వెంకటేశ్వర్లు: ఆశ్చర్య పడకమ్మా అలాగ! మరేం భయం లేదు. ఇంతకీ వైద్యు డేమంటాడు?

మంగమ్మ: ఏ మంటాడు? రావడం, చూడ్డం, ఏవో మందులు పొయ్యడం, ఒళ్ళంతా తూట్లు పడేటట్టు ఇంజక్షన్లు ఇవ్వడంతప్ప, ఫలానా జబ్బని కాని, ఇది మంచి అని కాని, ఇది చెడు అని కాని, నోరు విప్పి మాట్లాడడు. ఇప్పుడు లోపల పరీక్ష చేస్తున్నాడు.

వెంకటేశ్వర్లు: ఏవో మరి! ఆయన శాయశక్తులా తంటాలు పడుతున్నాడు. వైద్యుడంతకంటే ఏమి చెయ్యగలడు!

మంగమ్మ: ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు! ఏమి చేసినా ఆ యేడుకొండల వాడు చెయ్యాలి కాని—

వెంకటేశ్వర్లు: ఆఖరుమాటంతే!

మంగమ్మ: అలా అని మొండితనంగా ఊరుకోలేమాయెను. ఆడప్రాణం—బెంగతో) మతి పోయి ఏమీ తోచదు. అలా కాదు ఇలా చెయ్య మని సలహా ఇచ్చేవారేనా లేరాయెను. పోనీ పిల్లను వాళ్ళింటికేనా పంపించాను గాను. వాళ్ళైనా ఇంతకంటే జాగర్తగా చూసుకొందు రేమో నను కుంటాను మధ్యమధ్యను.

వెంకటేశ్వర్లు: వారి కాని అక్కడమట్టుకు ఇంత కంటే ఎక్కువ ఏమి చెయ్యగలరు? మన శక్తివంచన లేకుండా చేస్తున్నాం. ఆయుర్వేదంలోనూ, ఇంగ్లీషు వైద్యంలోనూ హేమాహేమీ లనుకొన్న వాళ్ళను డబ్బుకోసం చూసుకోకుండా తీసుకొచ్చి చూపిస్తుంటిమి. నువ్వన్నట్లు ఆ స్వామికటాక్ష ముండాలి. మన మేలోటు మాత్రం చెయ్యడం లేదు.

మంగమ్మ: ఎన్నికబుర్లు పంపినా, ఎన్ని ఉత్తరాలు వ్రాసినా, దాని మొగుడేనా, ఊడి రాడాయెను! నిన్న టెలిగ్రాము కూడా యిప్పించాను.

వెంకటేశ్వర్లు: సరే అయితే ఇంక నేం—ఇంకాస్సేపటికి దిగుతాడు.

మంగమ్మ: అతను వస్తే బాగుండు ననీ ఉంది; వస్తే ఎలాగని భయంగానూ ఉంది.

వేంకటేశ్వర్లు: ఏమి?

మంగమ్మ: ఏమీ లేదు, అతను పట్టి వ్యతికరణం మనిషి. అతని కెంత తోస్తే అంతే కాని ఘాళ్లాతుడొచ్చి చెప్పినా వినిపించుకోడు.

వెంకటేశ్వర్లు: ఈకాలం కుర్రవాళ్ళ పద్ధతే అంత. ఇంతకూ అతని పెంకితనం నిన్నేమి చేస్తుంది?

మంగమ్మ: మరేం లేదు కాని, ఒక సందేహం బాధిస్తోంది. ఎవరేమన్నా సరే కాని ఈ ముక్కూ మూలం లేని జబ్బువంట పుట్టింది కాదని నా నమ్మకం. ఆ వడ్డీకాసులవాడి ప్రభావ మి దంతా ననిపిస్తున్నది. ఈ మాటంటే అతను వేళాకోళాలూ, వెక్కిరింతలూ ఆరంభిస్తాడు.

వెంకటేశ్వర్లు: పోనీ, అలాగే అనుకో! నీనమ్మకం నీది! దాని కతని వేళాకోళా లెందుకు?

మంగమ్మ: ఎందుకా! దాని పెళ్లిముందు మొక్కుకున్నాను, పెళ్ళి కాగానే వాళ్ళిద్దరినీ తీసుకొని కొండ ఎక్కి స్వామిదర్శనం చేయిస్తానని. నాటినుంచి నేటివరకూ, ఎన్నిసార్లు అతనిని బతిమాలినా నన్ను వేళాకోళం చెయ్యడమే కాని, అతనుమట్టుకు రాలేదు. అందుచేత మేము వెళ్ళడంలేదు. కార్యం ముందు ఇలాగే, చచ్చినంత జబ్బుచేస్తే అప్పుడు మళ్లీ మొక్కుకున్నా, నిలువు దోపు ఇస్తానని. నిమ్మళించడం, కార్యం జరగడం అయిందా? ఆ మొక్కు చెల్లిద్దామని ఎన్నివిధాల ప్రయత్నం చేసినా, అతను దానివంటిమీది వస్తువు చిన్నం బంగారమైనా కదపడానికి వల్ల కాదంటాడు. మళ్ళీ చేయిస్తానన్నాను. అయినా సరే ఇది కదపడానికి వల్లకాదంటాడు. కావలిస్తే నన్ను చేయించి ఇచ్చుకో మంటాడు. నాకనేకసార్లు ఆ స్వామి కలలో కనపడ్డాడు. ఈమధ్య మళ్ళీ తరుచు కనపడుతూన్నాడు. మొన్న కనబడి తల కూడా ఇమ్మన్నాడు.

వెంకటేశ్వర్లు: ఆహాహా గట్టి పేచీ వచ్చిందే! దానికత నసలే వప్పుకోడు. స్వామి కూడా కాలాన్ని పట్టి కొంతమార్పు చేసుకొని ఇలాటికోరికలు మానుకుంటే బాగుండును.

మంగమ్మ: నీవు కూడా అలా మాట్లాడుతావేమిటి నాన్నా!

వెంకటేశ్వర్లు: వెర్రిదానా! తరుచుగా జాగ్రదవస్థలో అవ్యక్తంగా ఉన్న మనఊహాలూ సంకల్పాలే, మనస్వప్నంలో కనుపించేది. మళ్ళీ మెలుకువవచ్చిన తరువాత, ఈ స్వప్నాలు జ్ఞాపకం వచ్చి, మన సంకల్పాలను బలపరచి, ఆచరణకు పురికొల్పుతాయి. దేవుడికి ఏమి కావలెనమ్మా! ఆయన కేమి లోటు—నిజంగా ఆయనకు లోటే అయిన నాడు మనం తీర్చగలమా?

మంగమ్మ: నీ వేదాంతాని కేమి లెద్దూ—

(ఇంతలో లోపలనుంచి డాక్టరు ప్రవేశం)

మంగమ్మ: (ఖంగారుగా నిలబడి) ఏం నాయనా! నా బిడ్డసంగతి ఏం చెప్పారు!

డాక్టరు: (మాట్లాడడు.)

మంగమ్మ: ఏం నాయనా! అయ్యొయ్యో! ఇంకేముంది! (అని గదిలోకి వెడుతుంది)

వెంకటేశ్వర్లు: ఏమండీ డాక్టరుగారూ! పిల్ల ఎలాఉంది? మీ అభిప్రాయమేమిటి?

డాక్టరు: (మాట్లాడడు)

వెంకటేశ్వర్లు: మీ రేమీ సందేహించక ఉన్న స్థితి ఏమిటో చెప్పాలి.

డాక్టరు: సందేహ మేముంది? కాని ఏమి చెప్పాలో తెలియడం లేదు. నేను ప్రాక్టీసు ప్రారంభించిన తరువాత ఇటువంటి కేసు ఎప్పుడూ చూడలేదు.

వెంకటేశ్వర్లు: అయ్యో!

డాక్టరు: ఎంతప్రయత్నం చేసినా దీనిమూలకూ— మూలరీ తెలియడం లేదు.

ఇంతవరకూ ఇది ఫలానా వ్యాధి అని నిరూపించ లేకపోయినాను. దీనికి వేరే పేరు పెట్టవలసి వచ్చేటట్టుంది. నాకు తెలియక అలా విడిచిపెట్టా ననుకుంటా రేమో నని, ముగ్గురు Specialists ను కూడా తీసుకొచ్చి పరీక్ష చేయించానుకదా. వాళ్ళకుకూడా ఏమీ అంతు పట్టలేదు. ఇంక నేను చేయ తగ్గది ఏమీ కనుపించదు. రత్నంలాంటిపిల్ల. అలా విడిచిపెట్టడానికి ప్రాణం ఒప్పడం లేదు.

వెంకటేశ్వర్లు: పోనీ, మరోసాధనం ఏమైనా చేయించ మంటారా?

డాక్టరు: అంటే?

వెంకటేశ్వర్లు: ఏ ఆయుర్వేద వైద్యమో చేయించి చూస్తేనో—

డాక్టరు: మీ కేమి టావెర్రి! శాస్త్రీయమైన వైద్యం, పెద్ద పేరు పొందిన వైద్యులూ బుర్రలు బుర్రలు బద్దలు కొట్టుకుని ఏమీ చెయ్యలేక నోరు మూసుకూర్చుంటే, ఏదో గచ్చాకూ, పుచ్చాకూ కలిపి ఇచ్చేవాళ్ళ చేతిలో పెడతా నంటా రేమిటి మీరు—

వెంకటేశ్వర్లు: గచ్చాకైనా పుచ్చాకైనా దానికీ ఒక శాస్త్రీయమూ పద్ధతీ ఉంది కాదూ? దానివల్లా రోగాలు కుదురుతోనూ ఉన్నాయి. అంతే కాకుండా మీ కసాధ్యం అనిపించిన వ్యాధులు అనేకం వాళ్ళు కుదురుస్తూనూ ఉన్నారుకదా.

డాక్టరు: నేను నమ్మను. అది పట్టి గుడ్డివాడిచేతిలో రాయిలాంటిది. ఏదో ఒకరోగం కాకతాళీ న్యాయంగా కుదిరినా అంతమాత్రం చేత అదో పెద్ద శాస్త్రం ఎలా అవుతుంది.

వెంకటేశ్వర్లు: ఏమో కాని, నాబుద్ధి కతీత మైనదీ, నాదృష్టి కగోచర మైనదీ, అసత్యమని కాని, అసలు లే దని కాని అనేటంత సాహసం నాకు లేదుసుమండీ. సరే, దాని కేమికాని, మ రిప్పు డేమిటి చెయ్యతగ్గది. ఒక దణ్ణంపెట్టి ఊరుకోవలసిందేనా!

డాక్టరు: మీకు కోపం వచ్చినా సరే కాని Quacks చేతుల్లోపడి బతికే

కంటే, శాస్త్రం బాగా తెలిసిన వైద్యుడు చేతులో చావు మంచిది. క్షమించండి, ఇంత నిర్మొహమాటంగా అన్నందుకు. మీ అమ్మాయి ఏదేనా miracle వల్ల బతకవలసిందే కాని మానవ మాత్రుడేమీ చెయ్యలేడు. సెలవు.

(ఈయన బయటకు వెడుతుంటే అమ్మాయి భర్త సుకుమార రావు లోపలికి వస్తాడు. గుమ్మంలో ఒకరి నొకరు చూసుకుంటారు. డాక్టరు వెళ్ళిపోతాడు. ఇతను లోపలికి వస్తాడు.)

వెంకటేశ్వర్లు: ఎవరు వారు?

సుకుమార్: నేనండీ తాతగారూ, సుకుమార్ ని. ఎలా ఉందండీ మీ మనుమరాలు?

వెంకటేశ్వర్లు: వచ్చావు నాయనా! ఇంకా రాలేదేమో అనుకుంటున్నాం. ఎలా ఉందని చెప్పను! ఇన్నాళ్ళనుంచీ పరీక్ష చేస్తున్న వైద్యుడు, ఈ వ్యాధేమిటో తన కంతు పట్టడం లేదని ఇప్పుడే చెప్పి వెళ్ళాడు.

(ఇంతలో గదిలోనుంచి మంగమ్మ ప్రవేశం.)

మంగమ్మ: వచ్చావు నాయనా! (అని కంట తడి పెట్టుకుంది.)

(ఒక్క క్షణం నిశ్శబ్దం.)

సుకుమార్: ఏదీ—ఎక్కడుంది?

(మంగమ్మ గదివైపు దారి తీస్తుంది. ముగ్గురూ నిశ్శబ్దంగా లోపలికి వెడతారు.)

[ ౨ ]

[గదిలో మంచంమీద అమ్మాయి ఒళ్ళు తెలియకుండా ఇటూ అటూ దొర్లుతూ మూలుగుతూ ఉంటుంది. సుకుమార్ ఒక్క అంగలో మంచం దగ్గరకు వెళ్ళి భార్యను కౌగలించుకొని ఏడుస్తాడు. మంగమ్మ

కాళ్ళకొట దిక్కున నిలబడి విచారిస్తూ ఉంటుంది. ముసలాయన ఒక కుర్చీ మీద కూర్చుంటాడు.]

వెంకటేశ్వర్లు: నాయనా! సుకుమార్! ఊరుకో బాబూ. ఏమిటి అలా అధైర్య పడతావు?

సుకుమార్: (నిశ్శబ్దం-ఎగుపులు మాత్రం విన పడుతుంటాయి.)

వెంకటేశ్వర్లు: అమ్మాయి, ఏమి టది? అతనికి కాస్త ధైర్యం చెప్పడం పోయి, ముందు నువ్వే ఇలా అయితే ఎలాగు? కంఠంలో ప్రాణ మున్నంత సేపూ, మనం పరమేశ్వరుడుమీద భారం వేసి ధైర్యంగా ఉండవలసినదే—

మంగమ్మ: (కళ్ళు తుడుచుకుంటూ) లే! నాయనా, లే! విచారించి ఏమి చెయ్యగలం? ఆ శ్రీ వెంకటేశ్వరులవారే ఉన్నారు అన్నింటికీని.

వెంకటేశ్వర్లు: రా! బాబూ, ఇలా రా; కూచో ముందుసంగ తేమిటి?

సుకుమార్: ముందు సంగ తేమి టంటే, నేను మట్టుకు ఏమి చెప్పగలను ఇప్పుడు? ఇంత ఎక్కువగా ఉన్న దనుకో లేదు. కాస్త ముందుగా తెలిస్తే, పోనీ, ఏ చెన్నపట్టణ మేనుకు వెళ్ళేవాళమో, ఏదో చేసేవాణ్ణి. కొంప మీది కొచ్చే వరకూ నాకు సరిగా తెలియపరిచారు కారు.

వెంకటేశ్వర్లు: అలా అనడం ధర్మం కాదు. ఇక్కడ వైద్యలోపం ఏమీ జరుగ లేదు. శాయశక్తులా తంటాలు పడుతున్నాం. వైద్యుడు చెప్పినమాటలను పుచ్చుకుని నీకూ మీవాళ్ళకూ కూడా వ్రాస్తూఉన్నాం. దూరాన్ని ఉన్నావు. నీవు అధైర్య పడతా వేమో' నని, మీ అత్తగారు అంటున్నా, ఉన్న స్థితి ఎప్పటి కప్పుడు నీకు తెలియపర్చ మని చెప్పాను. ఇంతకూ హఠాత్తుగా ఇలా ముంచుకొచ్చింది. ఏం చేస్తాం! ఇలాటివి మనతోటి చెప్పి వస్తాయా—

సుకుమార్: ఆ డాక్టరు వట్టి పతితేనివాడు అయి ఉండాలి! ఇన్నాళ్ళు ఇలా మీరబెట్టి, ఊరు కుంటాడా! తనకు అంతు పట్టకపోతే, మొదటనే చెప్పి అఘోరించవలసింది!

వెంకటేశ్వర్లు: తొందర పడకు బాబూ!

సుకుమార్: తొందర లేమి టండీ? వీళ్ళదగ్గరుండే తెగులే ఇది. చేత కాదని చెప్పడానికి వెధవ పౌరుషం! ప్రాణం అంటే దమ్మిడీ ఎత్తు లక్ష్యం లేదు.

వెంకటేశ్వర్లు: లక్ష్యం లేకేమి నాయనా! ఉన్నది. ఉన్నది కనుకనే రాత్రనక పగలనక, ఎండనక వాననక, మనం రమ్మన్నప్పుడల్లా వచ్చి నిద్రాహారాలు మానుకుని అవస్థ పడుతుంటారు. వాళ్ళు మట్టుకు సుఖపడలేకనా! కాని మానవ విజ్ఞానం, ప్రజ్ఞా, పరిమితము అన్నమాట మరచి పోకూడదు. వాళ్ళకు తెలిసినంత వరకూ ఏలోటూ చెయ్యరు. వాళ్ళ బుద్ధి కతీతమైన దాని కేం చేస్తారు. అందుకనే, ఆయన న్యాయంగా ఇప్పుడే తనకి దంతా అయోమయంగా ఉన్నదనీ, తనవల్ల కాదనీ చెప్పాడు.

సుకుమార్: ఈ స్థితికి వచ్చిన తరువాత చెప్పేం, చెప్పకేం?

వెంకటేశ్వర్లు: నాకు తోచినపని ఒకటి చేశాను. ఈ ఊళ్ళో ఒక విచిత్రమైన వ్యక్తి ఉన్నాడు. అతను ఒక విధమైన ఆయుర్వేద వైద్యుడు. మామూలు పద్ధతిలోవాడు కాడు. జన సామాన్యానికి అతనిమీద విశ్వాసం తక్కువ. కాని నాకు మట్టుకు ఏదో కొంత గురి ఉండి అతనికి కబురు పంపించాను. వస్తాడనుకుంటాను. ఏమి చెపుతాడో చూద్దాం. అంతకంటె మనం చెయ్యదగ్గ దేమీ కనుపించదు.

సుకుమార్: కదపడానికేనా వీలు లేదాయెను మనిషిని.

మంగమ్మ: ఎవరెన్ని చెప్పినా సరే కాని, ఇది వంట పుట్టిన జబ్బు కాదు. ఏ వైద్యుడికీ లొంగేదీ కాదు.

సుకుమార్: (కొంచెం వెటకారంగా) అలాగా— పాపం ఆ సంగతి తెలిసుండి, ఇంత కాలం ఎందుకు వైద్యం చేయించారు?

మంగమ్మ: ఊరుకోలేక. అయినా ఆడదాన్ని, దిక్కుమాలినదాన్ని: నా మాట వినేవా రెవరు? చేసేవా రెవరు?

సుకుమార్: అదేమిటి, మీ ఇంట్లో మీమాట విననివా రెవరుంటారు?

మంగమ్మ: అంత అదృష్టమా అని—ఎవరిదా కానో ఎందుకు నాయనా, నువ్వు విన్నావా ఏమిటి? ·

సుకుమార్: ఓహో! నామీదనే వడ్డదా! ఏమి! నేనెప్పుడు వినలేదు మీ మాట? మీ అమ్మాయిని ఎప్పుడు పంప మంటే అప్పుడు పంపి, ఎన్నాళ్ళుంచ మంటే అన్నాళ్ళు ఉంచి, మీ ఇంటిచుట్టూ తిరుగు తున్నందుకా ఇది?

మంగమ్మ: నీ పెళ్ళాం కోసం నువ్వు తిరగడం ఎవరికి ఉద్ధరింపు! దాని కేం కాని—పిల్లకి మొక్కుంది నాయనా! అది తీరిస్తేనే కాని దానికి సుఖంగా ఉండదని ఎన్నివిధాల మొత్తుకున్నా విన్నావా? నామాట గడ్డి పరక కింద కట్టి పారేశావు! ఇప్పుడు ముందుకొచ్చింది!

సుకుమార్: ఓహో! అదా సంగతి!

మంగమ్మ: అవును, అదే సంగతి. కుర్రదానికి రోగం లేదు, రొష్టూ లేదు, ఆ ఏడుకొండలవాడు బాకీ వసూలు చేసుకోడాని కొచ్చాడు. ఇది రోగం కాదు, కనుకనే దాని సుఖ్యా— సుఖం ఎవ్వరికీ దొరకడం లేదు.

సుకుమార్: మీకుమట్టుకు దొరికింది పాపం. అయితే దానికి తగ్గ చికిత్స ఏదో మీరే చెయ్యకపోయారూ, ఇంత డబ్బు ఖర్చుపెట్టి వైద్యం చేయిం చక పోతేను?

మంగమ్మ: నా చేతులో ఉన్న దైతే అప్పుడే చేసేదాన్ని.

సుకుమార్: మీ చేతిలో కాకపోతే ఇం కెవరి చేతులో ఉంది! రోగ నిదానం తెలిసినవారికి చికిత్స తెలియకపోతుందా?

వెంకటేశ్వర్లు: తెలియ కేం—తెలుసును. అదే ఆవిడ చెపుతున్నది, నువ్వు వచ్చేసరికి.

సుకుమార్: అలాగా!

వెంకటేశ్వర్లు: శ్రీ వెంకటేశ్వర స్వామి మా ఇలవేల్పు. అందుకనే నా పేరు వెంకటేశ్వర్లు అని పెట్టారు మా వాళ్లు. నీ వివాహం ముందు

మిమ్ముల నుభయులనూ వివాహం కాగానే తిరుపతి తీసుకువెడతా నని మొక్కుకున్నదట. అందుకు నీవు అంగీకరించని కారణంచేత ఆ మొక్కు చెల్లలేదు. ఆపైన నీ కార్యంముందు పిల్లకు చాలా జబ్బుచేసిన సంగతి నీకు జ్ఞాపక ముండే ఉంటుంది. అప్పుడు మళ్ళీ మొక్కుకుంది, ఇదివరకు మొక్కు చెల్లించని అపరాధం కింద ఈ సారి పిల్ల వస్తువులు నిలువుదోపు ఇస్తా నని. దానికి నీవు అంగీకరించలే దట. ఈ రెండు మొక్కులూ చెల్లించని కారణంచేత. స్వామి కిప్పుడు ఆగ్రహం వచ్చిం దనీ, ఆ కారణం చేత ఇంత జబ్బు చేసిం దనీ ఆమె నమ్మకం.

సుకుమార్: అలాగా!

వెంకటేశ్వర్లు: ఆవిడ నమ్మకమే కాదు. స్వామి ఆమెకు స్వప్నంలో కనపడి చెప్పా డట. పైగా వేణి ఇ మ్మన్నా డట.

సుకుమార్: ఇచ్చుకో మనండి. ఆవిడ ఏమి ఇచ్చుకుంటే మట్టుకు నా అభ్యంతర మే ముంది?

మంగమ్మ: బాగానే ఉంది. నీ వేళాకోళాలూ నువ్వూను! ఈ వేళాకోళాల తోనూ వెక్కిరింపులతోనూ ఇంతవరకు తెచ్చావు. నే నిచ్చే దైతే నీ సెల వెందుకు? ఆరోగ్యం ఈ జన్మ కింక లేదు. ఏ అర్ధణా డబ్బులతోనో నా ఇబ్బంది తీరిపోతుంది.

సుకుమార్: వేళాకోళ మేమిటి? మిమ్మల్ని అడిగా డంటే మీ దేమో ననుకున్నాను. మీది కాకపోతే నా దా. ఏమిటే కొంపతీసి!

మంగమ్మ: నీది కాదు, నాది కాదు. పిల్లది. పాపం, ఏమీ ఎరగదు.

సుకుమార్: ఓహో! ఇ దొకటి నిశ్చయించారన్న మాట.

వెంకటేశ్వర్లు: ఏమీ నిశ్చయించ లేదు. ఆవిడ విశ్వాస మది.

సుకుమార్: ఇలాంటి మూఢ విశ్వాసాలు పెట్టుకునే రోగం అలా ముదర పెట్టారు.

వెంకటేశ్వర్లు: నువ్విలా అనడం న్యాయం కాదు. ఎంతైనా మా పిల్ల,

తరువాత నీళ్ళార్చాను. అందుచేత దాని ఆరోగ్య విషయంలో నీకున్నంత బాధ్యత మాకు ఉంది. దానికి నలత ప్రారంభించి నప్పటినుంచీ వైద్యం చేయిస్తూనే ఉన్నాం. ఈ మధ్యనే మీ అత్తగారికి ఈ అనుమానం కలిగింది.

మంగమ్మ: ఇలా అని పోతా డనే అన్నిటికీ నోరు మూసు కూరు కున్నాను.

సుకుమార్: నే నన్నా నని కోపమే కాని ఈ కాలంలో ఇంకా తిరుపతి వెంకటేశ్వర్లూ, మొక్కులూ ఏమి టండీ!

వెంకటేశ్వర్లు: ఈ కాల మేమిటి, ఆ కాల మేమిటి? దేవుడు అన్ని కాలాల వాడూను.

సుకుమార్: నేను దేవుడు సంగతి కాదు చెప్పేది ఆ వెంకటేశ్వర్ల సంగతి.

(మంచం మీద రాజ్యం మూలుగు)

వెంకటేశ్వర్లు: మనవాళ్ళు కొందరు దేవుడికే వెంకటేశ్వర్లని పేరు పెట్టారు.

సుకుమార్: హా-హా-హ్హా వెంకటేశ్వర్లు దేవుడే అయితే ఇలా ప్రవర్తించడు.

(మళ్ళీ రాజ్యం మూలుగుతుంది)

మంగమ్మ: మనం ఎంత తెలివైనవాళ్ళమైనా దైవనింద కూడదు. ఆ పరుషవాక్కులు చెవిని పడగానే బాధ ఎక్కువవుతోంది బిడ్డకు.

సుకుమార్: Rubbish.

వెంకటేశ్వర్లు: ఆయన ప్రవర్తనలో ఏమిటి లోటు కనిపెట్టావు?

సుకుమార్: అంతా లోటే! ఈయనగారు, I mean this Tirupati fellow— తను దేవుణ్ణిఅనీ, తన దర్శనం చేసుకొని ముడుపు చెల్లించుకుంటే రోగాలు రొచ్చులూ నయం చెయ్యగల ననీ, కష్టాలూ నష్టాలూ రాకుండా చెయ్యగల ననీ అలా తన దగ్గరకు రాకపోతే అనేక ఇబ్బం

దులు కల్పించగల నవీ పంచమ దళం చేత కోలెడంత ప్రచారం చేయిస్తున్నాడు. ఇంతకంటె better advertised person కాని సరుకులు కాని దేశంలో కనపడలేదు. మన మందమతులు ఆ దంతా నిజం అనుకోడం, కాస్త తలనొప్పి వచ్చేసరికి తిరుపతి బయలుదేరడం, ఉన్న లొడ్డు లొసుకూ అక్కడర్పించి మరింత దరిద్రం అనుభవించడమూను. How ridiculous! ఇటువంటి మూఢ విశ్వాసాలు పోతేనే కాని దేశం బాగుపడదు.

మంగమ్మ: ఆ వేం లేకుండా మీరు దేశాన్ని ఏమాత్రం ఉద్ధరిస్తున్నది చూస్తున్నాం కాదూ!

వెంకటేశ్వర్లు: దేవుడున్నా డనే నమ్మకం, ఆయన మీద విశ్వాసం ఉండడం మూర్ఖతంటావా?

సుకుమార్: నా ఉద్దేశం అది కాదు తాతగారూ! దేవుడిమీద నమ్మకం ఉండకూడదని కాదు. ఈ చచ్చు రాళ్ళే దేవుళ్ళనవద్దని నా గోల.

వెంకటేశ్వర్లు: నాయనా! యద్భావం తద్భవతి. రాయి అయితే నేం రప్పయితే నేం, ఏ దైతే నేం? నమ్మకం ఉన్నవాడికి అణువు మొదలు బ్రహ్మాండంవరకూ సమస్తం ఈశ్వర మయమే!

సుకుమార్: కావచ్చు. అది వేరేసంగతి. ఆ మహత్తరమైన భావం, సర్వ సమత్వం, మరచిపోయి కనపడ్డ ప్రతి నల్లరాయి ఇటుకబొంతా దేవుళ్ళని, వాట్లకు కోలెడంత డబ్బు తగలేసి దేవాలయాలు నిర్మించి, మొక్కుబళ్ళనీ, ఉత్సవాలనీ, ఊరేగింపు లనీ ఇంకా ఉన్నది ఊడ్చి, దేశం దిబ్బ చెయ్యడం ధర్మమేనా! ఈ డబ్బంతా ఉంటే ఎన్నెన్ని ఆస్పత్రులు కట్టవచ్చు. ఎన్నెన్ని యంత్రశాలలు నిర్మించవచ్చు; ఎంతమంది బీదసాదలను రక్షించవచ్చు. ఈ విగ్రహాలూ ఈ దేవాలయాలతో విశాలం, విశ్వాతీతం కావలసిన మానవదృష్టి సంకుచితం చేసి, సమస్త కార్యములూ వీటివల్లనే సిద్ధిస్త వని

నమ్మించి జనసామాన్యాన్ని మూర్ఖులనూ, క్రియా శూన్యులనూ చేస్తున్నారు మన పెద్దలు.

వెంకటేశ్వర్లు: నువ్వు చెప్పింది నిజమే, కాదనను. నీ సంఘసేవ కూడా ఈశ్వరారాధనే. ఇదో మోస్తరు విగ్రహారాధన. శరీరబాధ నివారించడానికి ఆస్పత్రులు ఎంత అవసరమో భవబాధ నివారించడానికి దేవాలయాలు అంత అవసరమూను.

సుకుమార్: అలా అని ఊరికే మనం ఊహిస్తున్నాం.

వెంకటేశ్వర్లు: ప్రతివాళ్ళూ గాలిలో ఎగరలేరు కాదూ. నేలమీద నడిచే వాళ్ళకు నేల ఆసరా లేకపోతే ఎలాగా? ఏదో ఒక ఆధారం కావలెననుకున్నంత మాత్రంచేత వాళ్ళదృష్టి సంకుచిత మవుతుందో కాదో చెప్పలేను. కాని వాళ్ళ జీవితం మట్టుకు కొంత శూన్యంగా ఉంటుంది. మీ యువకులందరికీ దేశాన్ని ఉద్ధరిద్దామనే ఉత్సాహమే కాని, ఆ కార్యం ఏరీతిగా చెయ్యాలనో, ఏమి అవసరమో తెలుసుకునే ఓపిక లేదు.

సుకుమార్: మమ్మల్ని వృథాగా నిందించడమే కాని మా ఆశయాలేమిటో తెలుసుకునే ఉదార హృదయాలు మీకూ లేవు.

వెంకటేశ్వర్లు: వ్రజల విగ్రహాలను బద్దలు కొట్టి, వాళ్ళ అర్చనలకూ ఆరాధనలకూ అవకాశం లేకుండా చెయ్యవలెననే ఉత్సాహంలోనూ ఉద్రేకంలోనూ వాళ్ళ విశ్వాసాన్ని, ఆస్తిక్య బుద్ధినీ నాశనం చేస్తూన్నారు. ఇవ్వాడున్న ఇల్లు బాగా లేక బద్దలు కొట్టవలెనంటే, వేరే ఇల్లు చూపించి మరీ ఇది పాడుచెయ్యాలి, కాని ముందిది నిర్మూలనం చేసి ఇంట్లో ఉన్న వాళ్ళను నిరాధారంగా వీధుల్లోకి తోలితే ఏలాగ? ఇంతకూ మీకు చేతనయింది నిర్మూలనమే కాని సృష్టి కాదు. మీకు నేర్పిన విద్య అంతటిదే. ఒక్క మాట నాకు తోచింది చెపుతాను. ఈ నిర్గుణారాధననీ, విశాలదృష్టి అనీ పెద్ద కబుర్లు చెప్పేవాళ్ళు చాలా మంది, నీకు కోపం వచ్చినా సరే, ప్రచ్ఛన్న నాస్తికులని నా నమ్మకం. పొరపాటు. నాస్తికులు కూడా

కాదు, యథార్థంగా నాస్తికులైనా కొంత నయమే. ఏమీ కాకుండా దైవ చింతే లేకుండా ఉన్నారు.

మంగమ్మ: బాగా అన్నావు. వాళ్ళ పోకు లేమిటో వాళ్ల వేషాలేమిటో అంతేనే కాని, దేవుడూ అక్కర్లేదు దెయ్యమూ అక్కర్లేదు వాళ్ళకి.

సుకుమార్: పొరపాటు, చాలా పొరపాటు! ఒకవేళ మీ రన్నదే నిజమనుకున్నా మీ మూఢభక్తికంటే తెలివైన నాస్తికతే మంచిది.

(మంచంమీద మూలుగు)

మంగమ్మ: ఇప్పుడీ దిక్కుమాలిన తర్కం ఏమిటి నాన్నా పిల్లసంగతి చూడక?

వెంకటేశ్వర్లు: ఎంతటి తెలివితేట లయినా, విశ్వాసంతోటీ, భక్తితోటీ సమానం కావు నాయనా! ఇప్పుడు నాకూ విగ్రహారాధనంటే ఇష్టం లేదు. మూఢభక్తి నాకూ ఇష్టం లేదు. కాని ప్రజాసామాన్యానికి ఏ రాయో, రప్పో, గుడ్డో, కుంటో, వాళ్ళ దేవుళ్ళు వాళ్ళ కుండొద్దూ! చిన్న పిల్లలు చూశావు—ఎంత దరిద్రులైనా, పగిలిపోయినదో, విరిగిపోయినదో ఆఖరుకు ఒక తాటాకు ముక్కో, పెంకుముక్కో, బొమ్మని అనుకుంటేనే కాని వాళ్ళకు కాలక్షేపం కాదు. వయస్సులో ఎంత పెద్దవాళ్ళమైనా సృష్టి పరిణామంలో మనం అంతా చంటిపిల్లలమే కాదూ!

సుకుమార్: అయితే వాళ్ళకు ఎదుగు బొదుగు లుండవా? అక్కర్లేదా?

వెంకటేశ్వర్లు: కానూ కావాలి. ఎదగనూ ఎదుగుతారు. కాని అంతవరకూ వాళ్ళబుద్ధి వికాసం పొంది, ఈశ్వరుని నిర్గుణ, నిరాకార, నిర్వికార, సర్వాంతర్యామిత్వం పూర్తిగా అవగాహన చేసుకొని, అనుభవంలోకి తెచ్చుకో కలిగేదాకా వాళ్ళ విశ్వాసాలూ వాళ్ళ నమ్మకాలూ వాళ్ళ కుండనియ్యి. దానివల్ల వాళ్ళకు కాని, దేశానికి కాని, వచ్చిన ముప్పేమీ లేదు. భక్తి విశ్వాసాలూ క్రియా శక్తికి పూర్వరూపాలు. పరిపూర్ణమైన

భక్తి ఇచ్ఛాశక్తిని సక్యమైన మార్గంలో నడిపించి, క్రియాశక్తిగా పరిణమింప చేస్తుంది. అందుచేత నీ భక్తి వల్ల ప్రజలకు కలిగే కొంత ఆనందం కూడా లేకుండా చేసి వాళ్ళ నంధకారంలో వదేస్తా ననడం ధర్మమా?—

సుకుమార్: అంధకారంలో ఏమీ పడెయ్యడం లేదు. రాళ్ళే శాశ్వత మనుకుని చలనం లేకుండా ఎదుగుబొదుగులు లేకుండా కూర్చున్న వాళ్ళకు కొంత వని కల్పించా నన్నమాట. వాళ్ళ తెలివితేట లుపయోగించి, అసలు వస్తువును తెలుసుకోడానికి ప్రయత్నిస్తారు.

వెంకటేశ్వర్లు: నే ననేది అంతవరకూను. వాళ్ళను నిరాధారంగా విడిచి పెట్టడం చాలా ప్రమాదం.

సుకుమార్: ఏమీ ప్రమాదం లేదు. మనం భ్రమ పడ్డమే ప్రమాదం—

వెంకటేశ్వర్లు: నాయనా! అనేక శతాబ్దాలనుంచి ప్రజలు కష్టంలోనూ, నిరాశలోనూ, నిస్పృహలోనూ ఏమీ తోచక, ఏమీ చెయ్యలేక దైవ సన్నిధినే పరిపూర్ణ విశ్వాసంతో, భక్తితో, ఈ దేవాలయాలకు వచ్చి అక్కడ స్వామిసన్నిధిని, వాళ్ళ ఆశలూ, ఆశయాలూ ప్రార్థనలూ వెళ్ళబోసుకుని కొంత సునశ్శాంతితో వెళ్ళిపోయారు. ఆమనుష్యులు పోయినా; ఆ దేవాలయాలు ఆ దేవుళ్ళూ మిగిలారు. ఆ ప్రార్థనలూ ఆ మంత్రాలూ వాయు తరంగాలలో లీనమై అక్కడ శాశ్వతంగా ఉండిపోయి, తరువాత తరాల వాళ్ళకు సహాయ పడుతున్నాయి. వాళ్ళ ఈ ఆశాలత కాస్తా ఎందుకు తెంపుతా నంటావు నాయనా! వాళ్ళకు తగిన విద్య నేర్పి బుద్ధి వికాసం కలిగించవలెనే కాని కేవలం నిర్మూలనంవల్ల ఏపనీ జరగదు బాబూ!

మంగమ్మ: అయ్యో—ముంచుకొస్తోంది. పిల్లవాడేమిటి నాన్నా?

సుకుమార్: జర కేం చేస్తుంది? మహాచక్కగా జరుగుతుంది. ఈ పాతవిశ్వాసాలూ నమ్మకాలూ పునాదులతో పెళ్ళగించి పారావేస్తేనే కాని పునర్నిర్మాణం పునస్సృష్టి చెయ్యడానికి వీలుండదు: ఈ తిరుపతి అయినా ఉన్నాదే ఇలాటివాళ్ళు అంతా పోవాలి.

మంగమ్మ: ఆ ఆ హరి హరి! (అని చెవులు మూసుకుంటుంది.)

(బయట పెద్ద ఉరుములు. చప్పుడు మంచంమీద నుంచి వెర్రికేక. అందరు మంచందగ్గరకు పరుగెడతారు.)

మంగమ్మ: అయ్యో, నాతల్లోయి! ఇంకేముందోయి దేవుడా! (అని రోదన)

సుకుమార్: రాజ్యం నా రాజ్యం! (అని ఏడుపు)

వెంకటేశ్వర్లు: తొందర పడకండి, భయం లేదు. ఏమిటి, హఠాత్తుగా గదంతా ఇలా చల్లపడి పోయిందేం—

(ఆ మాటలో ఆయుర్వేద వైద్యు డొస్తాడు)

వెంకటేశ్వర్లు: ఎవరు వారు?

వైద్యుడు: నేను చంద్రశేఖరాన్నండి. తమరు రమ్మన్నారంటే

వెంకటేశ్వర్లు: రండి బాబు సమయానికి దేవుడులా వచ్చారు. ముందు అమ్మాయిని చూడండి.

చంద్రశేఖరం: (అమ్మాయిని పరీక్ష చేస్తాడు) అయ్యా, మీ రేమీ అనుకోకుండా ఉంటే ఒక్క సంగతి మనవిచేస్తాను. ఈ అమ్మాయికి శారీరక మైన రుగ్మత ఏమీ కనుపించదు.

మంగమ్మ: ఆ. అలాగాండి—

సుకుమార్: మ రైతే ఏ మంటారు?

చంద్రశేఖరం: మీకు నమ్మక ముండ దేమో నని సందేహిస్తున్నాను.

మంగమ్మ: మాకు నమ్మకం లేకపోవడ మేమి టండీ?

సుకుమార్: అయినా చెప్పండి.

వెంకటేశ్వర్లు: పరవా లేదు. మీ రేమీ సందేహించ నక్కర లేదు చెప్పండి.

చందశేఖరం: ఈపిల్ల నేదో దేవతో, దెయ్యమో ఆవహించింది. అది వదలి పోతే పిల్ల నిక్షేపంలా ఉంటుంది.

మంగమ్మ: అదుగో విన్నారా, నీ అమ్మకడుపు చల్లగా, ఉన్నమాట చెప్పారు తండ్రీ—

సుకుమార్: చెయ్యి చూస్తే ఎలా తెలిసిందండీ? ఇదేదో—

(పైన పెద్ద ఉరుములూ మెరుపులూనూ)

చంద్రశేఖరం: అయ్యా, మీకు చిన్నతనం ఇప్పుడు తెలియకు లెండి. వారు పెద్దలు అడిగారు, గనక వారియందుండే గౌరవముకొద్దీ నా అభిప్రాయం చెప్పాను కాని మరొకళ్ళు రమ్మంటే రాను— మాట్లాడను.

వెంకటేశ్వర్లు: మా అమ్మాయి అభిప్రాయంకూడా అదే నండీ—శ్రీ వెంకటేశ్వర స్వామి ఆవహించాడని.

సుకుమార్: I don't believe it. ఇదంతా ఆవిడ పన్నిన పన్నాగం—

చంద్రశేఖరం: అయ్యా! తొందర పడకండి. మనం మృత్యుసన్నిధిలో ఉన్నాం. మన నమ్మకాలూ తెలివితేటలూ ఏమీ పని చెయ్యవు.

వెంకటేశ్వర్లు: ఎవరు వారు?

చంద్రశేఖరం: క్రొత్తవా రెవరూ రాలేదండి—

వెంకటేశ్వర్లు: అయ్యో, రాకపోవట మేమి? మరి వా రంతా ఎవరు? ఎవ్వరూ రాలేదు. గదంతా జనంతో నిండిపోయినట్లుంది. హఠాత్తుగా గదంతా ఇంత చల్లబడి పోయింది. చంద్రశేఖరం గారూ, తరుణం సమీపించినట్లుంది.

చంద్రశేఖరం: చిత్తం- వ్యవధి లేదు. నిమిషాలలోకి వచ్చింది. పిల్ల దక్కవలెనంటే, మీ మొక్కుబడు లేమైనా ఉంటే వెంటనే చెల్లించుకుంటా మని మళ్ళీ మొక్కుకోండి. ఆ స్వామి అనుగ్రహముంటే ఈ బిడ్డ జీవించాలి, కాని మానవమాత్రుడేమీ చెయ్యలేడు. సెలవు (అని వెళ్ళి పోతాడు.)

(వెంకటేశ్వర్లుగారు తలవంచుకుని నమస్కరిస్తూ కూచుంటాడు. పైన పెళ ఉరుముల చప్పుడు, మంచంమీద పెద్ద కేక.)

వెంకటేశ్వర్లు: అయ్యో, పిల్లరోయ్!

మంగమ్మ: అయ్యో, నాతల్లోయి! ఇంకేముందోయి — నాబిడ్డ గొంతుక చేతులారా కోసుకున్నానోయి! నా తండ్రీ—వెంకటాచలపతీ! ఇంత వరకూ తెచ్చావు నాయనా— ఇంక నాగతేమిటి తండ్రీ— (అని ఏడుస్తూ గదిలోనుంచి పరుగెత్తు కెళుతుంది.)

సుకుమార్: అయ్యయ్యో రాజ్యం నన్ను విడిచి పోతావా రాజ్యం మాట్లాడవూ— ఒక్కసారి చూడవూ, రాజ్యం—రాజ్యం—నాగతేమిటి! రాజ్యం—

(అని వెక్కి వెక్కి ఏడుస్తుండగా లోపల గణ గణ గంట వినబడుతుంది.) అయ్యో, పరమేశ్వరా, దయామయా, వెంకటేశ్వరస్వామీ, నా అపరాధం మన్నించు తండ్రీ! నా రాజ్యాన్ని రక్షించు స్వామీ— నీ దివ్య దర్శనం చేసుకుని నీకు నిలువు దోపూ, వేణీ, అర్పించుకుంటాం స్వామీ—అయ్యో, రాజ్యం—

(అని ఏడుస్తుండగా లోపలనుంచి మంగమ్మగారు తడిబట్టలతో హారతి తీసుకొచ్చి రాజ్యం కళ్ళకూ వొంటికీ అద్దుతుంది. క్షణంలో రాజ్యం పెద్ద నిట్టూర్పు విడుస్తుంది. తల్లీ మొగుడూ అమ్మాయి కేసి చూస్తారు. నెమ్మదిగా కళ్లు తెరుస్తుంది. ఇటూ అటూ చూచి దాహం అని సంజ్ఞ చేస్తుంది.)

మంగమ్మ: నాతల్లి బతికింది! తండ్రీ, రక్షించావు నాయనా—

వెంకటేశ్వర్లు: ఆ— అలాగా అంటుకనే గది మళ్ళీ నిర్జనమై, ఆ చల్లదనం పోయింది— వెంకటేశ్వరస్వామి అనుగ్రహం ఉంటే లోటేమిటి—

(నెమ్మదిగా కాసిని పాలు పోస్తారు. ఆమె భర్తకేసి చూచి చెయ్యి చాపి వచ్చారా! అంటుంది.)

సుకుమార్: రాజ్యం! (అని ఆమె చెయ్యి పట్టుకుని వెక్కి-వెక్కి-ఏడుస్తూ చెయ్యి ముద్దు పెట్టుకుంటాడు. రాజ్యం నెమ్మదిగా అతని తల-నిమురుతుంది. వెంకటేశ్వర్లుగారు వెంకటేశ్వరస్తుతి చేస్తారు.)

అత్ర్యాది సప్తఋషయ స్సముపాస్య సంధ్యా
మాకాశసింధుకమలాని మనోహరాణి
ఆధాయ, పాదయుగ మర్చయితుం ప్రసన్నాః
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్!

౧౯౪౩

# శిల్ప నిద్ర

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి

[ఆరామవాటికలో లతాగృహము. రంగులదీపాలు. చంద్రోదయ మయింది. వెన్నెల పర్యంకంమీద పడుతూ, జ్యోత్స్నాభిసారికలాగా ఆదర్శంగా ఆసీన అయిననిర్మలకు వన్నె పెట్టుతున్నది. కొంచెందూరాన ఆమెభర్త చిత్రకారుడు, కుంచెతో పటము చిత్రిస్తూ ఉంటాడు. పటము చాలాభాగం అయింది. ఇమె మధ్యమధ్య కదులుతుంది.]

కాంతిదేవ: అదుగో మెడ వంచేస్తున్నావు! కొంచెం పక్కకు ...కుడి వైపుకు వెనగ్గా ఎత్తాలి...నీవాలకొలను చెరిపివేయ వద్దు. ఒక్కక్షణం సరిగా కూడుంటే తర్వాత నీయిష్టం వచ్చినట్టు వెళ్ళిపోవచ్చు.

నిర్మల: [చలనం కనబరచి] అబ్బా, ఎంతసేపు. ఈగోల ఎరక్క పోయి ఆదర్శంగా కూచోటానికి ఒప్పుకొన్నాను.

కాంతిదేవ: అదుగో, కదిలిపోయినావు. బొమ్మ కాస్తా సరిగా రాదు. ఈఒక్కసారి కదలకుండా ఉన్నావంటే ఇక మళ్ళీ ఇది పూర్తయేదాకా ని న్నేమీ అడగను.

నిర్మల: అది ఇప్పుడే కానూ కాదు, నాకు స్వేచ్ఛ లేదు! ఖైదులో వేశారు. కూచోక తప్పుతుందీ! సరే - కానీయండి [అని కదలకుండా మెదలకుండా స్థిరత్వం వహిస్తుంది]

కాంతిదేవ: ఇందాకటి మాదిరిగానే కూచోవాలి. అలాగే ఆకా శిటు కొంచెం తిప్పు. కుడిచేయి వెనక్కు పోవాలి. ముఖం కుడివైపు కొరగా వరిగితే బాగుంటుంది...[ఆమె ఆవిధంగా అనుసరిస్తుంది. కాంతిదేవుడు యథాప్రకారంగా ఆమెవంక చూస్తూ, చిత్రిస్తూ మధ్యా మధ్య] మేలి

ముసుగు బుజాలమీద పడిపోయింది. సవరించాలి... [ఆమె దిద్దుతుంది. రచన సాగుతుంది. తటాలున లేస్తుంది కాసేపటికి] క్షణం సరిగా కూచోవు గదా! ఇంత అల్లరిదాని వంటే పెళ్ళి చేసుకొనేవాణ్ణేనా?

నిర్మల: మిమ్మల్ని చూసినప్పటినుంచీ మీపోలికే వచ్చింది నాలోకి నే నేం చేస్తాను. అదీ నాతప్పా?

కాంతిదేవ: ఏదో ఒకవిధంగా నామీద తప్పు కట్టేయా అని నీఆలోచన. సరేలే కాని. తప్పంతా నాదే. ఓపికపట్టి కదలకుండా రెండునిముషాలు కూచున్నా వంటే తర్వాత నీ కేం చేయమంటే అది చేస్తాను.

నిర్మల: త్వరగా గీసేయండి మరి. [యథానిర్దిష్టంగా కూర్చొని, కాసేపైనతర్వాత చాల్యహాసంతో కొంచెం కదిలి] మరి మీకు నే బాగున్నానా ఆ చిత్రమా? చెప్పండి చూద్దాం.

కాంతిదేవ: విషమప్రశ్నే. కాని కొంచె ముందు చెప్తా.

నిర్మల: [కాసేపు సరిగా ఉండి, తర్వాత] మీరు ప్రేమించేది నన్నా, నాచిత్రాన్నా?

కాంతిదేవ: రెంటినీ. [అని వ్రాసుకొంటూ ఉంటాడు.]

నిర్మల: అదెట్లా కుదురుతుంది? బొమ్మకు ప్రాణముం దేమిటి?

కాంతిదేవ: ప్రాణముంటేనా ప్రేమించేది?

నిర్మల: ఐతే నన్ను వదలివేయండి. బొమ్మన్నది కాదా మరి?

కాంతిదేవ: కాని బొమ్మెట్లావచ్చింది? నీ వుండబట్టేనా? [మెల్లమెల్లగా చిత్రలేఖనక్రియలో మగ్నుడౌతాడు. కాలం గడుస్తూ ఉంటుంది.]

నిర్మల: [అటూ ఇటూ చూచి మళ్ళీ కదిలి] ఇది యెప్పుడు పూర్తి ఔతుంది? ఎన్నోరోజులనుంచి గీస్తున్నారు ...మీరు నాకు చేసినవాగ్దానం జ్ఞాపకమున్నదా?

కాంతిదేవ: నే నేం చేశాను?

నిర్మల: బొమ్మ నా కివ్వాలనే దస్తుం దని మరవుకూడానా? ఇలా

జరుగుతుందంటే నేను ఆదర్శంగా కూచునేదాన్నేనా? సరే, ఇదిగో నే లేచిపోతున్నా [అని లేస్తుంది.]

కాంతిదేవ: భలే బాగుందిలే! చూశావా, నీకెలా కోపం తెప్పించానో?

నిర్మల: మీ ప్రజ్ఞ అడగాలి ఇంకా! [ఏమీ పట్టనట్లభినయించి, విసుగు కనపరుస్తుంది]

కాంతిదేవ: కానేవుకూడా కాలు కదపకుండా ఉండలేవు కదా. ఏదో వంక పెట్టుకొని తిరగాలని చూస్తావు నీకిచ్చినమాట మళ్ళీ కాదని యెట్లా అంటాను? ఇది ఇవాళ్ల పూర్తి ఔతుంది. రేపుసాయంకాలానికి నీ కలంకరణం చేసి, ఈకానుక ఇస్తా సరేనా?

నిర్మల: ఎన్ని ఇవాళ్లలు గడవలే దిప్పటికి? అందులో ఇదొకటి... ఐతే ఎంతవరకు వచ్చిందో, ఏదీ ఇట్లా ఒకసారి చూడనీయండి!

కాంతిదేవ: అంతా ఐపోయినాక ఇస్తా.

నిర్మల: అప్పుడు తప్పులున్నయ్యంటే ఎట్లా దిద్దుతారు? మళ్ళీ నన్ను వేధించుకు తింటారు! అందుకని ఇప్పుడే యిస్తే సరిగా ఉన్నదీ లేనిదీ చూసి యిచ్చేస్తాను. [అత డివ్వడు]

నిర్మల: [అతని చేతిలో చిత్రం తీసికొని పరిశీలిస్తూ] ఇ దేమిటి, ఈ వాలకం? ముఖంమీద అన్నిముంగురులు నా కెప్పు డున్నా పడుతుండగా మీరు చూచారూ? ...ముక్కు కొక్కెంలాగా తయారైందే... కుచ్చెళ్ళు సరిగా రాలేదు చూశారా? ఇదేనా అన్నీ తెలుసు తెలుసంటూ ఇన్ని తప్పులు చేశారు?

కాంతిదేవ: చివరకన్నీ సరిగానే కనబడతైలే.

నిర్మల: ఏమో నాకుమాత్రం నమ్మకం లేదు, [క్షణం నిశ్శబ్దం. యుగాలు తిరిగినట్లనుమేయ మాశైఖరిలో] ఇక నే పోవచ్చునా? ఆలోచించుకొని చెప్పండి. మళ్ళీ ఆచిత్రమంతా ఐపోయిందనేదాకా కూచోను.

కాంతిదేవ: అంతా గీసుకొన్నానులే. నీయిష్టం వచ్చినట్లు తిరగవచ్చు...

[చిత్రాని కలంకారాలు దిద్దుతూ ఉంటాడు. ఆమె కదలదు] అదుగో పోలేదేం? బొమ్మ గీస్తున్నంతసేపూ కాలు నిలవలేదు. ఐపోయిందిగా. నీకూ స్థిమిత మేర్పడింది. కానీ కాసే పలాగే నిలుచో, ఇంకొక చిన్న బొమ్మ గీయాలి.

నిర్మల: ఎల్లుండి పొద్దున... [నిష్క్రమణ]

కాంతిదేవ: చిత్రమంతా బాగానే వచ్చింది. ఇంకా పావుగంట కూచుంటే సమగ్రమై పోతుంది. కాని కూచోదుగా. [లేఖన మభినయిస్తూ] ఇంకొక బొమ్మని చెప్పి కూచోబెట్టాలి. [ఆలోచించి] ముందీచిత్రం తెమ్మంటే దొంగ బయటపడతాడు. [దిద్దట మైపోతుంది] ఆఁ ఇంకేమీ అక్కరలేదు. అంతా ఐంది. దీని కలంకారాలు తొడిగి రేపుసాయంత్రమే ఇస్తాను. చంద్రోదయంలో జ్యోత్స్నాభిసారికాచిత్రమే బహూకృతి [దూరంగా ఉంచి వీక్షించి] శాంతి కలుగుతుందా గభీరచేతస్సుకు, [అని మోకరిల్లి చూచేసమయంలో విద్యుల్లతలాగా తటాలునప్రవేశిస్తుంది]

నిర్మల: ఐందా, ఇంకేమన్నా కొరతుందా?

కాంతిదేవ: ఉన్నా కూచోనన్నావుగా?

నిర్మల: ఇదెన్నాళ్ళ'నుంచి? మీరు కూచో మంటే నే నెప్పుడు కాదన్నాను?

కాంతిదేవ: దివ్యాసవం తేజరిల్లుతూ, నవోత్సుకత్వం పరివేష్టించే నీవే విలంబనను క్షణమైనా ఓర్వలే నట్లు ఇప్పుడే బయట పడ్డావు. మురిపించే భంగిమాలు వేస్తూ, దరహాసోన్మీలనాలలో తేలిపోయే నిన్నానాడు చూచి నా జన్మ తరించిన దనుకొన్నాను. [అని చిత్రం మూస్తాడు]

నిర్మల: ఐతే ఇప్పుడు తరించలే దన్నమాట?

కాంతిదేవ: అదుగో, కోపశాఖ నధిరోహించావు క్షణంలో.

నిర్మల: మీ రావృక్ష మైతే?

కాంతిదేవ: యౌవనశ్రీలలో ఊగే నీ చిత్రం నిర్మించటానికి ప్రియ

త్నించిన దంతా నీదయవల్ల, ఇప్పటికి సఫల మైనది. [చిత్రవీక్షణము]

నిర్మల: మీసదనవల్లరిలో లాలితా లైనలాస్యరచనలకు ప్రతీకగా వచ్చినట్లు భావించారు. కాని నాకోరిక యేదో మీరు గ్రహించలేదు.

కాంతిదేవ: నీలాలకలను దిద్ది అలంకార మిచ్చే నీవదనశ్రీని చూచినది మొదలుగా ముగ్ధుడ నైపోయాను. పల్లవవేష్టిత మైనఅక్షియుగళ మాకర్షించింది. నిన్ననువదించా లని శిల్పగీతిలో ప్రణవగాన మాలపించాను. కళాకలాపంలో శిఖరము సమీపించ గలిగినాను. గౌరీవిలాసమే పరిఘుగా పరిణమించి చిత్తవికాసశక్తికి లాలిత్యం తొడిగింది. నేత్రపర్వంగా నీవు కూర్చోటంచేత ఆకాముడనై చిత్రించాను.

నిర్మల: ఏమి టీఉపన్యాసమూ? మనం కలిసే నివసిస్తున్నా. మనఆశయాలు భిన్నాలుగా ఉన్నవి కాదూ? కలరావంతో పాడి, అనురాగంతో హసించా రని నమ్మి మీప్రాపు చేరినాను. కాని, మీకు చిత్రకళే నిజమైనప్రియురా లని ఇవాళే తెల్సుకున్నాను.

కాంతిదేవ: విలాసవీథుల్లో కోరిక లేశ మైనా నాకు లేదు. శోకసాగరంలో ఆహ్లాదము నామీద చిరకాల మాదరం చూపింది. చివరకు నిన్ను వెదికి పెట్టి, నిన్నే కళగా భావించ మని ఆజ్ఞ వినిపించింది. విరాగగీతి హారతి పట్టింది. [అరమోడ్పుకంటితో చిత్రమును, ఆమెను చూస్తాడు.]

నిర్మల: ప్రసిద్ధుని అనురాగలహరిలో నాకు సగభాగము వచ్చిందే అని ఉవ్విళ్ళూరి మిమ్ముల నంగీకరించాను. జ్ఞప్తికి తెచ్చుకోనండి.

కాంతిదేవ: నీ వప్పుడు బాలికలాగా కన్పించినావు. నన్ను కోరినావు. కానిలే, అని అమాయికత్వంతో ప్రేమించాను. తర్వాత నీవు బాలవు కావని గుర్తెరిగినాను. ఐనప్పటికీ వివాహం చేసుకొన్నాను. నీమీద పూర్తిగా ప్రేమ లే దంటా వని నాప్రథమచిత్రం నీకే అర్పిస్తా నని వాగ్దానం చేశాను [సాభిప్రాయంగా పరికిస్తాడు.]

నిర్మల: కాని, నామీద మీ కున్నది వాత్సల్యంకూడా కాదు. అంత

రంగికవృత్తిలో శూన్యత తాండవిస్తున్నప్పుడు, దానిని కప్పివేయటానికి బాహ్యాలంకారా లెన్ని తొడిగినా ప్రయోజన మే మున్నది?

కాంతిదేవ: నాహృదయం నీకు పూర్తిగా తెలియదు. నీచిత్రాన్ని ఎక్కువగా ప్రేమిస్తున్నానో, నిన్నో, చెప్పలేను. రెంటికీ సమాన మైనవేదికనే నామనస్సులో నిర్మించాను. దానిని మించిన ఉన్నతపీఠాలు, శృంగాలు లేనే లేవు.

నిర్మల: నిరవధి మైన కాల మున్నది కదా? [బయట అడుగులచప్పుడు. ఆనందో ఽహం అనే ధ్వనులు అవ్యక్తంగా వినబడుతవి. నిర్మల లోపలికి వెళ్ళి పోతుంది. ఆనంద దేవులు మెల్లమెల్లగా ప్రవేశిస్తారు. కాంతిదేవుడు నమస్కరించి ఆసనం చూపిస్తాడు. అతనిచేతిలో చిత్రఫలకం గురువులు తీసికొని, సమగ్రంగా పరిశీలిస్తాడు.]

ఆనంద: ఎంతకాల మైందోయి ఇది చిత్రించి? చాలా బాగుంది... కొద్దిమార్పులు చేయా లనుకో. ఐనా యోగ్యంగా, సుందరంగా దిద్దినావు.

కాంతిదేవ: ఇప్పుడే కొంతవరకు గీచి ఉంచాను గురూ!

ఆనంద: ఇదేనా, ఇం కేమన్నా, ఇదివరకు వ్రాసినవి ఉన్నవా?

కాంతిదేవ: ఇదే ప్రథమము, గురూ! [ప్రథమ మనేమాట చెప్పి నాలిక కరచుకొంటాడు. స్మృతి నభినయించి నిర్విణ్ణు డౌతాడు.]

ఆనంద: ఏమిటి, ఆవిధంగా వివర్ణమై పోయింది నీముఖం?... చిత్రకళావసిలో తిరిగే నీలో క్షణక్షణానికి మార్పు లేవీ విపరీతంగా రాగూడదు. స్థైర్యం చాలా అవసరము. కారణ మేమిటి?

కాంతిదేవ: [లేని ఉత్సాహాను నారోపించుకొని] ఏమీ లేదు, గురూ! ఏదో జ్ఞప్తికి వచ్చింది. దీనితో సంబంధ మేమీ లేదు. మీ రుపదేశించిన ప్రకార మాచరణలోకి దింపి, కళాశక్తిని వినియోగిస్తున్నాను. మీఆశీస్సులే నాకు ధైర్యము, ఉత్సాహమూ ఇచ్చినవి.

ఆనంద: తొలిబొ మ్మైనా, చాలా చక్కగా చేశావు.

కాంతిదేవ: [వెనక కొక అడుగు వేస్తాడు. తల వంచి దీర్ఘాలోచన ఈ షచ్ఛిరోవేదన కనపరచి] మీరు కోరినవిధంగా రేపు ప్రాతఃకాలానికే ఈ చిత్రం మీ కందజేస్తాను. లోపాలు సరిచూచి, చేయబోయే కృతులకు ఆదేశము, ఆవేశము ఇవ్వాలి.

ఆనం: [స్మృతి నభినయించి] నే నావిషయం పూర్తిగా విస్మరించాను. బాగుంది. గురుదక్షిణగా తీసికొంటూ నన్నప్రథమచిత్రము. నాకళాసంపదలో అగ్రసీమ నలంకరిస్తుందిలే... కాని కుంచె తీసికొని ఈభాగం కొంచెం సవరించాలి [చిత్రం చూపి] ముంగురులు సరిగానే వచ్చినవి గాని సీమంతమందంగా రాలేదు. ఐనా కుంకుమాలంకరణం దాన్ని కప్పివేసే విధంగా సుందరంగా చేశావు... అంగుళులలో వైశద్యం బాగా కనిపించాలి.

కాంతిదేవ: కాని మీరు గమనించారు. జీవితంలో వ్యక్తులీవిధంగా కనబడుతూ ఉంటే వారి నెలా దిద్దటం? ప్రకృతిని అనువదించేకళాకర్త ప్రకృతివికృతులను కలిపితే ఏం బాగుంటుంది?

ఆనంద: నే చెప్పేది విని యోచించు. జీవితంలో మామూలుగావ్యక్తులు, సన్నివేశాలు కనిపిస్తున్నా, వాటిని యథామాతృకంగా చిత్రించకూడదు. ఆదర్శత్వ మివ్వాలి.

కాంతిదేవ: ముఖవర్చస్సులో అది సాధ్యమే.

ఆనంద: తదనుగుణంగా పరిణమించే మిగిలినవి.

కాంతిదేవ: కాని ఆదర్శవ్యక్తి సశరీరంగానే ఉంటే?

ఆనంద: చిత్రకారుని కప్పుడు విశేషశ్రమ కలుగుతుంది. చైతన్యమును చిత్రించటానికి ప్రతిభావ్యుత్పత్తులు పూర్తిగా ఉండాలి. నీ కామార్గాలలో శిక్షణ ఇచ్చాను. నీ వెంతవరకు వినియోగిస్తున్నావో?

కాంతిదేవ: మీ ఉపదేశము నింతవరకూ అనుసరించకుండా మెలగలేదు. మీరు విశ్వసించవచ్చు.

ఆనంద: ఉపోదయం కాగానే చిత్రంతో వస్తా ననుకుంటాను. పొద్దు పోయింది. ఏదో పనిమీద పోతూ దారిలోనే ఉన్న నిన్నొక కేక వేసి పోదా మని వచ్చాను. [అని బయలు దేరతాడు.]

కాంతిదేవ: ధన్యుడను అనుగ్రహించాలి [కొంచెం సాగ నంపి] నే నుంటాను. [గురువు నిష్క్రమణ. చిత్రం తీసుకొని కాంతిదేవుడు దుఃఖపూరిత దృక్కులతో, తడబడేచేతులతో, రక్తస్రోతస్సుతో పరువు లెత్తే ఆలోచనా వైరుధ్యంతో ఉంటాడు. కొంతసే పైనతర్వాత నిర్మల ప్రవేశిస్తుంది.]

నిర్మల: ఇంత పొద్దుపోయినాక కూడా మీగురువుగారు శిష్యులయోగ క్షేమాలు కనుగొంటున్నా రంటే ఆశ్చర్యంగానే ఉన్నది. పైగా గురుకులం వదలినవారిని కూడా విచారించటం వేరే చెప్పవలెనా?

కాంతిదేవ; [క్షీణ ఉత్సాహంతో] నీ వింకొక్కసారి సరిగా చూచో వాలి. [అని ముఖం వాల్చుతాడు.]

నిర్మల: ఏం? ఐం దన్నారుగా? మళ్ళీ యెందుకు?

కాంతిదేవ: రెండవ చిత్రం నిర్మిద్దా మని కోరిక కలిగింది.

నిర్మల: ఇ దొకటి కానీయండి. రేపుసాయంకాలం నాకీచిత్రం బహూక రించినతర్వాత మీ రేబొమ్మను చూచో మంటే దానికి సిద్ధము.

కాంతిదేవ: [అవనతశిరస్కుడై అప్రయత్నంగా అశ్రువులు వదులు తాడు. మనిషిలో తొట్రుపాటు కనిపిస్తుంది.]

నిర్మల: నే నే మన్నా నని. మీ రలా ఉన్నారు? అదేమిటి... చెప్పరూ? అపరాధ మేమన్నా నే చేసిన ట్లయితే సవరించుకొంటాను.

కాంతిదేవ: నీ వేమీ చేయ్యలేదు. ఇ దంతా స్వయంకృతమే, పొర పాటున జరిగింది.

నిర్మల: [దీనంగా, అనునయంతో] ఏమి టిది? నాకుకూడా వివరా విప్పరూ? మీసుఖాలలో నాకు భాగ మున్నట్లే, మీకష్టాలలోకూడా ఉండాలి.

కాంతిదేవ: ఇది నీవు వినకూడదు.

నిర్మల: ఏం, నేను విశ్వసింప తగనిదాననా?

కాంతిదేవ: కాదు. నిన్నుగురించే నాకు జాలి, దుఃఖము కలుగుతున్నవి. [ముఖం పై కెత్తి దించుతాడు.]

నిర్మల: నాకోసం మీకు కలిగేప్పుడు, నాసంగతి నే వినకూడదూ?

కాంతిదేవ: వద్దు. తర్వాత నిష్కారణంగా నా మీద కోపం వస్తుంది.

నిర్మల: ఎప్పుడన్నా ఇదివర కట్లా వచ్చిందీ? [అని జాలిగా చూస్తుంది.]

కాంతిదేవ: కాని యిక ముందు వస్తుంది.

నిర్మల: రాదని వాగ్దానం చేస్తాం. చెప్పరూ?

కాంతిదేవ: [క్షణం బెదరినట్లుంటాడు] పొరబాటున అన్నాను. వదిలివేయి నన్ను. నీకు చెప్పకూడదు.

నిర్మల: పోనీ లెండి, దాచుకోండి. మీచిత్రకళకోసం నన్ను పెళ్ళిచేసుకొన్నారు గాని...

కాంతిదేవ: ఇప్పటికే బాధలతో కుమిలిపోతున్నాను. ఇంకా అవిధమైనమాటలుకూడా పడితే ఏ మౌతానో చెప్పలేను!

నిర్మల: నామీద దయ వహించి ఏమిటో చెప్పరూ? [అని ప్రాధేయపడి సమీపించి, చుబుకం చేతితో స్పృశించి, దీనంగా నిలుచుంటుంది. లేని ఓపిక తెచ్చుకుంటాడు అతడు.]

కాంతిదేవ: నీకు వాగ్దానం చేయకముందు, గురుకులంలో నే ఉండగా..

నిర్మల: ప్రథమ చిత్రం సంగతేనా?

కాంతిదేవ: ఆఁ [దీర్ఘం నిశ్వస్య.]

నిర్మల: ఎవరికిస్తానని చెప్పివారు?

కాంతిదేవ: [అప్రియత్నంగా] గురువుగారికి.

[ఆమె నిశ్చేష్టురాలౌతుంది. నెమ్మదిగా భూమిమీదికి జాగిలబడుతుంది. సమీపించి అతడు మెల్లిగా] విస్మృతివల్ల ఈ అపరాధం కలిగింది. క్షంతవ్యు

డను కొంకపోయినా తప్పు మన్నించాలి. [మూతలు పడినకన్నులతో] మాట్లాడవు నాతో? పొరపాటు జరిగింది, ఇక ఎన్నడూ ఈవిధంగా చేయను. నీఆశల నన్నింటినీ తుంచివేశాను. నిజమే. కాని ఏం చేయగలను? ఇందాక గురువుగారు వచ్చినతరువాత పూర్వవాగ్దానము జ్ఞప్తికి వచ్చింది. [క్షణం వాగి] ఇంకొకచిత్ర మిలాంటిదే వ్రాసి నీకు సమర్పిస్తాను. నీవు కోరినన్ని అర్పిస్తాను. ఈవిపత్తునుంచి గట్టెక్కించాలి [మోకరిల్లుతాడు.]

నిర్మల: తక్షణమే బయలుదేరి పోయి చిత్రం గురువుగారి కర్పించి రండి!

కాంతిదేవ: ధన్యుడ నైనాను! నీ వే మనుకుంటావో అని యెంతో తహతహలాడి పోయినాను. నీవు కోరి నన్నిచిత్రాలు తీసుకోవచ్చు. నే నేమీ నీవు కోరినవానిని వినియోగించ దలచుకోలేదు. అన్నివిధాలా దీనిలాగానే ఉండే చిత్రము నిర్మించి నీకు రేపటికే యిస్తాను.

నిర్మల: [అర్థసహితమై, అచేతనా లైనచూపులతో] నా కేమీ అక్కర లేదు. నాకు చిత్ర మెందుకు?

కాంతిదేవ: అట్లా అనరాదు. నీవే కోరుకొన్నావు మొదట [అని నాలుక కరచు కొంటాడు.]

నిర్మల: ఆకోరిక విఫలమైనతర్వాత, అసలుకోరిక అనేదే లేకుండా పోయింది. చిత్రఫలక లతావలయాలలో వ్రాలటానికి మనస్సులో శక్తి లేదు. చిత్రవాంఛలు పారిపోయినవి.

కాంతిదేవ: కాదు, నాప్రార్థన విని నీవు ద్వితీయ చిత్రము తప్పకుండా తీసుకోవాలి.

నిర్మల: నే నేం చేసుకొంటాను దానితో? నా కదేమి ఉపకరిస్తుంది? మీకళాకౌశలం చూచి ఆనందించాలంటే మీరు వ్రాసేబొమ్మలను చూచి సంతోషించవచ్చు! నాకు వేరే ఏమీ వద్దు.

కాంతిదేవ: ఇక లాభం లేదు...గురువులను సంతోషపెట్ట మన్నావు

కాని, నీసంగతి విప్పి చెప్పటం లేదు. మధ్య చిక్కున బడిపోయినాను.

నిర్మల: నాకు శిల్ప మెందుకు? నే కోరినది మిమ్మలిని, మీధీశక్తిని, మీ ఆత్మను! కాని మీచిత్రకళానిపుణతను కాదు.

కాంతిదేవ: కాని చిత్రం కోరుకొన్నావు.

నిర్మల: మీ రాకళను అన్నింటికన్నా అధికంగా ప్రేమిస్తున్నారు. మిమ్మల్ని పెళ్ళిచేసుకొన్నందుకు మీరు ప్రేమించేవాటిని ప్రేమించటమే నా ధర్మము. అది నిర్వర్తించాను.

కాంతిదేవ: ఇప్పటికికూడా చిత్రకళ నధికంగా ప్రేమిస్తూనే ఉన్నాను. నీవు నీ చిత్రాన్ని స్వీకరించక తప్పదు. ఇప్పటికే నావిస్మృతివల్ల కలిగిన ఈ అపరాధానికి హృదయం విదారిత మౌతున్నది. పైగా నీకు కోపశాంతి కలుగలేదు!

నిర్మల: మీరు పొరబాటులో ఉన్నారు. నాకు కోప మేమీ లేదు. మీరు మనసార కళను నిష్కల్మషహృదయంతో ప్రేమించినంతవరకూ, నేనూ అట్లాగే చేశాను. కాని మీలో లోపం కనబడ్డది ఇవ్వాళ్ళ.

కాంతిదేవ: ఏమీ టాలోపం? ఇక ముందైనా జాగ్రత్తపడి దిద్దుకొంటాను.

నిర్మల: అది చాలా కాలంనుంచి వస్తున్నదే. చిత్రకళకు ఆదర్శంగా కూచుంటాననే కారణంతోనే నన్ను వివాహం చేసికొన్నారు. అది నిజమే కదా?

కాంతిదేవ: గట్టిగా చెప్పలేను.

నిర్మల: కాని అందులో చాలా సత్యమున్నదని ఒప్పుకొంటారా?

కాంతిదేవ: తప్పకుండా.

నిర్మల: అక్కడే మీకూ నాకూ భేదము.

కాంతిదేవ: భేదము సమసిపోయే మాదిరిగా ఇకముందు వ్యవహరిస్తాను.

నిర్మల: లాభం లేదు. మనం రెండుభిన్నమార్గాలలో తిరుగుతున్నాం.

కాని కొంతసామ్య మున్నది. దాసితో సుఖంగా జీవించవ చ్చని అనుకొన్నాను. ఇప్పటి కీవిధంగా పరిణమించింది. మీ రనుకొనే కళాప్రపంచంలో నాకు తావు లేదు. ఈచిత్రం గురువు గారి కిచ్చివేయండి. ఇకముందు నన్ను మీకళనుగూర్చి వేధించవద్దు. [పోబోతుంది. అనునయంతో వారించి]

కాంతిదేవ: నామాట ఒక్కటి విని తర్వాత చెప్పు.

నిర్మల: మీరు ముందుగా నాకొకమాట నీయాలి. తర్వాత వింటాను. వాగ్దాన మీయబోయేమ ముందు సరిగా ఆలోచించుకొని ప్రత్యుత్తరము చెప్పండి.

కాంతిదేవ: అలాగే. సావధానుడను.

నిర్మల: నాకోరికను మీరు మన్నించే ట్లైతే, ఇకముం దెన్నడూ దానికి తప్ప, ఇతర వేళలలో చిత్రకళను . . [అని సాభిప్రాయంగా చూస్తుంది. క్షణ మాగి విశ్వాసంతో]

కాంతిదేవ: ముమ్మాటికీ నీమాట అంగీకరించాను. చిత్రకళను నీకై త్యజించగలను. దానికి బదులుగా కొంచెం కాలం మళ్ళీ నీవు వినియోగించాలి. నీచిత్ర మొకటి సిద్ధపరచి రేపుసాయంత్రానికి నీ కర్పిస్తాను. నా మాట తీసివేయక అంగీకరించాలి. నీకోరికను మనసారా పాలిస్తాను: వ్యతిరేకించను.

[విలాస ముట్టిపడే కన్నులతో, లేడిలాగా రివ్వున గంతేసి, పర్యంకం సమీపించి]

నిర్మల: మీ రా చిత్రానికి అసీనురాలుగా ఆజ్ఞ ఇచ్చినప్పుడే సిద్ధము. మీకళాకౌశలమును హరించినందుకు మనస్సుకు కష్టముగానే ఉన్నది! కాని...

కాంతిదేవ: లేదు లేదు. సరి యైనమార్గం. అందుకు కృతజ్ఞుడను...

ఏదీ ఒకసారి సరిగా కూచో. పైపైగీతలు వ్రాసుకుంటాను. సరిపోతుంది. మిగిలిన దీ చిత్రం చూచి వేసుకుంటాను.

నిర్మల: ఇదిగో. నే సిద్ధము! [రంగప్రాంభము దున్న అభినయభంగిమంలో ఆసీన ఔతుంది. చిత్రకారుడు కించిద్దూరములో చిత్రం ప్రారంభిస్తాడు. మెల్లమెల్లగా తెర.]

౧౯౪౩



# మధుర ప్రియ

## శ్రీ వావిలాల సోమయాజులు

[చిత్తూరు రాజమందిర ప్రాంగణము. గిరిధరగోపాల పూజామందిరము ముందు వితర్దికమీద శిలావిగ్రహము. గోసాయిలు ముందు వచ్చి కూర్చుంటారు. సేవకురాలు పూజాద్రవ్యాలు పట్టుకొనివస్తుంటే వెనుక అర్ధనిమీలిత నేత్రాలతో మీరా ప్రవేశిస్తుంది ఒకవైపునుంచి. సూర్యాస్తమయానంతరము. మీరాబాయి రావటాన్ని జూచి]

గోసాయీలు: జై! చిత్తూరు మహారాణీ మీరాబాయికి జై!
జై! చిత్తూరు మహారాణీ మీరాబాయికి జై!!

మీరా: [దగ్గరకు వచ్చి] ఓహో! ఈనాడు కృష్ణాష్టమి. నాప్రభువు జన్మదినము, అందుకనే కాబోలు పూజామందిరము కిక్కిరిసిపోతున్నది గోసాయీలతో... అబ్బా! ప్రభుతుల్యులు, ఎంమంది గోసాయీలు... భక్తబృందానికి వందనాలు!

గోసాయీలు: జై! చిత్తూరు మహారాణీ మీరాబాయికి జై!
జై! చిత్తూరు మహారాణీ మీరాబాయికి జై

మీరా: [నాలుగు దిక్కులు కలయజూచి] మహానుభావులారా! ఎవరా చిత్తూరు మహారాణీ! ఏది? ఎక్కడ?...[నవ్వుతూ] మీరా చిత్తూరుకు మహారాణీ కాదు. ఆమహారాణీ పుట్ట లేదు... మాయారహితుడు, మహాప్రభువు. గిరిధరగోపాలుడికి ఈ మీరా ఆత్మను అంకితం చేసిన ప్రేయసి. కాదు... కాదు... పాదదాసి.

గోసాయీలు: జై! మీరామాయికీ జై!
జై! మీరామాయికీ జై!

మీరా! అతిథులారా! నామనోహరుం పుట్టినరో జని దేశదేశాలనుంచీ సంకీర్తనకోసం వచ్చిన మిమ్మల్ని చూస్తే నాహృదయం ఉప్పొంగిపోతున్నది! ఎందరు వైష్ణవభక్తులు . . నాకళ్ళు చూడలేక పోతున్నవి. జయ పెట్టవలసింది నాకు కాదు... [విగ్రహం కేసి చూపిస్తూ, సమీపిస్తూ] అదుగో ఆ మోహనమూర్తికి . . నామనోనివాసికి . . కాదు నామనోహరుడికి... [దగ్గరకు చేరి కూర్చొని విగ్రహపాదపద్మాలను నిమీలితలోచనాలతో దర్శిస్తూ]

జయ జయ జయ జయ గిరిధరగోపాలా!
జయ జయ జయ జయ గిరిధరగోపాలా!
అలికుల గానోద్భూతామృతరస
లలితతమాలపదాంబుజయుగళా, గోపాలా!

[తల ఎత్తి కేకిపింఛాన్ని నిరూపిస్తూ]

మకుట ఘటిత కేకిపింఛరుచి ఖచిత
సకలాశాపరిపూరిత దివ్యతేజ, గోపాలా!

[కన్నులదగ్గరకు లేచి కలయజూస్తూ]

అక్షయ గోపీతరళ కటాక్ష
క్షీణ మనోహరా రాజీవాక్షా, గోపాలా

[మురళీగానాన్ని అభినయిస్తూ]

రాధాధర మధుర సుధారస ధా
రారంజిత బింబాధర వంశీరవ గోపాలా

[చక్రభ్రమణంతో]

జయ జయ జయ జయ గిరిధరీ గోపాలా!
జయ జయ జయ జయ గిరిధర గోపాలా!

[తన్మయురాలై గోసాయీల మధ్యకు చేరి]

అదుగో నాప్రియుడు నవ్వుతున్నాడు. మనపిలుపు అందింది. ఓహో! ఎంత

రసికుడు... వల్లవీకన్యలమధ్య పిల్లనగ్రోవి మోని... నాకంతొన్ని అనుక రిస్తున్నాడు. కనికరం కలిగింది కొబోలు. అదుగో ఆనీలమేఘం ఆ దేమిటి ... అబ్బా! ఏమి టా మెరుపు దాటికి పైగా... [అనుమానించినట్లు పరికించి మిలా మిలా కళ్ళార్పి] ఔను . . ఔను తెలిసినది . . అంతే. నామనో నాథుడు గోలోకంనుంచి బయలుదేరి వస్తున్నాడు... ఆ ఆషాఢమేఘచ్ఛా యలు ఆయనదేహకాంతులు... ఇదిగో మన మంతా నీలనీలంగా మారి పోతున్నాము... అయ్యో! కాంచనాభరణాలను త్యజించిన నా ఒంటిమీద బంగారపురుద్రాక్షల జపమాలలు నిలుపుతూ నిముషంలో మటుమాయమై నిముషంలో జ్యోతిష్మతులను వెలిగించే ఆకాంతు లేమిటో తెలుసునా? నా హృదయపతి కేకిపింఛసంకాశం. నెమ్మది నెమ్మదిగా... నాకోసకు . . ఔను నాకోసకు దిగి వస్తున్నాడు . . ఎందుకు రాడు, వస్తాడు... ఇద్దరమూ చిన్ననాటినుంచీ స్నేహితులను... మాఅమ్మపక్కలో నేను. నాపక్కలో నాహృదయపతి... అడుగో మరీమరీ దగ్గిరికి వస్తున్నాడు... [గోసాయిలకేసి చూస్తూ] మీ రేమీ చూడటము లేదూ! అలా భిక్షముగాలు వేసు కొని కూర్చున్నా రేమిటి? [ఒక గోసాయి దగ్గిరకు వచ్చి] స్వామీ! నా మనోహరుడు మీకు కనబడటం లేదూ?

గోసాయి: [లే దన్నట్లు తల తిప్పుతాడు.]

మీరా: [మరొక గోసాయిదగ్గిరకు వచ్చి] మహాత్మా! మీకో?

గోసాయి: ఏ దమ్మా తల్లీ, ఎక్కడ! నీది వట్టి భ్రాంతి!

మీరా: అ దేమిటి స్వామీ, కళ్ళఎదుట అలా కనిపిస్తూ ఉంటేనే!

గోసాయి: ఇ దేమి టమ్మా! ఎన్నడూ, కనీ వినని దీచిత్రం... నీది వట్టిభ్రాంతి. ప్రభు వేమిటి? మనదగ్గిరికి రావడ మేమిటి? రూపగోస్వా ములు ఎన్నడూ చెప్పలేదే. దేహయాత్రి చాలించి మనమే గోధామంలో ప్రభువును కలుసుకుంటాము, గాని ఇదేంమాట? ఎన్నడూ వినలేదు...

మీరా: చాలులే మహాత్మా, చాలులే! అబ్బా! ఎక్క డేమిటయ్యా

స్వామి! [జరిగిపోతూ మరొక గోసాయితో] తేజోమూర్తులు తనకు తప్పకుండా కనిపిస్తూంటా డనుకుంటాను.

గోసాయీ: తల్లీ! దూరంగా ఏదో లీలగా కనిపిస్తున్నది.

మీరా: కాదు కాదు మీకన్నులు ఆయనవెలుగును భరించలేక పోతున్నవి... అడుగో ఆయన వచ్చేస్తున్నాడు. నేను ఏం చేసేది స్వామీ! ఏమి చెయ్యమన్నారని? ఆయన వచ్చేదారిలో దుమ్ము అంటుకుంటుంది కాబోలు. పూవులు చల్లి రానా? వద్దు వద్దు. పమిట పరిచి వస్తాను. అర్ఘ్యానికి జలం సిద్ధం చేసుకోనా? అవసరం లేదు. హర్షాశ్రువు లున్నవి కదా! వస్తున్నాడు కదూ నామనోనాథుడు!

గోసాయీ: అవు నమ్మా! తల్లీ, ఏదో తేజోవిగ్రహం. మనవైపుకే కదలి వస్తున్నది... [తన్మయుడై] తల్లీ! [మెడలో చెయ్యి పెట్టి హారం బయటికి తీసి] ఇదిగో ఈహారం వేసి అర్చించు... [చేతికి అందిస్తాడు.]

మీరా: [చేతికి హారం తగిలేటప్పటికి స్మృతి వచ్చి] ఏమి టిది? నేను ఇందాకటినుంచీ ఏలోకంలో ఉన్నాను? ఈపూజామందిరానికి ఎలా వచ్చాను? ఇదుగో వీ రంతా గోసాయిలే... అయితే నామనోనాథుడు ఏడీ... తిరిగి వెళ్ళిపోతున్నాడు [కన్నీటిలో] వెళ్ళిపోతున్నావా నాథా! [గోసాయిని చూచి] నీవు గోస్వామివి కాదు. ప్రేయసీప్రియులమధ్య అడ్డు పడేపిశాచానివి! మ్లెచ్ఛుడివి! పో! అవతలికి పో! ఇక్కడ ఉండ వద్దు!

గోసాయీ: కోపించకు తల్లీ! మహానుభావునిలీలలు అతిమానుషాలు. నన్ను హారం ఇవ్వమన్నట్లు సైగ చేశాడు. తాను తిరుగుళ్ళి మొగం పట్టాడు. నాతప్పు ఏ ముందమ్మా?

మీరా: [తగ్గి] నిజమే! స్వామీ! నన్నే ఇల్లా అనేకమాట్లు మోసగించాడు. క్షమించండి మహాత్మా! ప్రేమోన్మాదంలో ఏదో పిచ్చిగా మాట్లాడాను.

గోసాయి: తల్లీ! నీమనస్సు నాకు తెలుసును. చింత పడకు.

మీరా: చింతపడకుండా ఎలా ఉంటాను? [విగ్రహానికేసి చూచి] మోసగించావా నన్నట్లుగా మొలకనవ్వులలో ఈవిగ్రహం చాటున... లోపల్లి... దాక్కొని నవ్వుతున్నాడు. ఈహారము మెడలో వేసి మళ్ళీ రమ్మని చెంత పెట్టుకుంటాను. [విగ్రహంవైపు నడుస్తుంటుంది.]
[పరివేళము సేవకురాలు... చేతులో పూలబుట్ట... గంట కొట్టుతుంది... మీరా వెనక్కి తిరిగి] ఎవరు? గిరిజా?

గిరిజ: [వంగి నమస్కరిస్తూ] దేవీ! శ్రీ శ్రీ కుంభరాణావారు ఈనాడు గిరిధరగోపాల దేవుణ్ణి వనమాలికలతో. కాదట. ఈసెజ్జలో పూల మాలికలతో అలంకరించమని దేవరిని ప్రార్థిస్తున్నా మని విన్నవించి రమ్మన్నారు.

మీరా: [ఉద్వేగంతో] గిరిజా! గిరిజా! ఏమి టిది? సత్యమేనా? కుంభ రాణా మాటలేనా ఇవి? ...ఇలా "గిరిధరగోపాల" నామం రాణా నోట ఉచ్చరించాడా... 'వనమాలికా' నీవు కల్పించింది కాదు కదా! నన్నూ ఉద్దేశించి ప్రార్థిస్తున్నా నన్నాడా?

గిరిజ: [చెప్పలేక చెపుతూ] అ...అ...వు...వు...ను దే...వీ

మీరా: ఏమి టాతడబాటు?

గిరిజ: ఏమీ లేదమ్మా! అది నాసంతోషము. [సెజ్జ అందిస్తుంది]

మీరా: [అందుకుంటూ] మహాత్ములారా! మీరాకవల్ల నేడు చిత్తోడు నిజంగా వైష్ణవభక్తలోకంగా మారిపోతున్నది. కుంభరాణావంటి భూతేశ శిష్యుడు గోధామదర్శనాన్ని కోరుతున్నాడు.

గోసాయిలు: జై కుంభరాణా మహారాజుకు జై!
జై కుంభరాణా మహారాజుకు జై!

మీరా: [విగ్రహాన్ని చూస్తూ] ప్రభూ! ఇదిగో వస్తున్నా. నిన్ను అలంకరిస్తా. గిరిజా! వెంటనే వెళ్ళి కుంభరాణావారిని సంకీర్తనానికి రమ్మని

దేవి పునః ప్రార్థిస్తున్నదని చెప్పు! పో, త్వరగా పోయి విన్నవించు.

గిరిజ: చిత్తము దేవీ! [నిష్క్రమణ]

మీరా: ఈ పూలమాలికలతో అలంకరించి స్వామిని తిరిగి రమ్మని ప్రార్థిస్తాను [అని తత్తరపాటులో గోసాయి ఇచ్చినహారం వేస్తుంది... పెట్టెను మూత తియ్యకుండా అక్కడనే కింద పెట్టి ఆపుకోలేని ఉత్కాంఠతో]

నిదుర ఎరుగనికనుల నీకోరకే! నీకోరకే!
ఒక్కతెనై యీ రేయి చుక్కలలో ఓ నాథ!
విశ్వమంతా నిదుర తెలిముసుగు వేసుకొన్న
వెన్నెలల బయలులో విరహినై నిలచితిని.
పెంచుకొన్నా నోయి ప్రేమలత కన్నీట
బాధ యని ఎరుగ నిక పలుక ప్రేమించ మని.
నా విరహగాథలను నడికి రేయిక్కి చెప్పుతు
సగము రాతిరి నొక్క యుగముగా గడపితిని

నాథా! ఇంతటికైనా దయ రాదా! ఈ దీనవిరహిమీద మళ్ళీ ఒకమాటు నీ అపాయవీక్షణము ప్రసరించదా! ఆరాధ్యా! ఎన్నియుగాలైనా రావు నాథా! కానీ మీరా ఈ విరహవేదనాగ్నికి ఇంధనమై కాగి కృశించి కృశించి నశించిన వెనుక నా? వచ్చి ఏమి ప్రయోజనము? అబ్బా!

[నెమ్మదిగా నేలమీదికి ఒరుగుతుంది]

గోసాయీలు: [కలకలము]

ఒక గోసాయి: నిశ్శబ్దము. అరవకండి... అజ్యోతీను మహాభక్తురాలు భక్తితన్మయత్వంలో మూర్ఛపోయింది... గోల వద్దు ... చప్పుడు చెయ్య వద్దు... భయపడకండి.

మరొక గోసాయి: కూర్చోండయ్యా, కూర్చోండి.

మరొక గోసాయి: ఇష్! నిశ్శబ్దం.

మీరా: [నెమ్మదిగా తెప్పరిల్లుకొని లేస్తుంటుంది]

గోసాయీలు: జై మీరా మాయికి జై!
జై మీరా మాయికి జై!

మీరా: [విభ్రాంతితో నే] ప్రభూ! ఎన్నాళ్ళని నిద్రాహారాలు లేకుండా వియోగంతో... ఇస్ [ఆలోచన అభినయించి] ఏమి తప్పు చేశాను... [దృష్టి రాణా పంపిన సెజ్జమీద ఉంచి] అవును... నిజమే... తెలిసింది. తప్పు చేశాను. రాణా ప్రభుభక్తుడైనాడు... రాణా ఆజ్ఞను ధిక్కరించాను... మొదట గోసాయి యిచ్చినహారంతో నాథుణ్ణి అర్చించాను... అబ్బా, ఎంతతప్పిదం చేశాను... ప్రభో, క్షమించు. ఇదుగో నీమెడలో వేసి కళ్ళార చూచి ఆనందిస్తాను. [సెజ్జ కొని దగ్గరకు తీసుకొన్ని తియ్యటానికి చెయ్యి పోనిస్తుంటుంది. చివరగోసాయి ఆతని మిత్రుడు లేచి వెళ్ళిపోతారు]

విరజ: [గంట కొడుతూ ప్రవేశించి ఆతురతతో] అమ్మా! అమ్మా, ముట్టుకోకు... ముట్టుకోకు... తియ్యకు! తియ్యకు! అవి పుష్పమాలికలు కావు! సర్వాగ్నిజ్వాలామాలికలు! రాణా, శివారాధకుడు అన్నసంగతి మరచిపోయినావా తల్లీ!

మీరా: [ఆశ్చర్యచకితయై] విరజా! ఏమి టీతొందర?

విరజ: తొందర ఏమిటి తల్లీ! నిమిషము ఆలస్యమైతే కొంపలు అంటుకొపొయ్యేవి.

మీరా: ఏమిటి!

విరజ: అమ్మా! ఇందాకటినుంచీ తమచేతులో హార మేదో ఉన్నదట గా

మీరా: అదిగో! నాస్వామిని దానితో అర్చించాను... అయితే—

విరజ: దాన్ని రాణా ఎక్కడినుంచో మీచేతులో ఉండటము చూచాడు.

మీరా: అయితే దాంట్లో తప్పే ముంది. ఈగోసాయీ నాకిచ్చారు [అని చూస్తే గోసాయీలు కనిపించరు ఆశ్చర్య పడి] ఆఁ!

విరజ: అది ఢిల్లీచక్రవర్తి అక్బరుపాదుషాను కానుకగా ఇచ్చాడట! రాణా మిమ్మల్ని అనుమానించి... [సర్పాలపెట్ట చూపుతుంది]

మీరా: మహాగాయకుని తాన్సేనును వెనుక పాదుషా ఒకనాటి సంకీర్తనతో తమమందిరాన్ని పవిత్రంచెయ్య మనికోరి రమ్మని పంపించాడు. నేను అంగీకరించలేదు... పాపము సంకీర్తన వినటానికి గోసాయీ వేషంతో ఎంతదూరం నడిచి వచ్చాడు... అబ్బా, ఎంత భక్తుడు... ఎక్కడనే వుంటే బయట పడతానని కాబోలు వెళ్ళిపోయినాడు... విరజా! నీమాటలు సత్యమేనా? అవి సర్పములేనా?..

విరజ: తల్లీ! నీ కనుమాన మైతే మొదట నన్ను తియ్యనిచ్చి చచ్చిపోనీ...

మీరా: ఏమైనా సరే! నాప్రియుడు నన్ను పరీక్షిస్తున్నాడు. ఇదంతా ఏమిటో నాకు అర్థం కానటము లేదు... ఈ విచిత్రవరపరీక్షలో నే నెందుకు వెనకపడి పోతాను? పడను ముమ్మాటికీ పడను. అవి సర్పమాలికలైనా సరే ప్రభుని అలంకరించక తప్పదు... [కొద్దిగొంతుకతో చెయ్యి పెట్టకము దగ్గిరికి పోనిస్తూ]

జయ జయ జయ జయ గిరిధర గోపాలా!
జయ జయ జయ జయ గిరిధర గోపాలా!

[అంటూ నెమ్మదిగా మూత ఎత్తుతుంది... అందులో పూలమాలికలు కిలకిలా నవ్వుతవి. మీరా విరజమొగం చూస్తుంది. ఆమె ఖిన్నవదనంలో తలవంచుకుంటుంది. పూలహారాలతో విగ్రహాన్ని అలకరించి గోసాయీలు మీరా సంతోషాధిక్యంలో కొద్దిసేపు

జయ జయ గిరిధర గోపాలా జయ జయ గిరిధర గోపాలా

[అని సంకీర్తన చేస్తారు. తరువాత నిశ్శబ్దము]

మీరా: ప్రభూ! పూలదండలతో కులుకటమేనా? పూబోడిని మరచిపోయినావా? ఇప్పుడైనా రావా? నాథా! నోట మాటే రాదుగదా! మూగి

వాడవా? కావే! మురళీమోహనమూర్తివే! నాయీకష్టాలను ఎప్పటికి ఈడేరుస్తావో కదా! ఈజగత్తుతో నాకు ఏసంబంధమూ లేదు. ఇంక అసలే వద్దు. తల్లీ, తండ్రి, రాణా అందరూ నాకు కాని వాళ్ళే... నిన్ను ప్రేమిస్తే ఏమో వచ్చిపడుతుం దని ఉద్ఘోషించారే మహాత్ములు!... ఏమి వచ్చింది నాకు...వచ్చింది...ఆః ఏమిటి? పట్టివేదన... చిన్నతనంనుంచీ, నీధ్యానాన్నే స్మరిస్తూ, పలవరిస్తూ ఉన్న దాసిమీద ఇంతనిర్దయా ప్రభూ! నీనామస్మరణకు శిలలు ద్రవిస్తు వస్నారే... నీహృదయ మింత పాషాణమే మరి? మెరపు మెరసినట్లు కనబడి తప్పించుకొనినావే! నాథా! గోధామంలో నీవూ నేనూ ఒకసెజ్జమీద ఉన్నట్లు కలలు కన్నాను నాథా! అవి ఎప్పటికైనా ఫలించేవేనా? ఎన్నాళ్ళకైనా ఊహాసౌందర్యామృత పానమేనా మీ అధరామృతపానం నాకు లభించదా?

రాణా: [చేతిలో పాత్రతో ప్రవేశించి విచిత్ర కంఠంతో]; ప్రేయసీ! మీరా! నీపరిపూర్ణానురాగానికి మెచ్చుకున్నాను. ఇదిగో... అమృతపానం చెయ్యి... [విషపాత్రిక అందిస్తాడు]

మీరా: నాథా...నాథా...గోధామమునుంచి వచ్చావా... ఎటునుంచి వచ్చావు... అమృతమా ... నాకోసమా ప్రభూ... ఏది? ఏది? [విష పాత్రిను అందుకోబోతూ]

దాసిమీరా పైన దయ కలిగెనా నేడు
అమృతపాత్రిక నీయ వరుడెంచినావా!
ఓనాథ, ఓనాథ!
జాలమే నోయి నే నాలసింపగ నేల?
అమృతపాత్రిక నిమ్ము, ఆరగించెద నోయి!
నీవె నేనై నాథ! నేనె నీవై నాథ!
మీరాకు జన్మమిక మిథ్య యేనా నాథ
ఓనాథ, ఓనాథ!

[అని అందుకొని గుటగుటా తాగి] అబ్బ...హాఁ హా... [మెల్లమెల్లగా నేల మీదికి ఒరుగుతుంది]

వనజ: [పరుగెత్తుకుంటూ ప్రవేశించి] అమ్మా! అమ్మా! అప్పుడే తాగేశావా! నేను పరుగెత్తుకుంటూ వచ్చేలోపలనే ఎంతపని జరిగింది! అది కాలకూటవిషము తల్లీ... [రాణావైపు చూచి, చకితయై] ప్రభువే స్వయంగా వచ్చి ఇచ్చారా! అయ్యో! అయ్యో! [అని పక్కకు తొలిగి ముఖము ఎదుటికి వచ్చి నిలువబడుతుంది]

రాణా: [మీరాతల వైపుకు వచ్చి నిలువబడతాడు]

ఒక గోసాయి: [ఉగ్రుడై] రాణా! మహాభక్తురాలికి విష మిచ్చి పాతకానికి ఒడి కట్టావు!

మీరా: [మెల్లమెల్లగా లేస్తూ] నా నాథుడు నేనూ ఇద్దరమూ ఇప్పుడు ఇక్కడనే మాట్లాడుతుంటిమే! ఆయన ఏమైనాడు? ఎక్కడికి పోయినాడు? బృందకు పోవా లన్నాడు వెళ్ళాడా!
[పరికించి] ఎవ రిది? గోస్వామి! ఇ దెవరు? రాణా!

రాణా: [గద్గదకంఠంతో] దే...వీ!

మీరా: [నిశ్చేష్టురాలై] రాణా!

రాణా: దేవీ! నీభక్తి ఇంత మహత్తరమైన దని ఎరుగక అనుమానించి బాధపెట్టిన వాణ్ణి.

మీరా: కాదు, కాదు. పరమాత్మస్వరూపుని మనోనాథుని చూపించిన పుణ్యాత్ముడవు.

రాణా: క్షమాపణ అర్థిస్తున్నాను దేవీ! నిన్ను ఎన్నో బాధలు పెట్టాను [మోకరిల్ల బోతాడు].

మీరా: కాదు, కాదు. [అని వారిస్తూ తానే మరీ వంగి నమస్కరించి] పొరబాటు, రాణా! నీమూలకంగా ప్రభువు నన్ను పరీక్ష చేశాడు నీలోపమూ ఇక్కడ ఏమీ లేదు.

రాణా: దేవీ! మహారాజుననే భ్రాంతిలో మత్తెక్కిననా కేదైనా తరణోపాయం చూపించి అనుగ్రహించమని ప్రార్థన!

మీరా: గురుజ్ఞానముతప్ప వేరేమార్గము ఏమీ లేదు. వెళ్ళి వస్తాను నాకు సెలవివ్వండి.

రాణా: దేవీ! ఎక్కడికి?

మీరా: ఎక్కడి కేమిటి? బృందకు. నాప్రభువు బృందలో ఉంటాడు. పోయి ఆయన్ను కలుసుకోవాలి. ఇక నాకు అమృతత్వం తప్ప వేరే లోక యాత్ర లేదు.

రాణా: [నిశ్చేష్టుడై నిలువబడతాడు.]

మీరా: బృంద బృంద బృంద భక్తలోక మందారమే బృంద
బృంద బృంద బృంద సాధులోక చంద్రికయే బృంద

[గోపాయీలు ఆమెను పాటలో అనుసరిస్తారు. రాణా కనుచూపుమేర వరకూ వంగి నిలుస్తాడు.]



౧౯౪౩



